# విజ్ఞప్తి.

సీ. ఆంధ్ర దేశమునందు నవతరించిన వాఁడ
గణనాథు పూజను గడపు వాఁడ
భవనాశరాజ సద్భామిని శాంతమాం
బకు తనూభవునిగా బరఁగువాఁడ
పావనం బౌ భట్ట పదమును బిరుదమున్
గల రాచకొలమున గలిగినాఁడ
జగు నైషధాది గ్రంథంబులు రచియించి
యీశున కే కృతు లిచ్చినాఁడ

గీ. బ్రాహ్మణామర వేద గోభక్తియుతుఁడ
ధాత్రియందు నాంగీరస గోత్రజుండ
జినపసీని గృహాఖ్యను జెలఁగువాఁడ
సూర్యనారాయణ నృపుండ సుజన హితుఁడ.

గృహస్థుఁడా! నీజన్మము హైన్యముగా జరుగుచున్నందు లకు దేవుని నీ తలిదండ్రులను దూషింతువు గదా! ఈ జన్మమున సుకృతమార్గముల గొన్నముందు జన్మము సుఖము గల్గు నని శాస్త్రములు చెప్పుచున్నవి. రెండవ జన్మమునకు నం వరకుగాక నీకు రెండవజన్మమగు పుత్రరూపమున గొప్పవా గనగల్గినచో దేవకీ వసుదేవులు కృష్ణునివలె వాని సాయమున నిహపర సుఖములంద గలవు.

ఇట్లు,
జినపసీని సూర్యనారాయణరాజు,
సాధుపక్షస్థుఁడు — గ్రంథకర్త.

ఓం

వినాయకాయనమః.

# లోకైక కళ్యాణ గృహస్థుడు.

యిది గీత 16 అ. 'దైవీసంపద్విమోక్షాయ, నిబంధాయాసురీమతా' అను శ్లోకాంధ్ర భాష్యముగా గ్రహింపనగును. దైవీసంపద కైవల్యాము నకు అసురీసంపద బంధింపబడుటకు ఉపయోగపడును గాన దైవీసంపద సంతానము వృద్ధిచేసి అసురీ సంపద సంతానమును వృద్ధిచేయకుడు.

---

భూలోకమున యిందుగల సత్సంతాన సృష్టిమార్గ విషయమై సర్వ జాతీయ గృహస్థులు భారతీయశాస్త్ర ధర్మప్రకారముగా వేయు సర్వవిధ ప్రశ్నలకు సమాధాన మిచ్చుటకు కంకణము కట్టుకొని యున్నాను.

---


సాధుపక్షస్థుడు – గ్రంథకర్త.

**జినపనీని సూర్యనారాయణరాజు**

తణుకు.



**1955**

సర్వస్వామ్యసంకలితము] [వెల రు. 2—0—0

# కృ త జ్ఞ త.

---

నాచే రచింపబడిన లోక కళ్యాణ గృహస్థుడను పుస్త కమును జూచి సంతసించి దీన లోకైక కళ్యాణమగునని తలంచి దీనిని ముద్రింపించుటకు

శ్రీ మతుకుమిల్లి సత్యనారాయణమూర్తిగారు,
శ్రీ మతుకుమిల్లి దొరరాజుగారు,
శ్రీ మతుకుమిల్లి వీర్రాజుగారు, (గ్రామ మునసబు)
శ్రీ ఉండవల్లి సూర్యనారాయణమూర్తిగారు,
శ్రీ ఉండవల్లి అప్పారావుగారు,

రావులపట్టు, తాడేపల్లిగూడెం తా॥
పశ్చిమ గోదావరిజిల్లా.

ధనసహాయ మొనర్చి యశమునందు చున్నారు. వీరు చేసిన సాయమునకు సంతసించి విద్యాదానము చేసుకొనుటకు కొన్ని పుస్తకముల నిచ్చితిని. ఇట్లెవరైన చేసిన యెడల నిట్లే చేయబడును. ఈ గ్రంథమునుగాని, యిందలి భాగము లనుగాని అనుమతి లేనిదే అనువదించుటగాని, ముద్రించుట గాని చేయరాదు.

ఇట్లు,

సజ్జాపురం, తణుకు — ప. గో. జిల్లా } జినపసీని సూర్యనారాయణరాజు
సాధుపక్షస్థుడు — గ్రంథకర్త.

# భ గ వ స్తు తి.

సీ. ఏ పాటపాడిన యీవు జేరుదువొకో
ఏ మార్గమున నీవు ఎదురు పడుదో
ఏ రీతి పొగడిన యీవు సంతోషింతో
ఎట్టు నిన్ గొల్వ చేపట్టుదొకో
ఏ జపంబొనరింప యీవు గన్పడుదొకో
ఏ తపంబును సల్ప ఏలుదొకో
ఏ కర్మమున ప్రేమ నీకు జనించునో
ఏ నడవడి నీకు హితవు పడునో

గీ. నీరజేక్షణ యిటువచ్చి నీవు దెల్ప
పరమయోగులు మాత్రమే బాగుగాంత్రు
గాని సన్మార్గదుర్మార్గ మానవాళి
దాటుదురె లోకపంక్తు లేనాటికైన.

శ్రీ సర్వమంగళా దేవినిగూడి సంతసించు యీశ్వరుని కీ కృతినిచ్చితిని. ఆ మహేశుడు మాకు సర్వసాధు జంతు జాలమునకు సర్వసౌఖ్యములు నిత్యానందమిచ్చు గాత.

సీ. భువిమహా పురుషులౌ పుత్రులబుట్టింప
దలచిన నీ యాడదాని వలనె
ఘనసౌధ గణములు గట్టి సుఖింపంగ
దలచిన నీ యాడదాని వలనె

ధన భూమి కన్యాది దానముల్ సేయంగ
దలచిన నీ యాడదాని వలనె
తనివిదీర గృహస్థధర్మముల్ సలుపంగ
దలచిన నీ యాడదాని వలనె

గీ. అతిథు లభ్యాగతుల్ దేవతాది సుజన
తతుల పూజింప నీ యాడదాని వలనె
ధనదహితు జేర నీ యాడదాని వలనె
కాదె నీవొక్క డవె యిన్ని గాంచ గలవె
నిన్ను సుతునిగా గని సాయ మెన్న జేయు
జాయహర్షంబు గొననివి జరుగు మనుజ.

సీ. వంశక్షయ మొనర్చు వ్యభిచారగణముల
ధనము నపహరించు కన్నగాండ్ల
సాధువర్తనుల మిత్రద్రోహ మొనరించు
చున్ జీవనము జేయు దోసకాండ్ల
దేవుడున్నా డను గ్రంథాల సత్యమున్
బోధించు ననెడి నాస్తికగణాల
న్యాయాధికారుల మోల నబద్ధ సాక్ష్యము
లిచ్చి జీవించు మొండి జనుల

గీ. రకరకాల దుర్మార్గాల దిరుగు జనుల
నీకు పరుల కసౌఖ్యము లిచ్చు కొరకె

గేస్తుడా నీవు నీరాణి సృష్టి జేసి
దేవు డొనరించె నను టనృతంబు గాదె !

గీ. తలప శ్రుత్యాది యుక్తగ్రంథ మిదిగాన
సకల దేశముల వసించుజనులు దీని
దారులన్ బోయినన్ సుసంతానవృద్ధి
యగుట కనుమాన మిసుమంత యైనగలదె!

ఇట్లు,
"లోకైక కళ్యాణ గృహస్థుడు" అను
గ్రంథరచయిత – సాధుపక్షస్థుడు,
జినపనీని సూర్యనారాయణరాజు.

ఓం

# లోకైక కల్యాణ గృహస్థుడు.

# మానవసృష్టి-గొప్పతనము.

## ఆటం హైడ్రోజనాది బాంబులు గొప్పవియా? సన్మేధావంతులగు మహాపురుషుల సృష్టించుట గొప్పదియా?

ఐన్‌స్టీన్‌వంటి అణుశాస్త్రజ్ఞులు నేడు పెద్దపేరు గాంచుచున్నారు. కాని ఆటమాదుల మానవుడు సృష్టించునుగాని మానవుని ఆటమాదులు సృష్టించుటలేదు. ఈ బాంబులు దుష్టులదరినున్న జగన్నాశనము. సాధులదరినున్న జగత్కల్యాణమును చేయగలవు. గాన భూలోక సర్వదేశములవారు గొప్ప మేధావంతుల సృష్టించుచున్న జగన్నాశన కరదుష్టములనుండి భయపడక వాటిని నశింపజేయుశక్తి గాంచగలరు. ఉదా॥ కృష్ణార్జునులు, రాముడు. రావణ అశ్వత్థామాస్త్రముల నుండి భయపడక వారిశక్తి నశింపజేసిరి. భారత పూర్వర్షులు భూ, జల, అగ్ని, వాయుశబ్దాణువుల బద్ధలజేసి దాని ఉపయోగము దుష్టనాశనమున కెక్కుడుపయోగించి సాధువులకు సహాయము చేయుచు వీటివల్ల గొప్పఉపయోగములేదని అణురూప మనోజీవుల బ్రద్దలుజేసి రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులుగామారి, వాక్యముచేతనే దుష్టనాశనము సాధు

రక్షణచేసిరి. మరియు దుష్టులను సాధువులుగామార్చిరి. గాన అట్టి గొప్పమానవుల సృష్టించుమార్గములు సంస్కృతమున గలవు. అవిచదివిన కొందరికర్థమైనను కొందరి కర్థము గాకయు విడిచిరేగాని ఆచరించుటమానిరి. గొప్పధర్మము లాచరించుట దైవీసంపదవారి లక్షణము. గొప్పధర్మము లాచరింపకపోవుట ఆసురీసంపద లక్షణముగదా. కొన్ని వేలేండ్ల నుండి ఈసృష్టిప్రచారము ఈమధ్య కవులు ప్రచారము చేయలేదు. దాన దీని విమర్శతగ్గినది. ప్రతివారును చదివిన నానాసృష్టులను సృష్టించగల అవకాశము గలుగదు. కొన్ని సృష్టులు స్వాధీనమగును. పూర్వము రామాయణమున విష్ణు, ఇంద్రాది దేవతల ఒక్కొక్క గృహస్థుడు ఒకనిని గనగల్గిరి. ఆ సృష్టియంతయు ఒకడే సృష్టించలేదు. అట్లే నేను అనేక విధముల సృష్టుల నెరింగినను ఆడపిల్లలుపుట్టునాకు మొగపిల్లలు గనుటచే నేను చెప్పిన కొందరు మగపిల్లలు గనుటచే నమ్మకమై గొప్పసృష్టి చేయనెంచిన, సంతానమాగినది. దాన విచారించక భారతర్షి వాక్యములు గొప్పవని నమ్మకముగల్గి స్థితికన్న సృష్టితోనే ఎక్కువ జగత్కల్యాణమగుననే తలంపుతో ఈ లోకైకకళ్యాణ గృహస్థుడను పుస్తకము వ్రాసితిని. ఈపుస్తకము శ్రద్ధతో చదివి అవతారపురుషుల, మహర్షుల, బ్రహ్మర్షుల, వన్మేధావంతులాది సత్సంతతినిగని భూలోకస్థులు సుఖింతురు గాక !

---

# లోకైక కల్యాణ గృహస్థుడు.

## తొలి పలుకు.

ఓ మనుష్యుడా! ఎచ్చటనుండి భూలోకమున కెట్లు చేరితివో నీ వెరుంగవుగదా. కొంతకాలముండి మరెచ్చటికి పోయెదవో అదియు నీవు తెలిసికొనలేవు. నీవిచ్చటనుండునది స్వల్పకాలమే. దుష్కామమువిడిచి నిష్కామ సత్కామ మార్గముల యీ స్వల్పకాలమైనను నీవు నడువగలుదువేని యిహపరసుఖ మొందగల్గుదువు. లేనిచో నాశముతప్ప మరేమి గలదు?

కృష్ణయజుర్వేదము:— "అన్నం సామ్రాజ్యానామధిపతిః" యీ జగమునగల్గునా నారాజ్యములకు అన్నమే అధిపతియైయున్నది. అనగా అన్నవృద్ధి చేయుటయైయున్నది. దానిని నీ వాశ్రయించినగాని జీవించవు. అందుచే అది రాజైనది. దానిని వృద్ధిచేయునదియే రాజ్యము.

తైత్తిరీయోపనిషత్తు:—

మం॥ అన్నాత్ ప్రాణః ప్రాణాద్బలః బలేనతపః
తపసాశ్రద్ధా శ్రద్ధయామేధా, మేధయా మనీషా,
మనీషయా మనః

మనసాశాంతి, శాంత్యాచిత్తం, చిత్తేన స్మృతి, స్మృత్యా స్మారం, స్మారేణ విజ్ఞానం, విజ్ఞానేన ఆత్మానం వేదయతి (విందతి). మానవమలము పందిపెంట తత్తుల్యమగు యెరువులువేయక వర్షోదకము పాతాళగంగలచేగాని పరిశుద్ధ

నదీనీరములచేగాని పండినపంటవల్లగల్గు అన్నముతినిన ప్రాణ వాయువు వృద్ధియై సౌఖ్యమిచ్చును. దాన బలముగల్గును.

యీ బలముగలిగిన దుర్మార్గమున కన్నులుగానక పరులబాధించుచు అక్రమమార్గముల నడువక సన్మార్గుడవై నిష్కామముగా భగవంతునిగూర్చిగాని సత్కామసిద్ధికై యింద్రాది దేవతలగాని పూజించుచు తోడి సాధుజనులకు మహోపకారివై దుర్మార్గుల సహవాసముమాని చరియించుటే తపము సేయుట యిదే సాధుమార్గము ధర్మమార్గము. దాన శ్రద్ధఅనగా యీ మార్గమందెక్కుడు ప్రీతిగల్గుట, దానమేధా గల్గును. మేధ అన, నీకు కావలసిన విద్యాధనాది వస్తు సంగ్రహణము ధర్మమార్గమున సంపాదించు శక్తిగల్గును. దాన మనీష అన మంచిబుద్ధియు, దాన మంచిమనస్సు, దాన శాంతి గల్గును. (యిదే కైవల్యమార్గము, యిట్లు నడచిన భగవంతుని చేర్చునని కొందరు ఋషులనిరి.) శాంతిచే చిత్తశుద్ధి, దాన స్మృతి, అన భగవంతునిగాని యింద్రాదిదేవతలగాని సాధు పురుషులగాని పూజించవలెననెడి జ్ఞాపకశక్తిగల్గును. (అనగా ప్రతిది మరిచిపోవువాడు మానవుడు. అపస్మారము మానవుని కెక్కువ గల్గియుండును. అట్టిదిలేక నిత్యము భగవదాదుల పూజింప దగుననుమార్గము. మరువకుండచేయు జ్ఞాపకశక్తి, గల్గును) దాన స్మారము అన స్మరణచేయుట. అనగా భగవ న్నామస్మరణచేయుట జపించుట స్తవముచేయుట, మొదలగు నవి చేయించు సచ్ఛక్తిగాని, అట్టి యింద్రాదిదేవతల తన

సహాయార్థము స్మరణచేయుట జపముచేయుట, స్తవముచేయుట మొదలగునవి చేయించు సచ్ఛక్తిగాని అట్లు జగమున సాధు పురుషుల సాధుస్త్రీల గౌరవించుట సాధుజంతు సాధుపక్షి సాధువృక్షముల ప్రేమతో వృద్ధిచేయుట సాధువులకు సహాయ పడుట సాధువులకే తన యిహపరసుఖమునకై దానాదుల ధనాదుల నిచ్చుటను చేయించుసచ్ఛక్తిగాని గల్గును. దాన విజ్ఞానమన, అనుభవజ్ఞానము లేక విశేషజ్ఞానముగల్గును.

స్కందోపనిషత్తు:— 'అభేద దర్శనం జ్ఞానం, జగమంతయు పరమేశ్వరితోగూడిన భగవంతునిగా చూచుట జ్ఞానము, లేక యింద్రాది దేవతలలో నొకనిగా చూచుటయు జ్ఞానము. లేక భగవంతు నైక్యముచేసిన తన రూపము జగ మంతయుచూచుట జ్ఞానము, లేక బ్రహ్మర్షులగు వశిష్ఠ విశ్వా మిత్రాది రూపములవారి భార్యలజేర్చి చూచుట జ్ఞానము, కొంతకాలమీ దివ్యదృష్టి యిటులు చూచుచున్న భగవదా దులు సత్యముగా గోచరులై దర్శనమిడుట గల్గుటే అనుభవ జ్ఞానము లేక విజ్ఞానము అనబడును. వారి దర్శనభాగ్యముచే భగవంతుని పొందుట గల్గునని తెలియుచున్నది. యీ మా ర్గమునబోయిన ఫలప్రత్యక్షమగుట గల్గునని ఋషులభిప్రా యము. యీ మార్గమెటు జూచిననూ సన్మార్గమేగాని దుర్మా ర్గము గానరాదు. పరాపకారము లేదు. గాని సత్ఫలమిడ గల్గుననుట కే సందియముండదు. పూర్వము భూలోకములో భగవంతుని యింద్రాది దేవతలను జ్ఞానసిద్ధులగు బ్రహ్మర్షులను

పూజించి బాగుపడిరి. నేడును అట్లు చేసిన బాగుపడగలరు. యిది కలహములు లేక సౌఖ్యముగాయిహపరమిడు మార్గము. దీనిని విడిచి యేదో విధమయిన ఆహారము నైనను తినువారు భగవంతుని చిత్తధ్యానముచేయుచున్న తద్దోషవిముక్తులై పై అన్న ఫలమును బొందగలరని కొందరు ఋషులనిరి. ఇట్లు గాక దేవుడులేడు, దేవతలులేరు, మంచివాడొకడులేడు, సత్య ధర్మాహింసాది సద్గుణములు పనికిరావు, మనయిష్టప్రకారము ధనాదులుగొని స్త్రీ భోగమనుభవించుటే పనియనువారు కొద్ది కాలము సుఖపడినను తొందరలోనే వారిలో వారికి కలహ ములు గల్గి నానాకష్టములపాలై యిహపరసుఖ గౌరవములు లేక దుఃఖించుచూ నశింతురు. ఇది అన్న మహిమ.

నీవిపుడు యేదో విధముగా స్థిరపరచిన రాజ్యమున నుంటివిగదా! యిందాహారముతిని బలవంతుడవై చేయవలసిన పనియేమి? సాధువుల బాధించుటకా. భార్యను పెండ్లాడుట నీ దుష్కామము పోవుటకా సాధుసహాయమునకే అని సత్సం తతి వృద్ధికే నీ వాలోచించక కోటానుకోట్లు ధనము నీవు సంపాదించినను భూలోక రాజ్యమంతయు స్వాధీనపరచు కొన్ననూ నీవు జీవించి నంతకాలము నీక్షేమమునకే సాధువు లకు దానముచేయుటకు నీకు భోజనము తప్ప మిగిలినవి నీవు చూచుచుండగనే విడువగలవు. గాన నీ క్షేమమునకే సాధు వులకు దానాదులు చేయుచుండుము. పరిశుద్ధభోజనము తిను చుండుము. మిగిలినది పుత్రాదులకు దక్కును. దేవగురుభ

గంధర్వ కిన్నరకింపురుష పశుపక్షిమృగాదులకన్న మానవ జన్మము శ్రేష్ఠమైనది. ఇది స్వల్పకాలముండునది. ఈ కాలములో బలవంతులగు సన్మార్గ సంతానము గనుదువా, వారే సంపాదించగలరు. హీనులగనుదువా, నీవు సంపాదించినది నీవు చూచుచుండగనే పోగొట్టుదురు. ఆ శక్తి సంతానము గనుటలోనే యున్నది. ఆకాలము దాటిన దుర్మార్గుల సన్మార్గులుగా త్రిప్పలేవు. నీవు బాగుపడవలసియున్నది యెట్లన, యీ లోకములో నిష్కామకర్మ, సత్కర్మ, దుష్కర్మ అని మూడుమార్గములుగలవు. యితర మార్గములులేవు నిష్కర్మమార్గముమానవుని బ్రహ్మర్షిఅనగా దేవునిగా మార్చునది అందు నిష్కామ కర్మము.

భగవద్గీత 2 అధ్యాయము:—

శ్లో. కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన॥

సర్వప్రభువగు భగవంతునికి సర్వవిధ సత్కర్మములు చేయుచు తత్ఫలము ఎట్టి కోరిక గోరక అర్పించుట. అట్లే త్రోటిసాధు మానవులకు, సాధు పశుపక్ష్యాదులకు కారణము లేకయే ఫలము కోరక భగవంతునిగా జూచి (అధిక శ్రేష్ఠ మార్గము) లేక చూడనేర్వకయైన, మహోపకారములు చేయుట, సర్వవిధ దుష్టమానవులనుండి, అట్టి దుష్టజంతుజాలమునుండి దూరముగ నుండుట. లేక నీతి బోధించి దూరముగ నుండుట. దీన మానవుడు కొంతకాలమునకు సత్యమయిన నిష్కామ కర్మఫలముబట్టి నీవు మొదట రాజర్షి, తరు

వాత ఋషివి, తరువాత మహర్షివి, తర్వాత బ్రహ్మర్షివిగా అనగా భగవంతునిగా మారుదువు, ఇందు సర్వ శక్తివంతుడు సర్వప్రభువగు భగవత్సహవాస మేర్పడుటచే 'సహవాసయా దోషగుణాభవంతి, సహవాసయా పుణ్యాగుణా భవంతి' అనునట్లు కొంతకాలమునకు భగవచ్ఛక్తి నీయందావేశమై కొంతకాలమునకు రాజర్షివిగాను మరికొంతకాలమునకు సచ్ఛక్తి వృద్ధియై ఋషివిగాను, మరికొంతకాలమునకు సచ్ఛక్తి వృద్ధియై మహర్షివిగాను, మరికొంతకాలమునకు విడువక చేయుచున్న బ్రహ్మర్షివిగా అనగా భగవంతుని అంత సర్వశక్తి గలవాడవుగా అగుదువు. ఒకమానవుడు రాజసేవకులలో క్లర్కుగాయున్న క్లర్కు అనియు, కలెక్టరయిన కలెక్టరనియు, జడ్జీ అయిన జడ్జీ అనియు గవర్నరయిన గవర్నరనియు మనుష్యులు పిల్చుచుందురుగదా. వీరందరికి అధికారిగ అధ్యక్షుడయిన అధ్యక్షుడని పిల్తురుగదా అట్లే నీవు గొప్ప మేధావంతులదరి సత్యమైన నిష్కామమార్గమెరింగి ఆ సత్యమార్గమున నడచిన కొంతకాలమునకు నీయందు భగవచ్ఛక్తి ప్రవేశించి నిన్ను రాజర్ష్యాది నామములతోను సిద్ధుడవైన బ్రహ్మర్షియని జను లంగీకరించి పిల్తురు. ఇట్లు నీకు నిత్యము సాక్షులుగానుండు నీ భార్యా పిల్లలు నీ సేవకులైన బ్రహ్మర్షివైతివని నీ సత్యపు నడవడి చూచి అంగీకరించవలదా! జగము నీ యిల్లు సాక్ష్యమివ్వకున్న నీవెల్లా నిజమైన బ్రహ్మర్షివగుదువు. కాలేదని సిద్ధియగు నీవు సత్యమున నడచుట మానరాదు.

ఉ దా:— వశిష్ఠ విశ్వామిత్రాది బ్రహ్మర్షులు. వారి కథలు రామాయణాది గ్రంథాల చదివిచూడుము. వారివంటి శక్తివంతుడవు నీవు కాకున్న నీకేల బ్రహ్మర్షినామము వచ్చును. ఒకనికి పిలువ యిష్టములేకున్నను నీయందు సూర్యునివలె సచ్ఛక్తి ప్రకాశించుచు వృద్ధియగుటచే నీకే తెలియుచుండును. అప్పుడే నిన్ను జూచి జనులట్లు పిలువగలరు. యీ రెంటి సాక్ష్యములలో బ్రహ్మర్షిత్వసిద్ధి గల్గినదని ఊహింపదగును. యింత గొప్పది గనుకనే వేలకొలది జనులలో ఒకానొకడే బ్రహ్మ విద్య సిద్ధిజెందునని కృష్ణుడనియెను. సిద్ధిగాకున్నను మానవుడీ గొప్పవిద్యామార్గమున నడుచుట మానకున్న కొంతకాలమునకు బ్రహ్మర్షి కాగలడు. యిట్టి బిరుదములు రాజ్యములలో కలెక్టరు గానివానిని కలెక్టరని పిలిచిన ఆమానవుని కేట్టిలాభముండునో అట్లే బ్రహ్మర్షిశక్తి గాంచనివానికి బ్రహ్మర్షి యని బిరుదమిచ్చిన అంతేలాభము. అందవిహీనుని అందగాడనిన, విద్యావిహీనుని బండితుడనిన, వ్యభిచారిణిని యిదియు నొక తెరగు పతివ్రతయనిన యెంతలాభమో మెట్టవేదాంతిని బ్రహ్మర్షి యన్న అంతలాభముండును. రాజర్షి, బ్రహ్మర్షి పదములు ఒకరు బిరుదములిచ్చునవి గావు. అతనియందుగల సచ్ఛక్తిని చూచి దుష్టజంతువులు, సాధుజంతువులు సూర్యుని జూచి సూర్యుడే అన్నట్లు బ్రహ్మర్షిఅని పిలువసాగుదురు. రావణాది దుష్టులు, రామాది మహాపురుషులు, అగస్త్యుని బ్రహ్మర్షియని అతడు తన్ను పిల్వుమని చెప్పకున్నను పిలువసాగిరి. సామాన్య

శ్రీ

జను లోక మెట్ట వేదాంతినిజూచి బ్రహ్మర్షి యని పిల్చినంత వానికిగాని వారికిగాని యెట్టిలాభముండక అసత్యమగుటచే ఉభయులు జగమున హేళనకు పాత్రులగుదురు. యింత గొప్పవిద్యగనుకనే తొల్లి భారతీయులు బాల్యముననే తెలిసి కొని గృహస్థులై భార్య తాను సర్వమును భగవంతునిగా చూచుటవల్ల లాభమేమి. యింద్రాదుల్క దేవతల పూజించుటచే లాభమేమి యని ఆలోచించి తమ శాంతయోగయజ్ఞమున యీదివ్యదృష్టిజూచి దేవుని తమయందైక్యముచేసి వామనాది అవతారపురుషుల యింద్రాది దేవతల జూచుచు తమయందైక్యముచేసిన వారిని పుత్రులుగాగని యీదృష్టియందాశక్తి వుండుట చూచి ఆశ్చర్యపడి గృహస్థాశ్రమమున 55 యేండ్లు దాటినతర్వాత దానిని విడిచి వానప్రస్థాశ్రమాదుల చేరి సృష్టిలో శక్తి యున్నపుడు స్థితిలో సర్వమును దేవునిగా చూచుచు అతనిని తనయందైక్యముచేయుచూ కొంతకాలము పిదప తప్పక బ్రహ్మర్షులము కాగలమనే నమ్మికతో ప్రత్యేకము భగవద్ధ్యానము పొంది అనగా తమకాలము భగవంతునికై వ్యయమవ్వుటే నిర్ణయించి సర్వమును భగవంతునిగ చూచుచు సత్య ధర్మ అహింసాది సన్మార్గమున నడచుచు పరోపకారులై తమయందు భగవంతునైక్యముచేసి భగవధ్యానము చేయుట మొదలిడిరి.

యీరీతి కొంతకాలము చేయగా చేయగా ఆ భగవచ్ఛక్తి ఆవేశించి నానాటికి వృద్ధియై పూర్ణచంద్రునివలె తమ

యమంతు ప్రకాశము గల్గుట జూచి నిత్యానంద స్థితి జెంది బ్రహ్మర్షిత్వసిద్ధిగాంచుచుండిరి. యిట్లే మహాపురుషుల గాంచి మిగిలిన రాజమంత్రులు రాజసేవకులు, సైనికులు, వర్తకులు, రైతులు, కార్మికులు కొంతకాలము గృహస్థులై రాజ్యమున వారివారి జాతకములుప్రకారము ధనాదులు, మేడలు, మిద్దెలు గట్టి కొందరు యేదో ఒక వృత్తినుండి సాధు దరిద్రముతో సామాన్య భోజనముతో శరీరము పోషించుకొనుచు పరాపకారము మాని పూరిగుడిశెలలోనుండి కొందరు తాము బాల్యమున 'ఓంనమశ్శివ' అను వేదమంత్రము ఓనమాలుబరిగ మొదటనే అన్ని జాతులవారు ఉపదేశింపబడి యుండుట అర్థమెరింగి మధ్యకాలమున దానికి తగిన మార్గములు తెలిసికొని సత్సంతతిని తమకు యిహపరముల సహాయార్థము లోకకల్యాణమునకుగని 55 యేండ్లురాగా తాము సంపాదించిన ధనముల మేడలు మిద్దెలును దరిద్రమును పూరిగుడిసెలపై భ్రాంతివదలి రాజు మొదలగు యితరుల ప్రోత్సాహము లేక కుటుంబభారము పుత్రులపై విడిచి తాను భార్యగాని, తానొక్కడేగాని బ్రహ్మవిద్యాసిద్ధికై అరణ్యమున మునిపల్లెలను గ్రామాలుకట్టి అందు వశించి తమకాలమంతయు వినియోగించి బ్రహ్మర్షిత్వసిద్ధి గాంచిరి. కొందరింట నారీతి చరించియు సిద్ధిచెందిరి. ప్రతి భాగ్యవంతుడు తనంతట తాను ధనాదులార్జించి తుదకు తనంతట తాను దానియందు అసుఖముచే భ్రాంతివదలి యితర తలంపులు మాని ఏకముఖముగా భగవంతునర్చించి యిహపర

సుఖముగాంచిరి. ఈ బ్రహ్మవిద్య పాశ్చాత్యదేశాలలోలేదు. ప్రస్తుతకాలాన ప్రకృతివిద్య వృద్ధియైనది గాన భూలోక సర్వ విధ రాజ్యములవారు బ్రహ్మవిద్య ప్రకృతి విద్యల తమతమ దేశముల సత్యాహింసాదిమార్గములు సత్సంతతి వృద్ధిమార్గ ములుచేసి గృహస్థులై కొంతకాలము భగవదర్చనచేయుచు, సత్యధర్మాహింస మార్గాల నడచుచు సత్సంతతిగాంచుచు యిహసుఖములంది 55 యేండ్లు దాటినతర్వాత యిహభోగ లాభాలాభములు తెలిసినవాడౌటచేత రెండవతలంపున బడ కుండునుగదా. తానిచ్చటనుండనని తెలియునుగదా. ఆకాలము మొదలు జన్మాంతమువరకు నిష్కర్మమార్గాన భగవదర్చనచేసి మానవుడు బ్రహ్మర్షియగు టుత్తమమార్గము. యిదివిడిచి ఓ మానవుడా బాల్యమునుండి ధర్మములేని మార్గాల ధనము నార్జించుట స్త్రీభోగ మనుభవించుటకే మానవజన్మమంతయు ఉపయోగించుటవల్ల ఉపయోగ మేమన భోజనము మాత్రము జరుగుచుండును. యింతలో పిల్లలు పెత్తనమునవచ్చి నీవు సంపాదించిన దానిపై పెత్తనముచేయుచు, పోగొట్టుటో వృద్ధి చేయుటో నీవు చూచుచుండగనే జరుగును. వారు వృద్ధిచేశి నను నీకు భోజనమేజరుగుచుండును. లేనిచో నానాకష్టముల పాలగుదువు. వార్ధిక్యమున స్త్రీలనుచూచుచు కామబలము తగ్గుటచే భ్రాంతితప్ప సంయోగయజ్ఞము చేయలేవు. నీవు యొక్కువభ్రాంతిపడిన ధనకామములు రెండు నీవు చూచు చుండగనే నీ చేతినుండిజారుట తప్పక జరుగగలదు. తర్వాత

'శరీరం రోగమందిరం' అనునది నీ యౌవనమున నంత గన్పడక ముసలితనమున తప్పకగన్పడును. అప్పుడునీవు యేమ్చుటతప్ప యితరముగానరాదు. నీకు సాయము పుత్రాదులున్నను యీ రోగములనుండి నిన్ను తప్పించలేరు. నిన్ను చూచినవారును కష్టపడుదురు. తర్వాత కొంతకాలమునకు ప్రాణములుబాసి యిట్టి నీవు నరకమున బడుదువనియు, ఋషులు భగవంతుడగు కృష్ణాద్యవతార పురుషులుజెప్పిరి. అవియేశాస్త్రములు పురాణములు.

ఉపనిషత్తులు, గీతలు, అందు అధర్మమార్గస్తునికి చెప్పిన ఫలమంతేయు నీ జీవితకాలములోనీ వనుభవించితివికదా యికవారు చెప్పినప్రకారము జన్మాంతమున నరకమను దానిలో బడి నానావస్తల కష్టముల పాలగుదువన్న, నమ్మను. గుడ్లగూబ ధర్మవిరుద్ధముగా సూర్యుడులేడన్న సూర్యుడులేకుండపోవునే. యిట్టి అధర్ముడవు నీకు నరకముగలగదని నీ వనుకొన్నను తప్పకగల్గును. గాన ఓ గృహస్థుడా! రాజ్యపక్షము వారు సౌఖ్యముగా పాలించుచున్నారు. అన నీ భార్యాపుత్రుల ధనమును పరులపహరించకుండ కాపాడుట వారిధర్మము. అది చేయుచున్నారు. గాన వారికి అపకారము దలంచక వారు ధర్మముగా నీపై విధించుపన్నులు మొదలగునవి యిచ్చినవారి కాలము సౌఖ్యముగా జరుగును. యిట్లు ఒకరి కొకరు సహాయము చేశికొనుచు ఉభయులు భగవదర్చన బాల్యమునుండి ఖానక యీలోగా మీకుగల వృత్తులలో

ధర్మమార్గమున నడచుచు నిష్కామకర్మ మార్గాభ్యాసము చేయుచు, రిటైరు అయినతర్వాత అనగా యీ వృత్తులలో నీవు సరిగా జరపలేని బలము గలవాడవైన తర్వాతనైననూ అనగా ముసలితనమునైనను కాలమంతయు భగవత్సన్యాసము క్రింద అనగా భగవంతునిగూర్చి కాలము వ్యయముచేయుట మంచిమార్గము. యిది నిష్కామమార్గము. తిరిగి ఫలము కోరనిది, అనగా భగవంతునికిగాని సాధుజనులకుగాని ఫలాపేక్ష లేక చేయబడు సత్కర్మము సరులకునట్లె నిత్యకల్యాణము నిత్యసంతోషముగల్గు కర్మములు చేయుటయే అయియున్నది. ఆచరించి చూడుము. దాని ఫలమనుభవించగలవు. యిదే కైవల్యమార్గము, నీవు దేవునిచేరు, నిన్ను దేవుడుచేరుమార్గము మానవజన్మ సాఫల్యమార్గము. ఇది పురుషుడు పొందయోగి యని స్త్రీ పొందయోగిని యనబడును. స్త్రీలలో ద్రౌపది సావిత్ర్యాదులు- పురుషులలో, వశిష్టాదులు.

—: సత్కర్మమార్గము! మానవుని దేవతగా మార్చునది :—

గీ త:—

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధి యజంత ఇహ దేవతాః
క్షిప్రంహి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా॥

సత్కర్మఫలము ప్రత్యక్షము. త్వరలో రావలెనన్న యింద్రాది దేవతల యీ లోకమున ఫలములుగోరి పూజించిన త్వరలో కార్యసిద్ధిచేతురు. వీరినహవాసమున భూదేవతవగుదు వను ప్రసిద్ధిగలదు. యీరెండు అనగా కార్యసిద్ధి దేవత్వము

గల్గనిచో యీ పురుషప్రయత్నము శాస్త్రీయమైనదికాదని అందుచెప్పిన సత్ఫలమిడు అర్థమునెరింగి ఆచరించి నడిచినను యోగ్యులవద్ద తెలిసికొనినడచినను త్వరలోసిద్ధించును. లేనిచో ఆ శాస్త్రశబ్దముల కనేకార్థములు వచ్చుచుండును. ఆఋషి చెప్పిన ఫలమిడు అర్థము నీ వాచరించి తెలిసికొనదగినది. ఇట్లర్థముచెప్ప ఆచరించితప్పిన మరల అర్థముతో ఆచరించి చేయుచున్న తుదకు ఫలమిడు సత్యార్థము నీకు దొరకగలదు. ఋషి అన సత్యము చెప్పువాడు. అతడుసత్యమేవ్రాశియుండును. దానికి తప్పర్థముచెప్ప నీవు నడచుటలో అపజయముగల్గును గాని ఋషిది తప్పుగాదు. గాన అతని సత్యార్థము దొరకు వరకు ప్రియత్నించవలెనేగాని ఋషిగ్రంథములు భగవద్గీతలు తప్పనరాదు. తప్పనినచో, పశ్చిమదేశీయులలో జీవితకాలము వ్యయపర్చి భూభూతసంబంధ ఖనిజ రసాయనశాస్త్రములు, ప్రత్యక్షఫలము కనుగొనిరి. అటులే ఆకాశ భూతసంబంధులగు యింద్రాది దేవతల కృపనందుటకు ఆ భూతసంబంధము శబ్దము ధ్వనియైయున్నది.

యే శబ్దోచ్చారణ యేధ్వనిచేసిన వారిని జూడగలవో వారి కృప పొందగలవో కనుగొనుము. లేనిచో భారతర్షుల పూర్వము కనుగొన్నమార్గాల నడువుము. రెండును విడిచి దుర్మార్గమున నడువక సత్యధర్మాహింసాది సన్మార్గముల నడచుచు ఉపకారమునకు ప్రత్యుపకారముచేయు మానవు లెందరోగలరు. వారితో సహవాసముచేయుచు వారికి ఉప

కారము చేయుచున్న యిహకాలమునకు వారి సహాయము సుఖముగ జరుగగలదు. అట్టి పుణ్యుల కుపకారివిగనుక యిహ మున దేవతవలె ప్రకాశించి అంతమున నరకము జెందక స్వర్గ మన నీకు నెత్తిపై కన్పడుచుండు సూర్యుడాదినవగ్రహ నక్ష త్రాది ధృవనక్షత్రమువరకుగల స్థానముజేరి చాలకాలము సుఖముచెంది మరల సౌఖ్యజన్మముకాంతువు. పాపము వీడి యీ పుణ్యమార్గ మెక్కువసంపాదించినచో కొంతకాలమునకు నీవే పుణ్యము వీడుమార్గము తెలియగలవు. పాపమును వీడుట మొదటభ్యసింపదగునుగదా. తర్వాత పుణ్యకర్మములు ఫల కాంక్షతో చేసినస్వర్గముగల్గును. దానియందును నీకు విసుగు జనించిన దాని ఫలమంతయు దేవతకు దానముచేసితి వేని యిటులుచేయగా చేయగా దేవతా సహవాసము గుదిరి దేవత వగుదువు అనగా భూదేవతవని బిల్వబడుదువు. అట్లు నీశక్తి చూచి సాధుజనులు నిన్ను పిల్చువరకును నీయందు దేవతాశక్తి గల్గినట్లు నీకు తెలియువరకు యిందాి)ది దేవతల పూజ మాన రాదు. (దేవునికి ఒకనాటి దానముచేతనే బలిచక్రివర్తి తన లోకముచేరి బాధలపడకుండా నానాసౌఖ్యములు భగవంతుడు తన యింటిముందుండి కాపాడుచుండ అనుభవించు చున్నాడు. దేవుడంత దయగలవాడు. ఇట్లనేకదినముల యేండ్లకాల మున నీ సత్కర్మఫలదానమున నిన్ను అతని తుల్యునిగా చేయునన్న అబద్ధమగునా. తండి)ి ధర్మమార్గమున నడచు పుత్రునికి తన సర్వస్వమిచ్చి తనభార్యవంటి స్త్రీని పెండ్లిచేసి

అనగా తనవలె గృహస్థునిజేసి వేరుగానుంచినను యిద్దరికి అభేద
ముగ నడచుకొనుట నీవు చూచుటలేదా. (అట్లులే భగవంతు
నర్చించువాడు భగవత్సముడు. యింద్రు నర్చించువాడు యింద్ర
సముడు కాగలడని నమ్మకము.) దేవుని మార్గము విడిచినను
యింద్రాది దేవతలగాని, సాధుపురుషులగాని పూజించుచు వారి
సహవాసమున వారివంటివాడవై యిహపర సుఖములందుదుము.

తైత్తిరీయము:—

శ్లో॥ అదితిర్దేవా గంధర్వా మనుష్యాః పితరోసురా
స్తేషాం సర్వా భూతానాం మాతా మేదినీ॥

దేవతలకు, గంధర్వులకు, పితరులకు, మనుష్యులకు,
రాక్షసులకు యీ భూభూతము తల్లి. అనగా యిక్కడ ఆయా
లోకములనుండి వచ్చుచుందురని భావము. వీరిని గుణకర్మ
ములబట్టి తెలియదగును. అవతార పురుషులు, ఋషులు,
నిష్కాములై ధనాది సంపాదన చేయుచు సాధులకిడుచు పరు
లకు బ్రహ్మవిద్య ప్రచారము చేయుచుందురు. యింద్రాది
దేవతలు సాధుమానవులుగ బుట్టి సత్కర్మమార్గము దానిఫల
ములు ప్రచారము చేయుచుందురు. సూర్యుడు వర్షము గురి
పించి మరల నీళ్ళ నెట్లు లాగుచునాడో అట్లే వర్షముద్వారా
ఆయాలోకములనుండి వచ్చు జీవులగురిపించి మగల వారి అనం
తరము నీళ్ళద్వారా పైకిలాగి వారి కర్మఫలములకు తగిన
ఆయాలోకములను చేరునట్లు చేయును.

కర్మఫలము:— ఆయా లోకములనుండి జీవులు

సూర్యునిచేరి అతనినుండి చంద్రుని, అతనినుండి మేఘములను, దానినుండి వర్షముద్వారా భూమిని అందు ఓషధులై ఆహార రూపమున పురుషుని, శుక్రరూపమున స్త్రీని చేరి భూమిని మానవాది జంతుజాలములుగా, వృక్షాదులుగా గల్గుచున్నవి. వర్షముగల్గుట, దాన ఆహారము, దాన శుక్రము, దాన సంయోగ మున గర్భముగల్గుట, దాన శిశువులుగల్గుట ప్రత్యక్షదాయకము. వర్షములేని యెడారుల జంతుజాలము వృద్ధిఅగుటలేదు. మానవాదులు చచ్చినతర్వాత యేమగునది ప్రత్యక్షము గాదు. యిదే చిత్రము. పగలు జంతుజాలము పగలున గన్పడుట, చీకటిలో గన్పడనట్లు జంతువుయొక్క పుట్టుక తెలియుట అనగా ఒక డీలోకానికి వచ్చినాడని తెలియుట, చచ్చుట తెలిసినను అతడేలోకానికి పోవునో తెలియుటలేదు. యిది లోకవహాజము. గాన సూర్యుడు నీళ్ళనులాగును గాన చచ్చిన జీవుల పేరులు చెప్పి నీళ్ళతో తర్పణాదులు పుత్రాదులు చేయు చున్నారు. గంగానదిలో ఎముకలు కల్పుచున్నారు. యీ ఫలము వారికి చేరుచుండు ననదగును. సూర్యుడు పైలోకము నకు భూలోకమునకు మధ్యవర్తియై యున్నాడు. స్వర్గమున పాపములేదు పుణ్యముగలదన, పాపమనగా చీకటి, పుణ్య మనగా వెలుతురు.

సూర్యాది గ్రహనక్షత్రములు కాంతి వంతములై గన్పడుచున్నవి. అచ్చట చీకటి గానరాదు. గాన పుణ్యులు సూర్యునిద్వారా పుణ్యమునుబట్టి 'నక్షత్రాణి. దేవతా

గృహాణి' నక్షత్రములే దేవతల యిండ్లు. గాన యేదో నక్షత్రమున చేరగలరని భావము. నిష్కాముడిందు చేరడు. మనకు గన్పడునది సూర్యుడు మొదలు ధృవనక్షత్రమువరకే అయి యున్నది. అంతవరకే స్వర్గమనిరి. గాన అంతకు పై భాగములలో గల లోకములను కొందరు వైకుంఠ కైలాస ములలో కొందరు భగవంతుని రూపమున కొందరు, భగవం తుని సాయుజ్యము కొందరు చెందుదురనదగును.

అది సత్యమా? కాదా? అనునది కనుగొనుటకే అబల యన స్త్రీ. ఆమె పురుషసహాయములేక ధర్మముగా జీవింపలేని దగుట బలవంతుడగు పురుషుని చేరుచున్నది. అట్లు భార్యా భర్తల అంగీకారముతో వివాహముచేయుటయై యున్నది. అనగా వీరిద్దరి సంయోగ యజ్ఞములో అవతారపురుషుల యింద్రాదిదేవతల సంతానరూపమున తొల్లి కనుగొన్నట్లు భారత రామాయణాది గ్రంథములగలవు. అవి బోధించి చెప్పు వారలు అరుదగుటచే ఆ మార్గములు కుంటీవడినవిగాని సరి యైన అర్థమొకసారివిని ఆచరించిన దానిఫలము పూర్వమువలె ప్రత్యక్షమగును. ఇచ్చట నారాయణేంద్రాదులవంటి సంతా నము నీవుగాని యితరులుగాని గనుటచూచి మానవుడు రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులగుట జరుగునని నిశ్చయించునది. యీ మార్గాచరణములేని నీకు దాని ప్రత్యక్షఫలమెట్లగును. యిట్టి గొప్పధర్మమార్గముల నడువలేక దంభములువాదించి వాదించి తుదకు దుఃఖముతో నరకమున గూలుదువు.

దుష్కర్మము:— మానవుని రాక్షసునిగా లేక పిశాచముగా లేక దయ్యముగా మార్చునది. గుణకర్మములను బట్టి తన్ను మానవుడు ఎవరైనది నిర్ణయించుకొనునది. భగవద్గీత 16 శ్లో॥ 'ప్రవృత్తించ నివృత్తించ జనాన విదురాసురాః నశౌచం చాపి చాచారో నసత్యం తేషి విద్యతే॥

దుష్కర్మ మార్గస్థులకు ప్రవృత్త నివృత్తి మార్గము లిష్టముగాకుండును. వీరికి శౌచమన యింద్రియ నిగ్రహము గాని సౌఖ్యమునిడు ఆచారములు, సత్యమార్గములుగాని యుండవు. యీ జగమునకు పై అధినాధుడనువాడు లేడు. స్త్రీ పురుష సంయోగమున జంతుజాలముబుట్టును. నిత్యము జనులలో మాట్లాడునపుడు చంపెదమని దయ్యములు, జగన్నాశనము చేయుదుమని రాక్షసులు పల్కుచుందురు. పరస్త్రీల చెరచుట, దంభ, మద, మోహాదిదుర్గుణములు గల్గియుండుట వాచికిష్టము. కామ క్రోధాదులచే సాధువుల బెదిరించి అన్యాయముగ ధనార్జన చేయుదురు. యింతధనము సంపాదించితిని, యింత సంపాదింతుననియు శతృలనశింపచేశితిననియు, యీశ్వరుడను, సిద్ధుడను నేనే అని నాతో సము దున్నాడా అని మెట్టవేదాంత వాక్యములు పల్కుచూ ఘోర వాక్యములు చెప్పుచూ అజ్ఞానము అన నేనెక్కువ, నీవు తక్కువ అను భేదములతో తపించుచు పరులకు విరోధములు కల్పించుచు సాధువుల హింసించుట దుష్టమద్యపానాదులు గోరుట గలవారై తామే గొప్పవారమనిచాటుచు తిరుగు

చుందురు. యిట్టి దుష్టులను మరల అసురయోనుల పుట్టింప జేసెదనని కృష్ణుడు గీతలోననెను. శాస్త్రాదులు చదివినను, అధర్మమున నడచుచుందురు. శాస్త్రప్రమాణములు పనికి రావు, వాటి అర్థము తమకు సరిపోవునట్లు చెప్పుదురు. పద్మ పురాణము, కంసునితల్లితో వేదాదిశాస్త్రములు ధర్మము లన్నియు తెలిసికొనినను అసత్యముతో నడచుచు పరస్త్రీల చెరుచుచు ధర్మమార్గమునువిడిచి అధర్మమున నడుచువారు రాక్షసులనబడుదురు. సృష్టికాలమునుండియు వీరిధర్మమంతియే యని ఆమెను భంగపరచిన రాక్షసుడు చెప్పెను. విష్ణుపూజా యుక్తుల పతివ్రితల మేము చేరమని చెప్పినాడు. నేను నిన్ను చేరుటచే నీవు పతివ్రతవుకావనెను. వీరు వ్యభిచారులమరింత హీనులచేసి తాము హీనులగుదురు. గాని సరియగు పతివ్రితల నేమియుచేయరు. యిట్టిగుణములు తమయందు గన్పడు మాన వులు తాము దుష్టులము అగుచున్నామని తెలిసి భూలో కమున దుర్మార్గులు సన్మార్గులుగా మారదగిన మార్గములుకల దయున్నది. మోక్షము చెందదగు మార్గములుకలదై యున్నది. యీధర్మ మేలోకానలేదని గ్రహించి యీ భూలో కముచేరిన రాక్షసాదులు తమ మార్గమువీడి నిష్కామ మార్గముగాని సకామమార్గముగాని కష్టము మీదనైన నడువనేర్చిన కైవల్యముగాని స్వర్గముగాని చెందగలరు. లేనిచో యిహ మన తలిదండ్రులతో గురువులతో రాజులతో శిక్షణపాలై నానాకష్టములుపడి నరకమున పూర్వమువలెనే

గూలుదురు. ఇట్టి దుష్టుల సహవాసమున సన్మార్గులును నాశన మగుదురు. నిష్కర్మమార్గస్తులు తెలిసిచేరినను వారిధర్మములుగొనక వారికిని ధర్మముబోధింతురు. వినకున్న వారు వినలేదని తెల్లబోవువారుగారు. ఏనాటికే యైన యీ దుష్టులు నిష్కర్మ మార్గస్తులు బోధలవలననే తమ మార్గముపీడికై వల్యపదముత్రొక్కి బాగుపడగలరు. వీరీ లోకమున చీకటి యున్నట్లుండక మానరు. అమవస చీకటివలె ఒక కాలమున వీరు వృద్ధియై రాజ్యము లేలుటయు జరుగుచుండును. ఆకాలమున సాధుజనులు నానాబాధల పాలగుదురు. ఆకాలముననుఆకాశమున గురుశుక్రగ్రహములు తమ కాంతులచే అధర్మమను చీకటిని బాపుచున్నట్లు నిష్కామ మార్గస్థులు సాధువులకు సాయము జేయుచుందురు. యింతలో నిష్కామ మార్గము స్థాపితమగు చున్నదన్నట్లు సూర్యుడుదయించును. తర్వాత అతనికి సాంతముగా సత్కర్మమార్గము స్థాపించు చున్నాడో యన్నట్లు అంతకంతకు వృద్ధియై చంద్రుడుదయించి చీకటిని చాలభాగము నశింప జేయుచున్నాడు. అనగా సత్కర్మ మార్గము కొంతభాగము మాత్రము అజ్ఞానము తొలగించుననియు కొంతసుఖము గలదనియు నిష్కర్మ మార్గము అజ్ఞానమను చీకటి దరిజేరక సర్వసౌఖ్యము లిడగల దని భావము. గాన మనుష్యుడు పైమూడు కర్మములనుబట్టి నీవు అవతారపురుషుడవో, ఋషివో, దేవతవో, రాక్షసుడవో, పిశాచుడవో, దయ్యమవో నిన్నునీవు తెలిసికొనుము. పరులు

దుష్టుడవని నిన్ననచో మండిపడుదువు గాన నీవే నిన్ను నిర్ణయించుకొనుము. దుష్కర్మముచేసితిని, ఫలించినదా యేమియా లేదు, వట్టిదనుకొనక ఆవు తినినవెంటనే పాలిచ్చునే, భూమి దున్నినంతనే పండునే అట్లు తప్పక కొంతకాలమునకు దుష్కర్మము ఫలించి నన్ను బాధించునని భయపడి దుష్కర్మ మార్గము నడచుటమానుము, వినక దుష్కర్మము చేయుచు నున్న వాడవైన కొలదికాలములోనే కలహములుగల్గి అవమానములు పాలగుదువు. తుదకు దుఃఖించుచు మంచిమార్గము పొందలేక పోతినేళ్ళని యేడ్చుచు ప్రాణములుబాసి నరక మందెదవు గాన యిపుడే నీకిష్టముగల్గు శాస్త్రప్రమాణ నిష్కర్మ మార్గస్తుని దరిచేరి సత్యమగు బ్రహ్మవిద్యనేర్చుకొమ్ము. లేక నీవు ప్రేమించు సన్మార్గునివద్ద దుర్మార్గమువిడిచి శాస్త్రీయ సత్కర్మమార్గము నేర్చికొమ్ము. యీ మానవ జన్మకాలము కొంచము దాటబెట్టితివా నీతాత దిగివచ్చి సాయపడినను నీకెట్టి లాభముండదు.

—:O:—

ఓం వినాయకాయనమః

# లోకైక కల్యాణ గృహస్థుడు

అనగా లోకములో సద్గృహస్థుడొకడే గృహస్థుడన దగును. మానవులపంట అన దైవీసంపద సంతానమును వృద్ధి చేసి ఆసురీసంపద సంతానమును వృద్ధిచేయకుండుట. భూలోక కల్యాణ మన్మథయుద్ధము. అనగా భార్యాభర్తలు సాధుపురుషుల సాధుస్త్రీల సృష్టించుటకై చేయు సంయోగయజ్ఞము. బలవంతులగు సత్పురుషులు సన్మేధావంతులు భూలోకమున వృద్ధియైన దుష్టయుద్ధములురావు, కారణము: భగవంతుని కృపజెందుట లేక భగవంతునిగామారుట అనగా బ్రహ్మర్షి యగుట మానవ జన్మఫలమని భూలోకప్రజలు గ్రహించిన నాడు దుష్టయుద్ధముల పాల్గొనరు. ఒకవేళ ఆసురీసంపదవారు ఒకమూల వృద్ధియై యుద్ధముసేయ పైబడినచో వారిదుష్టత నడంచి ధర్మస్థాపనజేయ శక్తివంతులుగానుందురు. ఉ॥ అర్జునుడు, కృష్ణుడు, వసిష్టుడు. లోకములకు ప్రభువు భగవంతుడు, భూలోకములో, కొంతభాగము పాలించు వాడొక ప్రభువు.

—: స్త్రీకి పురుషుడు ప్రభువు :—

మానవసృష్టినుండిగాని, స్థితినుంచిగాని గుణకర్మముల బట్టి మానవుల సంఘములుగా మనువు, పూర్వర్షులు, శ్రీకృష్ణుడు

నిర్ణయించిరి. భూలోకములో అనేకభాషల ననేక నామములు వారికి గలవుగాని, గృహస్థధర్మ మొకేమార్గమైనది. అందుచే సంస్కృతభాషా నామములే ఆయా మానవసంఘములకు నిర్ణయించితిని. గృహస్థులనుంచియే యీ సంఘమానవులు అనగా నిష్కాములు, సత్కాములు, దుష్కాములు పుట్టుచున్నారు. గృహస్థునికి బాహుయుద్ధము, అహింసాయుద్ధము, యింద్రియ విజయయుద్ధము మొదలగు యుద్ధములుగలవు.

బాహుయుద్ధము:— సాధు, సాధ్వీ, గోవుల ప్రాణము హరింపనెంచువారినుండి ధర్మమార్గమున వారిని తప్పించుటకు, ఆదుష్టుల దేవునిగాజూచుచు, నిష్కామయుద్ధము చేసి రక్షింపదగును. అట్లు చేయలేనివాడు బలహీనుడైనచో సన్మార్గులు బలవంతులగువారితో జెప్పి విడిపింప దగునేగాని బాహుయుద్ధము చేయరాదు.

ఉదాహరణ:— సుగ్రీవాంజనేయాదులు, సీతను దుష్టుడగు రావణునుండి విడిపింప రామునిజూచుచు నిష్కామ బాహుయుద్ధము చేసిరి. శత్రువులు తన్నెంత వేధించినను వారిని భగవంతునిగాజూచుచు భగవంతుని హృదయమున నిలిపి అతనిని ధ్యానించుచు మారుచేయకుండుట అహింసాయుద్ధము. ఉ॥ ప్రహ్లాదుడు; అతనికి ఎట్టిదెబ్బలు తగలలేదు. బాధలు కలుగలేదు. ఒక్కడే దేవునిసహాయముతో జయము నొందెను. తన ఇంద్రియముల, దుర్మార్గమునకు పోకుండాచేసి భగవంతునిజూచుచు, భగవంతుని తనయందైక్యముచేయుచు,

భగవంతు నర్చించుట, రాజర్షులు, ఋషులు, మహర్షులు, చేసి బ్రహ్మర్షిత్వసిద్ధిగాంచిరి. భార్యాభర్త లిరువురు భగవంతుని తమయం దైక్యముచేసి తమ్మును, అంతటను, భగవంతునిగా జూచుచు బ్రహ్మర్షులనుగాని, అవతార పురుషులనుగాని పుట్టించుటకుచేయు సంయోగయజ్ఞమే ఉత్తమ మన్మథ యుద్ధము. ఈ సంకల్పసృష్టిలో సూర్యాదుల దేవునిరీతిగ సృష్టింపదగును.

మనుస్మృతి :— ఋతుకాలము పదహారు దినములు. అందు మొదటినాలుగు దినములు, పదకొండు, పదమూడు దినములు, సంయోగయజ్ఞము చేయరాదు. అయిదు ఆరురాత్రులసంయోగమున పతివ్రతలు, సాధువులు, సామాన్య ధనవంతు లుదయింతురు. 8, 10, 12, 14, 16, రాత్రులు ఎక్కువ ధనవంతులు సాధువులు, ఒకరికన్న ఒకరు అధికులును, పదహారవనాడు రాజుగాని రారాజుగాని పుట్టుదురు. ఏడవ రాత్రి వంధ్యపుట్టును, 9, 15 రాత్రులు ఎక్కువ ధనవంతులైన స్త్రీలు, సాధ్వులు, 15 వ రాత్రి సుగుణవతియగురాణి గల్గుదురని శాస్త్రనిర్ణయము. మరల రజస్వల యగువరకు శుక్రాభివృద్ధి చేయదగునేగాని, ఈ మధ్య దినముల భార్యాభర్తలుకూడిన దుష్టసంతతిగల్గి తమ్ము, పరుల, పితరుల బాధింతురు. ఇది ఋతుకాల సాధుజనసృష్టిమార్గము. ఈ మన్మథ యుద్ధము పంతోషముతో భూలోక గృహస్థులందరు చేయుచుందురు. దీన పరులకెట్టి బాధయు గలుగదు. ఇందు జగత్క

ల్యాణదాయకులగు వారిని పుట్టించుశక్తియు, జగన్నాశకుల పుట్టించుశక్తియు, భగవంతుని తరువాత భూలోకములో గృహస్థునికిగలదు. గాని మరేలోకగృహస్థునికిలేదు. భూలోకములో గృహస్థులందరు సాధుజనవృద్ధిసేయుచు దుష్టజనవృద్ధి చేయకున్న యీ లోకము స్వర్గమువలె ప్రకాశించును.

గాన యీభారమంతయు గృహస్థుడను చిన్నరాజుపై నున్నది. గాని రాజ్యమేలు రాజుపై లేదు. రాజు, గురువులు, తల్లిదండ్రులు సాధుసంతానము గన, బోధింతురేగాని అట్లాచరించువాడు గృహస్థుడే అయియున్నాడు. దుష్టయుద్ధములు గలుగకుండుటకు ప్రతిరాజ్యమున గృహస్థులు మంచివారిని గనుచుండుటయే మొదటిమార్గము. వారికి బాల్యముననుంచి సహవాసమున సద్గురువులవద్ద విద్యాభ్యాసముచేయుట సాధు బాలురతోగూడి వర్తించుట నేర్పుటే 2వ సోపానము. ఇదియే జగత్కల్యాణ మన్మథ యుద్ధము.

భారతము:— (ఆదిపర్వము,) యయాతి తనపుత్రుని యవ్వనముగైకొని సత్సంతానమునకై గాక కేవల కామభోగమునకై తన భార్యయగు దేవయానతో వెయ్యేండ్లు భోగించి ఏమియు ఫలముజెందక బలము ఆయువు పోగొట్టుకొని శేషించిన ముప్పదియేండ్లు తపస్సుజేసి స్వర్గాదులలో స్వల్పకాలముండి తుదకు స్వర్గభ్రష్టుడై నానావస్థల పాలయ్యెను. ఆ వెయ్యేండ్లు మోక్షముకై తపస్సుచేసిన బ్రహ్మర్షులుగా భార్యభర్తలయ్యెడివారు. 'రతిపుత్ర ఫలప్రదా' అన సంభోగము

సత్సంతానమునకై మాత్రమే సదృతుకాలమున చేయవల యును. అట్టి సత్సంతానముగనుటకు ప్రయత్నించుచు నిత్యము బ్రహ్మర్షియగుటకు తగినతపస్సు ప్రతిమావునడు చేయవల యును. శుక్రము పూర్తిగానశించిన ఆయువునశించును. ఋతు కాలసంయోగమున ఆయువు రోగహీనతగలిగి తపస్వియగు టకు వీలుండును. జాతకమురీత్యా అనగా ప్రారబ్ధమువల్ల ఒకనికి దుష్కామాభివృద్ధియగుచున్న మానవధర్మ ప్రకారము దానిని ఆపుచేసి ఋతుకాలసంయోగము మాత్రము చేయ దగును. వ్యభిచారమన పరస్త్రీ సంయోగముచేయుట లేక తాను నాశనముజెందు అధర్మమార్గమున వర్తించుట గాన వ్యభిచారము నెప్పుడును చేయరాదు. వినక చేసినవారికి నాశన మివ్వకమానదు. ప్రస్తుతము స్త్రీలకు సత్సంతతి వృద్ధిగాకుండా సంతాన నిరోధముచేసి కామముభోగించు యయాతులనేకులు దేశాలలోగలరు. మొదట యయాతి తపస్సుచేసి స్వర్గమైనా పొందెను. గాని యీ యయాతులు తపస్సు విడచిరి. గాన ఫలమువారే ఆలోచించుకొనదగినది. పైనచెప్పిన ధర్మమార్గ జగత్కల్యాణ మన్మథయుద్ధము ఆచరించుగ్రామస్థులు, పట్టణ స్థులు, దేశస్థులు, సర్వసౌఖ్యములందెదరు. రామాయణమున దశరథుని రాజ్యపాలనలో జనులందరు సత్సంతానముగనుచు తపస్వులై సర్వసౌఖ్యములజెందిరి. నేడట్లాచరించిన అట్లగు ట కేసందియమునులేదు. రాజురాజ్యమయిన, ప్రజారాజ్యమైన సన్మార్గము శాసించుటకే అయియున్నది. ప్రస్తుతము ప్రజా

రాజ్యము లెక్కుడు జరుగుచున్నవి. ఇవి సత్ప్రజారాజ్యములయి సత్ప్రజాభివృద్ధి చేసిననాడే ప్రకాశించును. లేనిచో అడవిని పాలించు జంతువులవలె ఒకరికి ఒకరికి సంబంధములేక విరోధము లెక్కుడై యుద్ధములచే నశింతురు. భారత దేశము పూర్వము సంపూర్ణ సన్మార్గముగా నేలినట్లు చరిత్రలుగలవు. పశ్చిమ దేశపుపాలనలు, భారత రాజర్షి పాలనతో తుల్యము గానందున భారతరాజులచరిత్రల ఆధారముగా తీసుకొంటిని. రాజ్యము మంచిదైన గృహస్థధర్మములు పూర్వము బాగా వృద్ధిచెందినట్లు గలదు. ఇందు ఆశ్రమములు నాల్గు. కాని గృహాశ్రమమును గురించి ఎక్కువ విమర్శించబడును.

బ్రహ్మచర్యాశ్రమము:— యిందు భగవంతుని గురించి చెప్పు గ్రంథములలోను ధనము, ఆరోగ్యము, సత్సంతతి వృద్ధిచెప్పు శాస్త్రములలో సత్యార్థములు తెలియుట మానవ ధర్మ సత్యమార్గముల గ్రహించుట, మరియు మానవునికి హితమగు వివిధశాస్త్రముల సత్యము గ్రహించి అభ్యసించుటకు తగినకాలము. నానా విద్యలను తన జీవితకాల సహాయమునకు చదువుకాలము. విద్యావిహీనుడు ధనము సంపాదించినను దానినెట్లు ధర్మమార్గమున నడిపింప ఫలముగల్గునో తెలియక వ్యర్థముగా పరులకు విడుచుచుండును. అశగా దండుగలు చెందునే గాని సత్ఫలముచెందడు. సద్విద్యావంతుడు చెప్పినట్లాచరించు ధనవంతుడు బాగుపడును.

గృహాశ్రమము:— సత్యగ్రంథ సత్యమార్గములు

గురువులసన్నిధి నేర్చి యోగ్యమగుస్త్రీని పెండ్లాడి సాధు ధర్మ మార్గమున నడచుచు సత్సంతతిగనుట, తనసంతతికి సాధు సంతానముగను మార్గముబోధించి సాధువులగు మనుమల, మనుమరాండ్ర పొందుకాలము.

వా న ప్ర స్థా శ్ర మ ము:— భార్యా భ ర్తలుగాని భ ర్తగాని భగవంతునిగూర్చి తపస్సుచేయుచు యితరులకు, బోధించుకాలము.

య త్యా శ్ర మ ము:— తాను సాలోక్యసామీప్య సారూప్యసాయుజ్య పదవులలో నొకదానినైన పొందగల కాలము. బ్రహ్మర్షి జీవన్ముక్తుడు. అనగా మానవుడు భగ వంతుడుగా మారుకాలము. కొందరు గృహాశ్రమమునుండియే వానప్రస్థయత్యాశ్రమములవిడచి ఆయాధర్మము లాచరించి బ్రహ్మర్షులయిరి. ఉదా॥ విశ్వామిత్ర వశిష్టాదులు. మొత్తమున భారతదేశపూర్వులు 25 ఏండ్లు సద్విద్యనేర్చుట, 25 ఏండ్లు గృహాశ్రమముననుండుట వానప్రస్థ యత్యాశ్రమముల 50 ఏండ్లు, భగవంతుని సాలోక్య సామీప్య సారూప్యసాయుజ్య పదవుల నొకటి స్థిరముగా పొంద కృషిచేసినట్లు కన్పడుచున్నది. నేడు మానవుడు వ్యర్థుడు ఏమిచేయలేడు గాన ఈ దేవుని కృషిలోఉండి దేవుని కృప సంపాదించుట ఉత్తమము.

లౌ కి క గృ హ స్థు డు:— బ్రహ్మచర్యమున దేవుని దేవతల ఆకారవర్ణనలు చదివిన ప్రకారము గృహి తాను తన భార్యయు స్థిరమైన దృష్టి చూచుట నేర్చి నందిని చూచిన

గోవు, పెద్దగుఱ్ఱమును చూచిన గుఱ్ఱము, అందమైన పురుషుని కామముతో చూచిన వ్యభిచార స్త్రీ అట్టి రూపసంతతిని గను నట్లు యోగ్యులగు భార్యాభర్తలు తమ దృష్టితో చూచుచు ఐక్యముచేసిన దేవుని దేవతలను సంతానముగా పూర్వము భారతీయులు కనినట్లు గ్రంథములు తెలుపుచున్నవి. అట్టి సత్యమును చూచిన తర్వాత తమ దృష్టి సత్యమయినదని ఆ భార్యాభర్తలు దేవుని దేవతల ఐక్యసిద్ధికై వానప్రస్థయత్యా శ్రమముల పాటుపడెడివారు. స్త్రీపురుష రూపమున మానవుడై పుట్టుట భగవంతునిగా మారుట అనగా బ్రహ్మర్షియగుట గాని లేక దేవుని కృపచెందుటకుగాని అయివున్నదని తెలియుచున్నది. ఈ ఉద్దేశ్యముతో రాజ్యము లేలిరి. వర్తకులుగా, వ్యవసాయకులుగా, సేవకులుగా నుండియు యీ ఉద్దేశ్యమునే స్థిరపరచినట్లు గాన్పించుచున్నది. నేడును అట్లొనర్చిన అట్లుగాగలరు. ఉదా॥ అత్రి అనసూయలు, చంద్రుని, విష్ణుని, శివుని పుత్రులుగా గనినట్లు గలదు. భారత వీరులు, రామాయణ వీరులు, దేవుడు, దేవతలు అయినట్లు గలదు. ప్రస్తుతము పడమట సాంప్రదాయము లెక్కుడుగా గొని ఒక ధనమునకే గొప్పనిచ్చి, ధర్మసత్కామ మోక్షమార్గము విడనాడిన వారి కేమియు మన భారత గ్రంథముల మహిమ అర్థముగాక హేళనచేయుచున్నారు. ఎక్కుడుగా పడమట విద్యాభ్యాసకులు రాజసేవ, వర్తక, వ్యవసాయ, కార్మికులై భారత ధర్మములు విడచిరి. పందిపెంటలతో రైతులు

కొందరు ధాన్యము ఎక్కువ పండునని వాదుచున్నారు. దాన మేధా తగ్గునని అధర్మవృద్ధియగునని పూర్వర్షుల అభిప్రాయము. మనుష్యమలము తిను జంతువుల పాలు మొదలగునవి కూడదని గలదు. యిది పంటకుమాత్రము పనికివచ్చునా! ఇట్లు ఎన్నియో గలవు. గాన మొదట మానవుల సాధు సాధ్వీలగు స్త్రీపురుషులగనిన వారే ఆధర్మాధర్మముల నిర్ణయముచేసి సౌఖ్యముగా మనగలరు. ఆ పూర్వస్థితి నేడు లేకుండుటకు హేతువు మంచి మనుష్యుల పంటపండించకుండుట వల్లనే అయియున్నది. చెడ్డసంతతి గన్నతర్వాత తలిదండ్రులు వారిని బాగుచేయలేక తాము దుఃఖముల పాలగుదురు. ఉ॥ దుర్యోధనాదులు, ధృతరాష్ట్రుడు. సాధ్వాహారము తినుట, ధర్మమార్గమున నడచుట, సత్యము పల్కుట అహింసాది సద్గుణములు గలిగియుండుట గలవారా సాధువులు బలవంతులు అగు మనుష్యుల పంట పండించగలరు. భగవద్దర్శనము చేయుటకు సత్సంతానము గనుటకు భూలోక నానావిధజాతి ప్రజలకు స్వతంత్రము గలదు. పుట్టిన తర్వాత ప్రారబ్ధకర్మఫల మన జాతకఫల ప్రకారము మంచిచెడ్డలు జరుగును. చెడ్డకొంత శాంతిచేయదగునుగాని పూర్తిశాంతిచేయుట చాలా కష్టము.

—: గృహాశ్రమ మహిమ :—

వ్యాస స్మృతిః—'గృహాశ్రమాత్పరో ధర్మో నాస్తి నాస్తి పునః పునః। సర్వతీర్థ ఫలంతస్య యథోక్తం యస్తుపాలయేత్'॥ స్వర్గము మోక్షము సిద్ధింపచేసుకొన గృహాశ్రమము

కంటె గొప్పదిలేదు. ధర్మముగా నడచిన సర్వతీర్థ ఫలమిడును. గురు పితృమాతృ సేవకుడు, భృత్యపోషి, దయాళువు అనసూయకుడు, నిత్యము జపయజ్ఞము చేయువాడు, సత్యవాది, జితేంద్రియుడు, స్వదారతో తృప్తిజెంది పరదారావిముఖుడు, దాత, పరనింద సేయనివాడు అగు గృహస్థుడు నిత్యము తీర్థఫలము జెందును. సర్వేంద్రియములకు తగిన విధముగా నిష్కామ భగవద్దర్శనముచేయుచు సత్యధర్మమార్గమున చరించు గృహాశ్రమికి హరిద్వార కేదార కురుక్షేత్ర పుష్కరాది సర్వతీర్థ ఫలములుగలిగి సర్వపాపహరమగును.

శ్లో. పరదారాన్ పరంద్రవ్యం హారతే యో దినేదినే।
సర్వతీర్థాభిషేకేన పాపం తస్య ననశ్యతి॥

సంతానముచే భర్తను పితరుల సౌఖ్యముచేయు ఒకని దారను హరించుట లేక ఆమె యందు తన సంకరబీజముచే సంతానము గనుట ఒకని ప్రాణము పోషించు ధనమును నశింపచేయుట గలవాడు నానాతీర్థములచే శివాభిషేకముచేసినను ఆ పాపములనుండి విడువబడడు.

శ్లో. మాతాపితో్రి పరం తీర్థం గంగాగావోవిశేషతః
బ్రాహ్మణాత్ పరమం తీర్థం నభూతం నభవిష్యతి॥

తలిదండ్రులు శ్రేష్ఠమగు తీర్థము. అనగా క్రిందిపై లోకాల మోక్షమార్గములేదు. అట్టి మోక్ష స్వర్గమార్గము లిడు [illegible] ఆయాలోకములనుండి వచ్చు జీవుల తమ [illegible] తమశక్తినిచ్చి పుత్రపుత్రికా రూపములగుని

బాల్యమున శ్రద్ధతో వారిని పోషించి గృహులుగా గృహిణులుగా చేయుచున్నారు. గాన తలిదండ్రులు శ్రేష్ఠమగుతీర్థము. అట్లుగాక తమ ఇష్టమువచ్చినట్లు దుష్కాలములో దుష్టకాలముల దుష్టసంతతిని గను తల్లితండ్రి శ్రేష్ఠమగు తీర్థముగారు. గాని పిల్లలకు కొంతసహాయము చేతురు. దాన లాభము లేక ఉభయులు కష్టముల పాలగుదురు. కుమ్మరి గట్టికుండను చేయవలెనన్న సృష్టించు కాలమునే చేయగలడు. గాని ఓటు కుండను సృష్టించిన తర్వాత దానిని గట్టికుండ చేయలేడు. అట్లే ప్రతి మానవుడు సృష్టించుకాలముననే మంచిపిల్లలను గనగలడు. గాని కన్నతర్వాత దుష్టులను సన్మార్గులుగా చేయలేడు. గురువుచే బాగుపడు మార్గము మిగిలియున్నది. దాన పూర్ణదుష్టులు బాగుపడరు. గాని మధ్యమాధమ పాపులు బాగుపడగలరు. గాన తలిదండ్రులు తెలియక హీనునిగా కన్నను వారిని దేవునిగా జూచి పూజించుట పరమోత్తమమైన ధర్మము. పూర్ణదుష్టులగనిన తలిదండ్రులు పిల్లలు నానావిధబాధల పాలగుదురు. భూమికి తగిన బలము చేసిన ఎక్కువ పండునట్లు సత్కాలమున సాధుసంకల్ప దృష్టితో భూమియను భార్యయందు విత్తనమను బీజముంచు వాడు బలీయమగు సత్సంతానమను వడ్లు ఎక్కువగా పండించగలడు. అట్లే దుష్కాలదుష్టసంకల్ప దృష్టితో బలమగు దుష్టభార్య పొందువాడు దుష్టసంతానము నెక్కువ పండించగలడు. దీన జగము, తాను, భార్య, తనసంతతి నానాకష్టములపాలగును.

గంగా సేవ:— పరిశుద్ధ జలములుగల నది భూలోకములో ఇంకొక నదిలేదు. గాన గంగాపరిశుద్ధ జలస్నానము, దాని మట్టి బొట్టుగా ధరించుట, దాని గాలి పీల్చుట మొదలగు కర్మలచే పాపహరమగును.

గోవు:—ఉచ్ఛిష్టము అమేధ్యము తినక తన్నుట పొడుచుటలేని గోవు మానవపోషణకు రెండవ మాత. పూర్వము ప్రతి గృహస్థుడు. 5 లేక 6 ఆవులను పోషించువాడు. అట్టివ భాగ్యవంతుడనిరి. కారణము:—తన ఇంటివారికి తన ఇంటికి వచ్చిన బంధువులకు అతిథులకు ప్రస్తుతకాలము కాఫీ నిచ్చు పడమట దేశపు మర్యాద ఆచరణములోనున్నట్లు పాలు నెయ్యి కలిపి ఇచ్చుట ఆచారములో నుండెడిది. దాన పరులకు, తనకు ఎక్కువ బలముచేకూరెడిది. నేడు కాఫీతో నానారోగముల పాలగుచున్నారు. గాన గోపూజ పాపహరము.

వేదాంత బ్రాహ్మణుడు:— భూలోకమానవులలో నెవ్వడైనను బ్రహ్మజ్ఞాని యన అంతటను భగవంతునిగా జూచువాడు. లేక భగవంతునిగా మారినవాడు. అనగా బ్రహ్మర్షి. ఇట్టివాని సేవ సర్వపాపహరము.

వేద బ్రాహ్మణుడు:— యింద్రాదుల దేవతల పూజించి వారి కృపచే వర్షాదులు కల్గజేయుచు పరోపకారులై చరించుచు ద్విజులై అనగా తాము పూజించు దేవతలగా మార్పుచెంది భూదేవతలన జనులచే అంగీకరింపబడువారు వేదబ్రాహ్మణులు. ఇట్టివారి సేవయు పాపహరము. ఇట్లు

బాహ్మణులు ఒకటి రెండు రకములుగా చెప్పబడిరి. ఈ రెండవరకపు బ్రాహ్మణులే దేవతల విడచి దేవునిపూజించి దేవుడుగా మారినచో ఒకటవరకపు బ్రాహ్మణుడగును. అనగా బ్రహ్మర్షియని పిల్వబడును. అజ్ఞానులు సుజ్ఞానులు అగు తలి దండ్రులకు బుట్టినవారు బ్రహ్మర్షి ని లేక బ్రహ్మజ్ఞానిని గురు రూపసేవచే బ్రహ్మజ్ఞానముజెంది తాము దరిద్రులయినను, ధనవంతులైనను లెక్కచేయక తమ్ము దరిద్రులుగా హీను లుగా కన్నందుకు తలిదండ్రుల ద్వేషింపక గౌరవించుచు గంగాగోవుల నెట్లు సేవించిన పుణ్యమో ఆ సత్యమార్గము తెలిసి అట్లు సేవించుచు తలిదండ్రులు జీవించి నంతకాలము వారిని దేవునిగాజూచి పూజించుచు వారి అనంతరము వారి యెముకలు గంగలోనిడిన స్వర్గము, గయాపిండమున ముక్తి, కల్గుననిన అట్లు చేయుచు తాను భగవంతుడని నమ్మినవాని రూపము హృదయమున నిల్పి గంగానదుల స్నానమాడిన పూర్ణఫలమిడును, లేనిచో ఫలములేదు.

చ ర క ము:— సూత్రస్థానము:- (పూర్వకాలపు గొప్ప డాక్టరు) 'క్షీరఘృతాభ్యాసకరాణాం రసాయనానాం' రసాయనము లనేకము చెప్పినాడు. అన్నిటిలోను గోవుపాలు నేయికలిపి త్రాగుటచే పూర్ణాయువు నానావిధవ్యాధి హారమై సర్వసౌఖ్యము లిడును. కాచిననేయి కఫహారము. పేరిన నేయి పిత్తహారము. రెంటిని తినిన వాతపిత్తకఫహారమై నిత్య సౌఖ్యమిడుననిన అట్లు చేయుచు ఇహపరసుఖముల గాంతురు.

గాన బ్రహ్మజ్ఞాని బ్రహ్మర్షి సేవకన్న మించినది లేదు. ఆవు యందెన్నియో సుగుణ ఫలములు గలవు గాన గోసేవ గొప్పది. దాని పాలుపడనివారు రక్తపిత్త చికిత్స (చరకము) పాలలో 5 రెట్లు నీళ్ళుపోసి కాచి చల్లారిన తర్వాత చక్కెర తేనె వేసి త్రాగేది. లేనిచో ద్రాక్షపండుగాని శొంఠిగాని చేర్చి త్రాగేది. లేక జీలకర్ర వేసి కాచి అందు నేయి చక్కెర కలిపి త్రాగిన రక్తపిత్త వ్యాధి అనగా రక్తము కక్కుట ఎక్కువ వేడి గల్గుట అను రోగము పోవును. అజ్ఞానాంధకారము నశింపజేసి ఇంకెన్నియో సత్యమార్గములు బోధించు గురువు బ్రాహ్మణుడు గాన అతని కన్న మిన్నయగువాడు లేడు అని వ్యాసుడనుటలో అతిశయోక్తి లేదు. వేడిగానున్న పాలలో తేనె కలిపి త్రాగరాదు. చల్లారిన తర్వాత కలిపి త్రాగునది. ప్రతి గృహస్థుడు, గృహిణియు కాఫీ త్రాగుట మాని మంచి గోక్షీరఘృతములు కలిపి త్రాగుట అలవాటు చేయుట మంచిది. ఇందు గృహిణి పట్టుపట్టిన తప్పక పురుషునకు అలవాటు గలిగి ఆయుర్వృద్ధి సౌఖ్యము గల్గును. సద్గ్రంథములు చదువుట బ్రహ్మచర్యాశ్రమ నిర్ణయము. ఆ గ్రంథార్థముల ప్రకారము దేవునిగాని దేవతలగాని ప్రత్యక్షముగా చూచు దృష్టిని స్థిరపరచుట గృహస్థుని ధర్మము. ఆ దృష్టితో చూచిన వానిని సంతానముగా గనినచో తన దృష్టి సత్యమనియు లేనిచో చెడినదని మరలమరల అభ్యసించి అట్టి సంతానము గనువరకు విడువరాదు. ఆ దృష్టి లేనివారు ఋతుకాలమున భార్యను

పొంది సత్సంతానమును గనదగినదేకాని సాధుజనవృద్ధి ఋతు కాలముకాని రాక్షసవృద్ధియగు ఋతుకాలమున భార్యను బొంది దుష్టులబుట్టించు వాడు తనకు జగమునకు అపకారము చేసినవాడై యిహపరసుఖములు లేనివాడగును. రాక్షస ఋతుకాలమన ముట్టైనదాది 16 రాత్రులు దాటిన తర్వాత మరల ముట్టైన తరువాత నాల్గు రాత్రులవరకు గలకాలము.

—: లౌకైక గృహస్థుడు :—

సాధ్వీయగు గృహిరాణి భర్తను పట్టుపట్టి యీదృష్టి ఇద్దరు అలవాటుచేయుచు వారిని తమయందైక్యముచేసి సంయోగ యజ్ఞముచేయుట మొదలుపెట్టిన తాము చూచిన దేవుని దేవతలను కనగలరు. భార్యకంత యిష్టములేనిచో గొప్ప సంతానము కలుగదు. అప్పుడు ఋతుకాల సత్సం తానము నైన గనదగినదే కాని దుష్టసంతతినిగనరాదు. సద్గ్రంథపఠనములేకుండుట, సద్యజ్ఞములు చేయకుండుట,భగవ ధ్యానము లేకుండుట ధర్మమార్గస్థుడుగాకుండుట గల వానికి బ్రాహ్మణనామమున్నను వానిని గురువుగాపూజించెడి జనులు యిహపరముల అసౌఖ్యముగాంతురు. ఇందు తలిదండ్రులే గురువులైన చెప్పెడిదేమియులేదు. ధృవునికి తల్లి మోక్షమా ర్గముపదేశించెను. అత్రి తన పుత్రులకు సుజ్ఞానమార్గము చెప్పెను. అందు చంద్రుడు జన్మతః బ్రాహ్మణుడైనను బ్రాహ్మణ మార్గమువిడచి క్షత్రియుడై కొన్ని తప్పులుచేసినను తుదకు

వాటిని తండ్రి చెప్పిన మార్గాలనడచి ఆ తప్పుల దోషము విడచి భూలోకమునకు రాజై పాలించి తర్వాత ఆకాశమున నక్షత్రములకు రాజై మింటను దీపమువలె వెల్గుచు సర్వజనాహ్లాదుడయ్యెను.

—: బ్రాహ్మణశబ్దము - సంఘములు :—

వేదాంతబ్రాహ్మణులన, బ్రహ్మర్షులు అగు వశిష్టాది ఋషులు. రాజర్షులగు రాజు రాజ్యములో మంత్రులుగా నుండి ఉభయులు నిష్కామముగా సత్యధర్మమార్గముల పాలించిరి.

భగవద్గీత:— రాజ్యములో ఇంద్రాది దేవతల పూజించి వర్షములు కురిపించుట, ఉల్కా, నవగ్రహాది దోష హారముచేసి రాజసహాయముచేయువారు వేదబ్రాహ్మణ సంఘము. ప్రస్తుతం ఇంజినీర్సువంటివారు. మరియు దేవతలకై యజ్ఞములుచేసి వారి కృపతో సౌఖ్యములుగాంచి గృహస్థులగు వారికిని బ్రాహ్మణ శబ్దముగలదు.

క్షత్రియసంఘము:— భూలోకములో ఇంద్రాది దేవతల వేదోక్తమున పూజించుచు వేదోక్త సత్కామమునడచుచు యుద్ధశాస్త్రనేర్పరులై శత్రురాజులనుండి కాపాడువారు, ప్రస్తుతపు సైనికులు.

వర్తకసంఘము :— వేదోక్తసత్కామమున నడచుచు వ్యవసాయ గోరక్షణాదులు చేయువారు, ప్రస్తుతపు వర్తకులు.

సత్సూద్ర సంఘము, విష్ణు స్మృతి:— 'పంచ యజ్ఞవిధానంతు శూద్రస్యాపివిదీయతే.' వేదోక్తసత్కామమున నడచుచు పంచయజ్ఞములు చేయుచు మధు ఘృత తక్ర క్షీరాదులమ్మి జీవించువారు. వర్తక వ్యవసాయములు చేయువారు ప్రస్తుతపు రైతులు. లేక బ్రాహ్మణులు చేయు యజ్ఞశాలలగల ఉద్యోగములు రాజురాజ్యమునగల సర్వోద్యోగులు వర్తకసంఘములగల ఉద్యోగములు సచ్ఛూద్రసంఘము పొంది యజ్ఞముల రాజ్యమును వర్తకము సాగుటకు సోదరుల వలె సాయముచేయువారు. యీ నాల్గుసంఘములున్నగాని భూలోకరాజ్యములు నడువజాలవు. మానవుల గుణకర్మముల బట్టియే పూర్వము మానవునికి నామముంచెడివారు. మానవులలో బ్రహ్మర్షులయినవారు ఉత్తమబ్రాహ్మణులు.

ఇంద్రాది దేవతల పూజించువారు: బ్రాహ్మణసంఘము, సైనికవృత్తివారే క్షత్రియులు. వర్తకము చేయువారు వైశ్యసంఘము. యీసంఘములు నడచుటకు సాయముచేయువారు సచ్ఛూద్రులు. యీ నాల్గుసంఘములవారు తమతమ వృత్తులు విడచి అజ్ఞానులై దుష్టమార్గముననున్న శూద్రులనిరి. యీశూద్రులే జ్ఞానులైన బ్రాహ్మణులనిరి. ఇచ్చట శూద్రులన భారతదేశమున శూద్రులనువారు కారు. గుణకర్మములచే శూద్రులయిన మానవుల కర్థమని తెలియునది.

పరాశర స్మృతి:— 12 అ॥ 'అగ్నికార్యపరిభ్రష్టో

సంధ్యోపాసనవర్జితాః వేదంచైవ నదీయానాః సర్వేతే వృష లాస్మృతాః॥' తమకిష్టమగు సద్గ్రంథపఠనము చేయుచు సత్కామముతో దేవతల దేవుని పూజించువారు బ్రాహ్మణ సంఘము. ఆసంఘములో ఆమార్గము విడిచినవారు శూద్రులు.

అ మ ర ము॥— 'శూద్రాశ్చ వృషలాశ్చ జఘన్యజాః.' శూద్రులన క్లేశమునొందువారు. వృషలులన ధర్మముచెరుచు వారు. 'తస్మాత్ వృషలభీతేన బ్రాహ్మణేన విశేషతః। అధ్యే తవ్యోప్యేక దేశోయదిసర్వం నశక్యతే॥' వేదమంతయు చదువ కున్నను బ్రాహ్మణుడు శూద్రుడుగా మారునని భయముతో కొంత వేదమైనను చదువదగినది. తక్కిన క్షత్రియవర్తకులు సచ్ఛూద్రులు. సత్కామములో తమకు తగిన వేదోక్త కర్మములు చేయకున్న కాంగ్రెస్‌వారు కమ్యూనిష్టులుగా కమ్యూనిష్టులు కాంగ్రెస్‌సంఘముగా మారినట్లు శూద్రులుగా మారుచుందురు. బ్రాహ్మణుడుచేయు కర్మకాండ రెండవ వాడు చేయరాదనిన కారునడుపుట నేర్చినవాడే నడపవలయు గాని ఇతరుడు నడిపిన కారునున్నవారికి తనకు అపకారము గల్గించునుగదా! సచ్ఛూద్రుడైనచో పంచయజ్ఞములచేతలో వేదమహిమ కొంత తెలిసినవాడగుట ధర్మమార్గమున అర్థము చేయనెంచును. తెలియనిచో ఊరుకొనును. శూద్రుడన వేద మన నేమిటో తెలియదు. అట్టివాడు దాని అర్థము వ్రాయ మొదలిడిన కారులోని మనుష్యులను కారునడుప చేతకాని వాడే ఉభయులకు బాధలు కల్గించునట్లు తనకు పరులకు

అపకారము చేయును. దాన శూద్రుడు వేదవిచారణ చేయ రాదనుట దోషమా? శూద్రులన ప్రస్తుత భారతదేశములో తాము శూద్రులమని చెప్పుకొనువారి పేరుకాదు. భూలోక ములో అజ్ఞానులు తామసగుణులు ధర్మముచెరచు వారెవరో వారు శూద్రులు. వీరే సత్యగుణము జ్ఞానము ధర్మమార్గము గలవారైన బ్రాహ్మణులగుదురు. రాజకీయోద్యోగములలో పైవారు క్రిందికి క్రిందివారు పైకి పోవుటలేదా? పూర్వము యీ 4 సంఘములల్లేయున్నవి. రానురాను ఏసంఘములో వారు ఆసంఘసంబంధము నెక్కువచేసుకొనుటచే బ్రాహ్మ ణులు-బ్రాహ్మణులని, క్షత్రియులు-క్షత్రియులమని చెప్పు కొనసాగిరి. గాని గుణకర్మముల విచారణ వదలివేసి మేము గొప్పజాతివారము గొప్పకులమువారమని చెప్పుకొనసాగిరి. పుట్టుకతోనున్నను తర్వాత గల్గినను గుణకర్మములు పొందిన దానికి తగినపేరు మానవుడు పొందుచుండును. పై సంఘములు గృహస్థులుగానున్నారు. వీరు సకామ నిష్కామమార్గస్థు లగుట యిహపరసుఖముల చెందుచుందురు. యీసంఘము లలో మానవులుగాని కుండ, రెల్లు మొదలగువానిలో పుట్టిన మానవులుగాని నిష్కామతపోవంతులై సత్యధర్మమార్గముల నున్న రాజర్షి యగును. ఇట్టివాడు రాజ్యమును పాలింపలేక, గృహరాజ్యమును పాలింపదగినవాడు. యితడు శాసనముల చేత పుస్తకములు వ్రాయుటచేత అట్లాచరింపచేయుటచే జగ మును బాగుచేయుచుండును. కొంత రజోగుణమునూ సాత్విక

గుణ మెచ్చుగా ఇతనియందుండును. ఋషి యన నిష్కామ తపోసత్యమార్గమున బోవువాడు. అంతరింద్రియవిజయము లేక నిష్కామతపోసత్యమార్గస్థుడు మహర్షి. నిష్కామతపో సత్యమార్గధర్మముల బోవువాడు పూర్ణ సాత్వికుడు. భగవం తునిగా మారినవాడు సర్వశక్తివంతుడు. మహాత్ముడగువాడు బ్రహ్మర్షి. ఈ నల్గురువల్లనే శృతి స్మృతి పురాణేతిహాస శాస్త్రాదులు వ్రాయబడినవి. వాటివల్ల నేటికిని జగమునకు మహోపకారము సర్వవిధముల జరుగుచున్నది. జరిగినది. జరుగనున్నది.

గీత: 2వ అధ్యా॥ 46 శ్లో॥ 'యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥' చుట్టూనిండిన జలాశయ మెంత ఉపయోగమో బ్రహ్మజ్ఞానియగువానికి అనగా పై బ్రాహ్మణ క్షత్రియాదు లలో నెవడు బ్రహ్మజ్ఞానియో అట్టివాడే బ్రాహ్మణుడు. వాని కన్ని వేదములందు అంతేఉపయోగము. వేదము, కర్మకాండ, జ్ఞానకాండ అని రెండు తెరగులు. కర్మకాండ ఒక సంఘ జనులు చేయు నిర్ణయముగలది. దాన యిహసుఖము, స్వర్గ సుఖము కలిగి మరల పుట్టువుకు హేతువగును. పరమేశ్వర సేవ స్వల్పముగా చేయుచు ఇంద్రాది దేవతల నెక్కుడు పూజిం చుచు యీ నాల్గు సంఘములు యిహసుఖము పొందినవి. అనగా తినుటకు భోజనము, కట్ట గుడ్డ కల్గించును. బలహీన వర్ణాలు దుష్టసంతతిని గనుచుండుట గల్గును. బలసన్మార్గులు

మంచిసంతతిని గనుచుందురు. దీన ఉభయులకు సఖ్యతలేక విరోధములతో బాధపడినారు. యీస్థితి ప్రకృతి దేవి నారాధించెడు పశ్చిమరాజ్యములలోను మనదేశమున పూర్వము నేడును జరుగుచునే ఉన్నది. యింద్రాది దేవతల పూజింపక ప్రకృతి దేవి నారాధించువారు పూర్వమున మనదేశమున ఒకకాలమున ఎక్కువగా గలరు. ఇది వేదములో కర్మకాండ మార్గము. దీన చక్కగా నడచిన ఇహసుఖమున, అంతమున స్వర్గముచేర్చును.

—: జ్ఞానకాండ :—

భూలోకములో సర్వమానవులు భగవంతు డను రాజొకడున్నాడనుట సత్యమని భగవత్సేవకులై భగవంతు డవతారమూర్తిగ రానపుడు వచ్చునపుడు అతడుచెప్పిన సత్యధర్మము లాచరించుచు జనులలో బోధించుట సత్యాహింసాది సన్మార్గముల ఆధిక్యత తెలుపుట నిష్కామ సత్కామ దుష్కామ మహిమల తెలియబల్కుట రాజ్యాపకారులుగాక తమవృత్తుల నిష్కామ సత్కామమార్గమున నడచుచు ముందు తమ రాజ్యము, గృహస్థధర్మము, బలముగానుండు టకు బలీయమగు సత్సంతానమును గనుట గల్గి ఒక సంఘము నకు ఒకసంఘము స్నేహమున మెలంగుచున్న రాజ్యములోని గృహస్థులందరు ఇహపరసుఖము లందుదురు. ఇది కైవల్య మార్గము. యీ సంఘ గృహస్థులు రాజసేవకులు అధ్యక్షులు ఒకరినొకరు దేవునిగా జూచుట గల్గిన ఒకరికొకరికి ప్రేమాభి

వృద్ధియై దుష్టజనులనుండి కష్టములపాలుగాక సర్వసౌఖ్యము లందెదరు.

ఉ దా హ ర ణ:— అంబరీషు డను రాజు యిట్లు పాలించినాడు. ఒకనిని దేవునిగా చూచువాడు సాదరముతో ఎక్కుడుగౌరవించును. దుష్టుడైనను ఆగౌరవముతో తన దుర్గుణముల మెల్ల మెల్లగా వదలుకొని వానిని గౌరవించి తిరిగి సహాయముచేయును. ఈదృష్టి విడచి దుష్టుల కుపకారము చేసిన తనకు భయపడి చేసినాడని చెప్పుకొనును. అతని దుష్టత్వము వృద్ధియై తుదకు కష్టములపాలగును. ఈ దృష్టిగల ప్రహ్లాదుడు కొలది కాలము తండ్రిచే సేవకులచే బాధపడినను తుదకు వారికి రాజై ఆమూర్గ మందరికి నేర్పి రాక్షసుల దేవ తాసనులుగా చేసినాడు. భగవంతుని సాలోక్యాది పదవుల నిడునది జ్ఞానకాండ.

ఫ ల ము:— గీత 7 అ॥ 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే । యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥' వేలకొలది మనుష్యులలో ఒకడుమాత్రమే కైవల్యసిద్ధికి ప్రయత్నించును. అట్లు మోక్షసిద్ధికొరకు ప్రయత్నించు వారిలో ఒకానొకడుమాత్రమే నన్ను తెలిసికొనునని కృష్ణుడనెను. అట్లు తెలిసి ఆచరించిన మానవుడు బ్రహ్మర్షిగా మారును. అట్టి బ్రహ్మర్షిత్వసిద్ధిగాంచు స్త్రీపురుషుల సృష్టించు దేశస్థు లెంతధన్యులోగదా! ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థీ, జ్ఞానీ అని నాల్గు తెరగులు భక్తులు. 'జ్ఞానీత్వాత్మైవ మేమతం॥'

జ్ఞానికి, భగవంతునకు భేదములేదని కలదు. ఇక్కడ జ్ఞాని శబ్దము బ్రహ్మైక్యసిద్ధుడని అర్థము. అంతటను భగవంతునిగా జూచువాడు జ్ఞాని. మానవుడు దేనిని ప్రేమతో జూచునో దానివంటివానినిగా ఘ్రాణేంద్రియము చేయునవ సోహం సోహం అనును. ఆభగవంతుడే తానని యనుటచే కొంతకాల మునకు భగవచ్ఛక్తి అతనియందుచేరి బ్రహ్మర్షిగా చేయును. స్త్రీని ప్రేమతో జూచువాడు స్త్రీవలె దుర్బలుడగును. గుఱ్ఱ మును జూచువాడు దాని గుణమును, మరియు మానవుడు దేనిని ప్రేమతోజూచిన దాని శక్తివంతుడగుచుండును. మాన వుడు యోగవాహి. దేనినికూడిన దానిశక్తి సంపాదించును. విషమును తినిన దానిశక్తి చంపునదిగాన తానే చచ్చును. అట్టి విషశరీరమును పరులు తినినను విషముతినినవారినివలె బాధించును. 'సః అహం సోహం॥' అదినేను అదినేను అని లోన జీవుడు ముక్కుద్వారా జపించుచుండును. దీనినే అజపగాయత్రి అందురు. అడవిలోనుండు చెంచులు మొద లగువారు జంతువుల భయప్రేమలతోకూడి చూచువారగుట ఆ జంతుగుణము లెక్కుడుగలవారగుదురు. ఒక సద్ధర్మమును చెవులు వినును. దానిప్రకారం కనులుచూచును. దానిని సోహం చేయును ముక్కు. ఆశక్తిని వెల్లడించును వాక్కు. ఆవాక్కులు వ్రాయును చేతులు. ఆవాక్కులు ప్రచారము చేయ సాయపడును చేతులు. తాము వినిన ధర్మప్రకార రూపముగల దేవుని ఇంద్రాదిదేవతలను తమ భర్తలను

జూచుచు భర్తలు భార్యలను జూచుచు అనగా భార్యాభర్తల రూపముగాక తాను సంతానముగా గననెంచి మూర్తిరూప మొకదానినే జూచుచు సంయోగయజ్ఞము చేయువారు అట్టి బలరూపసంతతిని కనగలరు. భుజించిన ఆహార మలవిసర్జనను శిశ్న గుదములు చేయుచుండును. జననీజనకులలోనున్న వారు వారివలె జననీజనకులగుచున్నారు. గురుసేవకులు గురువులగు చున్నారు. గాన నిత్యమును, సర్వమును భగవంతునిగా జూచుచు తానే ఆశ్రమమునకున్న ఆధర్మప్రకారము నడచుచు జీవించువాడు బ్రహ్మర్షిగా మారగలడు. ఈ దృష్టిపడినవా డెంతదుష్టుడైనను తన దుష్టత జూపలేక నిర్విణ్ణుడగును. జూచు వాడు సౌఖ్యమునొందును. తలిదండ్రులు సృష్టికాలములో దుష్టాకార దుష్టగుణజంతువుల ప్రేమించిన జంతుగుణములు గల మనుష్యాకార మేర్పడును. వీరే ఆసురీసంపదవారు. వారికి భవంతునిమాట అన్న ఇష్టముకాదు. అది లేకున్నను సత్యధర్మాహింసాది సద్గుణములు దాల్తురన్న అవియుండవు. పైగా తమోగుణులై జనాపకారము సేయుచు ఇహపరముల నానాకష్టముల పాలగుదురు. గంధర్వదేవతాదులు మానవా కారులైన సన్మార్గులై భగవంతుడన్న ఇష్టపడుచు అతనిని సామాన్యముగా పూజించుచు ఇంద్రాదుల నెక్కుడు పూజించి ప్రజోపకారముచేయుచు తుదకు స్వర్గము జెందు దురు. పూర్వమున భగసంతుని పూజించి సిద్ధిగాక మరల పుట్టువాడొకడే మానవోత్తముడు. ఈతడు బాల్యమునుండి

గాని గురూపదేశకాలమునుండిగాని నిష్కామసన్మార్గమున నడచుచు సర్వమునకు ప్రజలకు నిష్కామముగా మహోపకారములుచేయుచు సర్వము దేవునిగా చూచుచు నిత్యానంద సుఖమొంది బ్రహ్మర్షియగును. గాన భూలోక మానవాకారులందరు సత్యమగు మనుష్యజన్మలుగారు. మానవులు తమ గుణకర్మములు జూచి తమ్ముతామే నిర్ణయించుకొని దుష్టతగానున్న తగ్గించి సన్మార్గమునకు పోవునది. సకామముగానున్న నిష్కామమార్గముకు బోవునది. మనుష్యజన్మము గరుడ కిన్నర దేవతాదులకు మిన్నయైనది. భగవంతుని చేరుటకు తగినది. భగవంతునిగా మారుటకు తగినది. అందుచే వేల కొలది జనులలో ఒకానొకడే మనుష్యుడుండునన తగినది.

తైత్తిరీయోపనిషత్తు:— 'అదితిర్దేవాగంధర్వా మనుష్యాపితరోసురాస్తేషాంసర్వాభూతానాం మాతామేదినీ॥' దేవ, గంధర్వ, మనుష్య, పితర, రాక్షసాదులకు జననస్థానమైనది భూలోకము- మనువుసంతానము మానవులు. నరులన అన్నియు తమవశము పొందించువారు. దేవునికే సర్వము వశమైయుండును. అతనివలెనే బ్రహ్మర్షులుగామారి సర్వమును తమవశమునందుంచువారు నరులని నాఅభిప్రాయము. నరులు స్థానముగా గలవాడు నారాయణుడు. అన విష్ణువుపేరు. గాన నరులు తమయందున్న నారాయణుని నిష్కామధ్యానముచేసి రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులయ్యెదరు. నరులుగాపుట్టిన రాక్షసనరులుమాత్రము రాజర్ష్యాది శబ్దధారణకు తగియుం

డరు. గాని నామధారులగుదురు. అంతమాత్రమున నెట్టి లాభముండదుగదా!

—: బ్రహ్మర్షి దర్శనము :—

రాజ్యసహాయకులగు బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్ర సంఘములు రాజ్యమేలురాజులు. మంత్రులు సర్వజంతుజాలము దేవతలు. రాక్షసాదులు ఎక్కువ భయభక్తులతో మెలగుదురు. విశేషగౌరవముచేతురు. రామాయణము "విశ్వామిత్రుడు రాజై వసిష్టునికి ఓడినపుడు. "దిగ్బలం క్షత్రియబలం బ్రహ్మ తేజోబలంబలం". క్షత్రియబలము హీనమైనది. బ్రాహ్మణ బలముగొప్పదని తర్వాత ఆ మార్గమునపోయి విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యయ్యెను. రామాయణం.'యితడు దశరధునియింటికి వచ్చినప్పుడు, 'అద్యమేసఫలం జన్మ జీవితంచ సుజీవితం" నాజన్మ సఫలమైనది. 'పూజ్యోసి బహుధామయా'నాచే పూజింప దగిన వాడవు అని రాజుగౌరవించెను. రాముని ఇవ్వననగా అతనికి కోపమువచ్చెను. దాన, 'చచాలవసుధాకృత్స్నా వివేశచభయం' భూకంపముకలిగినది. దేవతలు భయపడిరి. 'యథారాజా తథా ప్రజా', రాజు చెప్పినట్లు ప్రజలు నడిచెదరు. గాని మనువు "వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః'- సర్వజాతులకు బ్రాహ్మణుడన బ్రహ్మర్షి ప్రభువు, గాని బ్రహ్మర్షి నిజూచి భూలోకరాజులు ఇంద్రాదులు సర్వజంతుజాలము భయభక్తులతో మెలంగుదురు. గావ యిట్టిశక్తి మానవులయందు గన్పడువరకు జపతపోవ్రతా దులు నిష్కామముగ చేయుటయే. అట్టిసిద్ధి యీ జన్మమున

కానీ కాకపోనీ మళ్ళీజన్మమున అక్కడనుంచి జపాదులు చేయుట మొదలుపెట్టి ఉత్తమ మానవజన్మమెత్తి సిద్ధిజెందును. కొందరు మళ్ళీజన్మము ఎప్పుడో గల్గుననియెంచి రసాయనములు తిని విశేషాయువుజెంది ఒక జన్మముననే బ్రహ్మర్షులయిరి.

చ ర క సు శ్రు త ము లు:— వీరు పూర్వకాలపు గొప్పడాక్టర్లు, మహర్షులు, బ్రహ్మజ్ఞానసిద్ధిపొంద ఉద్దేశముగల వారికి ప్రత్యేక రసాయనము లనేక విధములుగావ్రాసిరి. చదివి చూడుడు. ఇప్పుడు శుష్కవేదాంత జనవృద్ధియగుటచే పనికి రాకయున్నవి.

గీత 9 వ అ ధ్యా య ము:— సాధారణముగా పాప జన్మలును శూద్రులు, వైశ్యులు, స్త్రీలు, నన్ను నిష్కామ పూజచేసిన ముక్తిగాంతురు "కింపునః బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తదా, అనిత్యమసుఖంలోకం ఇమంప్రాప్య భజస్వమాం" జ్యోతిశాస్త్రమున జాతకభాగప్రకారము గొప్ప రాజయోగములు ఎక్కువబలముగా పట్టినవాడు బ్రాహ్మణుడు లేక రారాజు. అతడు బాల్యమునుండీ భగవంతుని నిష్కామ పూజచేయును. ఆరాజయోగము కొంతతగ్గినవాడు మహర్షి లేక రాజగును. అట్టిస్త్రీలును ఆరాజయోగములు పొందుదురు. అంతకుతగ్గినవారు కోట్లులక్షలుగలవారు. అంతకు తగ్గినవారు వేలుకోరుదురు. స్త్రీలు అంతే ఫలముపొందుదురు. మిగిలిన వారు పాపజన్మలన రాజయోగ భంగముగలవారు. మొదట చెప్పిన బ్రాహ్మణుడు పాపమార్గము నంగీకరింపక పుణ్యకర్మ

ములు చేయుచు తత్ఫలము భగవదర్పణము చేయుచుండును. ఇట్లుండ రాజయోగ గ్రహకాలమున బ్రహ్మర్షిత్వసిద్ధిచెందును. వాని ధర్మములు జనులువిని మహారాజ శాసనములవలె ఆచరింతురు. రాజర్షి భగవంతునియందు ప్రేమకలవాడై అతడు చేయు సత్కర్మఫలము భగవదర్పణచేయుచు రాజయోగ గ్రహకాలమున బ్రహ్మర్షిత్వసిద్ధిచెందును. ఇతడు రాజుగానున్నచో ఆదేశప్రజలు ప్రేమతో అతని శాసనధర్మములన్నియు ఆచరింతురు. భగవదర్చన లేకయున్నచో ఆ యోగ కాలమున రాజ్యమునేగోరిన మరియొక రాజ్యము కలియును. దానితో రాజయోగము సరిపోవును. ఆకాలమున ముక్కుచు మూల్గుచు అతనిధర్మములు పాలించినను ఆయోగకాలము దాటిన ది గ్రేట్ అలగ్జాండరునకువలె సైనికులు వ్యతిరేకులగుదురు. దాన యిహ పరసౌఖ్యములు లేకుండాపోవును. అట్టి రాజయోగస్త్రీలును బ్రహ్మవిద్యా సిద్ధిగాంచిన గార్గి మొదలగు వారివలె అగుదురు. ఇట్టి రాజయోగములేనివారికి యీ కాలమున అనేక విఘ్నములు తటస్థించును. దుస్సంకల్పములు దుష్టగ్రహయోగకాలమునగల్గినను మానవ ధర్మప్రకారము వాటి నణచి విఘ్నములు కష్టములులెక్కచేయక నిష్కామ భగవదర్చనమానక సేయుట విడువక రసాయనములుతిని జీవించుచు కాలము ధర్మమునగడపువారు శబరివలె బ్రహ్మవిద్యా సిద్ధిగాంతురు. అట్లుచేయలేనివారికి విఘ్నములుగలిగి మానుదురు. దాన కొలది లాభములుగలుగునుగాని ఎక్కువలాభ

ముండదు. వారిధర్మములు ప్రజలెక్కుడుగావినరు. రాజయోగములేని మానవులు బ్రహ్మర్షిత్వముగల్గినను ప్రజలు వారి వాక్యము లెక్కడాచరింపరు. గాని అతనికి శక్తిమాత్రము అమోఘముగానేఉండును. అట్టి సిద్ధున కిహపరసౌఖ్యము లధికముగానేయుండును. ఎప్పుడు ఆనందములో మెలగును. దరిద్రభాగ్యములు వానిని బాధింపవు. అందుచే సర్వవిధమానవులు నన్ను పూజించిన సుఖముగాంతురని కృష్ణభగవానుడన్నాడు. అట్లర్చనలేనిచో ఈలోకమున ఎంతవిద్య ఎంతధనమున్నను అసుఖముగానేయుండును. ఆ ధనవిద్యలతో ఈ లోకమున కొంతకాలము మాత్రముండును. తరువాత మరణము చెందుచుండును. ఇది ఎల్లరకు తెలిసియు ఎంతధనమున్నను ప్రతిదినము సోలెడుబియ్యము అన్నముమాత్రముతినుచు దుష్టసంకల్పములతో ఇంద్రియసుఖము లనుభవించుచు భగవదర్చనవిడచుట ఆశ్చర్యముకదా! బ్రహ్మ విద్యాసిద్ధికిగాని అథవా స్వర్గసిద్ధికిగాని మానవుడు భూలోకమున పుట్టుక చెందుటయియున్నది. ఈ రెండుమార్గములు భూలోకమునదక్క యితర లోకాలలేవు. నరకమార్గ మిచ్చోటనేగలదు. గాన దానిని విడనాడునది. గాన సర్వమానవులు స్త్రీలు ఈ విద్యాసిద్ధికై పాటుపడుట పరమోత్తమమార్గము. కలియుగము భారతదేశమునకేగాని యితరదేశములకులేదు. యితరదేశములలో యీవిద్య పూర్ణప్రచారములేదు. గాన అందుపుట్టిన గొప్ప రాజయోగజాతకులు ఆదేశాధ్యక్షులగుట మంత్రి

లగుటతో నరిపోవుచున్నారు. వారిలోను భారతీయులలోను తక్కువజాతకులు రసాయనములుదిని బ్రహ్మవిద్యాసిద్ధి నొందకుండుటకును సత్యమగు బ్రహ్మవిద్యాసిద్ధి మార్గములు స్త్రీలకు భర్తలు పురుషులకు గురువులు నేడు పూర్ణముగా చెప్పువారు లేకుండుటను అట్టికాలమున దేవహూతి కపిలుని పుత్రునిగా గని అతనివల్ల పూర్ణబ్రహ్మవిద్యనువడసి సిద్ధిగాంచినట్లు స్త్రీలు సత్పుత్రుల గనకుండుటను శుష్కవేదాంతులెక్కువై అమాయకస్త్రీలకు ఆసురీసంపదస్త్రీలకు, నీవు బ్రహ్మము నేను బ్రహ్మము అంతా బ్రహ్మముగాన పుణ్యాపాపములులేవు. ఎవరేమి పనిచేసినా తప్పులేదు. ఇదే బ్రహ్మవిద్య తెలిసికొనుట అని రాజర్షి ఋషి మహర్షిశక్తులకు మించిన బ్రహ్మర్షివలె నటించుచు వేదాంత పుస్తకముల బట్టిపట్టి ఉపన్యాసములు బల్లలుగ్గుద్దుచు చెప్పుచు, పైబ్రహ్మర్షులగు విశ్వామిత్రాదుల వంటిశక్తి తాముపొందక పరస్త్రీ పరపురుషుల మాయలంద్రోచి చాలాచోట్లసభలలో అగౌరవముపొందుచు తమరాక్షస మతస్థాపన భారతదేశమున ఎక్కుడుగాచేయుటచే కలి విజృంభించి ఆడుచున్నది. దీనిసత్యము తెలిసికొని జనులు శుష్క వేదాంతులదరికిపోవుటమాని సత్యమగు బ్రహ్మవిద్యాచరణ దానిఫలము కొద్దినైనా 'పొందుచుండు సత్యమార్గస్థునివల్ల తెలిసికొన యితరసభలకుపోక తానువిన్నట్లు ఆచరించి ఫలము బొందువరకు పరస్త్రీ పరపురుషుల సంబంధములేక భార్యా పిల్లలతో అభ్యాసముచేయువారు ధన్యులుగదా! ఇట్టివారు

ఎప్పటికైనా సిద్ధిగాంచకమానరు. ఇది కలియుగమగుట దుష్ట మార్గము వృద్ధిచేయునదిగాన విధవస్త్రీలు పుణ్యస్త్రీలు తమ సోదరుల భర్తల సాధుపుంగవులవద్ద యీవిద్య తెలిసికొనజేసి వారివద్ద గ్రహించి అభ్యసించునది. లేనిచో వారి ఆజ్ఞపొంది వారిలో నొకరుండగా అథవా బంధువుడైనా దరినుండగా గురువువద్ద యీవిద్య నభ్యసించి ఇల్లుచేరి ఇంటసిద్ధికై అభ్యాసముచేయునది. గురువుదరి పరస్త్రీలుండరాదు. తమయింట గాని పెరచోట్లగాని గురుదర్శనముచేయ ఒంటరిగామాట్లాడక తమవారితో కలిసిగాని తమవారు చూచుచుండగాగాని మాట్లాడి వారిని గౌరవించి రాదగినది. ఎవ్వరు దిక్కులేనిస్త్రీలు వ్యభిచారాది దుర్గుణములువిడచి సాధువు, వయోవృద్ధుడగు గురుసన్నిధినున్న దోషములుగారు. వ్యభిచారాదులు మహాపాప మిడునవి, దానసత్యమార్గస్థునైన బ్రహ్మర్షిత్వసిద్ధి కానివ్వకుండాచేయును. వ్యభిచారియగు గురువు స్త్రీలనుపాడుచేయును. వ్యభిచారిణులగు శిష్యురాండ్రు గురువును, ఇహపరసుఖములు లేకుండా చేయుదురు. తుదకిరువురు కష్టహేళనల పాలగుదురు. రాజర్షియైన కాలములోనే త్రిశంకుని శరీరముతో స్వర్గమునకు పంపశక్తివంతుడగు విశ్వామిత్రుడు స్త్రీలదర్శనముచే చెడిపోయి మరలమరల నభ్యసించి తుదకు పరస్త్రీపరపురుష సంబంధమువిడచి తానున్నచోట సత్యధర్మమార్గములనడచి బ్రహ్మర్షియయ్యెను. గాన ప్రతిగృహస్థుడు, గృహిరాణి నేను చెప్పినది తెలిసికొని బ్రహ్మవిద్యసంపాదించి ఇంటనభ్యసించి

సిద్ధిపొందదగినది. భూలోకాన ఏ మానవునికైనను పైగుణ కర్మశక్తులు గలుగనిచో రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహర్షి నామార్హుడుగాడు. ఆచార్య పురోహితశబ్దములు పురాతన కాలాన.యం. ఏ. ప్యాసయినవారికుండెడివి. బ్రహ్మజ్ఞానులై వీరును నిష్కామ గుణకర్మములచరించి రాజులగు వారిచే పూజింపబడువారు. ఉదా॥ ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు ధౌమ్యుడు. ఇప్పటి పడమట దేశీయ యం. ఏ. లు వీరిశక్తిలో ధర్మములో కోటివంతుకూడ కారుగదా! ప్రస్తుతం యం. ఏ. లకు రాజసేవావిద్య ఎక్కుడుగా బోధింపబడుచున్నది. భగవంతుని సేవించువిద్య స్వల్పముగ చెప్పబడుచున్నది. దాన వీరు పూర్వులవలె ప్రకాశించుటలేదు. గాన పూర్వపుటాచార్యుల వంటి ఋష్యాదులవంటి మహాపురుషులగనుటకు గృహాశ్రమ ముండవలెనుగదా !

—: గృహాశ్రమమునకు భార్యాభర్తలు మూలముగదా :—

ప్రజారాజ్యమో, యింగ్లండురాజు రాజ్యమో ఉన్న గాని గృహాశ్రమము నిలువదుగదా! భూలోకమున గృహస్థులు, గృహిణులు తామున్న రాజ్యముల యోగ్యులు సత్యాహింసాదియుతులు రాజ్యము కూలద్రోయు నుద్దేశములేక రాజ్యాభివృద్ధి చేయువారు. నిష్కాములు లేక సత్కామ వన్మార్గులగువారికి ఓటు ఇచ్చి శాసనసభ్యులుగా చేయదగును. త్రాగుబోతులు హంతకులు గృహాశ్రమవిరోధులగు వ్యభిచారులు విషాగ్నులుపెట్టువారు తస్కరులు మొదలగు

దుష్టులకు ఓటిచ్చిన రాజ్యమున దుష్కర్మాభివృద్ధి చేయ పాటుపడుదురు. గాని సద్గుణ్యశ్రీమధర్మాభివృద్ధికి పాటు పడరు. గాన వారికి ఓటు ఇవ్వరాదు. మరియు ఎక్కువ పక్షములున్న విరోధములు వృద్ధియై దేశాపకారమగును. భూలోక ప్రతి ప్రజారాజ్యమున భారతపూర్వర్షులచే నిర్ణ యింపబడిన మహాపాపములు గల్గించు కర్మలు చేయదగునా? కూడదా? అనువాటిపై రాజశాసనసభలలో విచారణ పెట్ట రాదు. సత్కామ నిష్కామ వృద్ధియగు కర్మములపై వృద్ధి చేయ విచారణకు పెట్టదగినది. పూర్వము నేడును చెడ్డ చెడు ఫలమును, మంచి మంచిఫలమును నిచ్చును. గాన చెడుపై విచారణచేయనక్కరలేదు. పూర్వర్షుల సూక్ష్మధర్మముల అతిజాగ్రత్తగా పూర్ణవిద్వాంసులగువారిచే విచారణచేయ దగినది. ప్రజాసమ్మతి అనినంత లాభములేదు. దుష్టప్రజలు దుష్టుల ఎన్నుకొందురు. సాధుప్రజలు సాధువు నెన్నుకొం దురు. సాధువు లెక్కుడైన రాజ్యము సౌఖ్యమిడును. దుష్ట రాజశాసనసభ్యు లెక్కుడైన ఆరాజ్యము కంసరాజ్యమునకు తీసిపోదు. దుష్టకర్మాభివృద్ధిచేయు దుర్మార్గుల రాజశాసన సభ్యులనుగా ప్రజలు ఎన్నుకొనరాదు. దాన ప్రజలేచెడుదురు. ప్రతిరాజ్యమున ఒకటి రెండు పక్షములకన్న ఎక్కువపక్ష ములుగోరు ప్రజలు యేధర్మమును వృద్ధిపొందరు. ధనవంతులు గాని పేదవారుగాని ధనమునకై అన్యాయమార్గము ద్రొక్క రాదు. ధర్మమార్గమున సత్యముతో కూడిన మార్గమున

ధనము సంపాదించుచు సత్కామ, నిష్కామ సిద్ధికి దానిని వ్యయముచేయదగును. ధర్మము విడచిన ధనము మంచిఫల మిడదు. సత్సంతానాభివృద్ధి రాజ్యమున చేసినగాని ధర్మ మార్గము నడువదు. దుష్టులగనిన దుర్మార్గవృద్ధి యగును. గాన గృహస్థులు సాధుసాధ్యులగని వారికి విద్యాశాలలలో ధర్మార్థకామమోక్షములిదు మార్గములు బోధించునట్లు వృద్ధి చేయదగును. ధర్మముతో కూడినదై ప్రతికర్మముండదగును. అనగా ధర్మము, ధర్మార్థసంపాదనయు, ధర్మకామమును, ధర్మమార్గమోక్షమును అనగా ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములు సిద్ధించు మార్గములు బాల్యమున పూర్తిగా పిల్లలకు నేర్పదగును. వాయుభక్షణ, జలభక్షణ, సాత్వాహారభక్షణ, వాటి ఫలములు దెల్పు మార్గములును విద్యాశాలలోనే బాల్యమున నేర్పించిన బాగా అలవాటు పడును. ప్రస్తుత విద్యాశాలలో అర్థకామములేగాని ధర్మ మోక్షమార్గములు బోధించుటలేదు. గాన వీటిని పూర్తిచేయ దగును. వాయుభక్షణాదులచే దేశములో క్షామాదులు గల్గిన వాటి భయము పొందరు.

పిల్లలందరిని రాజసేవ, వర్తకసేవ, రైతుసేవకులు చేసెడు విద్యాభ్యాసములచే జనులెక్కుడైన ఈ సేవావృత్తి దొరుకక నానావస్థల పాలగుదురు. అట్టితరి భగవత్సేవా వృత్తియు బాల్యముననే తెలిసియున్న తన గతజన్మకర్మమని గ్రహించి ఆ దరిద్రకాలమంతయు భగవంతుని పూజించి

మానవుడు తృప్తిచెందును. ధనవంతుడైన సత్కర్మసిద్ధికిగాని నిష్కామసిద్ధికిగాని వ్యయముచేయుచు భగవంతుని పూజిం చుచు తానున్న సేవావృత్తి ధర్మమార్గమున నేయనెంచును. భూలోకములో జనులందరు కొద్దికాలమేయుండి తాము సంపాదించిన ధనాదులు విడచి పరలోకమునకు పోవునని ప్రతివానికి తెలియును. గాన ఉన్నంతకాలము సత్య ధర్మ మార్గములయందు కష్టములు విఘ్నములు కల్గుచున్నను నడచుట మంచిది. రాజ్యమనగా అనేక గృహస్థులు గలది. అట్టి గృహస్థులు నిష్కామసత్కామమార్గముల నడచిననే రాజ్యఫలము గల్గును. దుష్కామవృద్ధి చేయరాదు. మొదట మంచివానివలె గన్పడుచు గృహస్థుల ఓటు దీసుకొని సభ్యుడై మరల వారిమాట వినడు. మరల నతని దించగా ప్రజలందరు కలియుట జరుగుట కష్టము. దాన అతనికాలము సాగిపోవును. గాన తమ రెరింగినంతకు మంచివారిని శాసనసభలకు పంపవల యును. దాన గృహాశ్రమధర్మాభివృద్ధి యగును. రాష్ట్రమున గృహస్థులు దుష్టస్త్రీలు దుష్టపురుషులు పుట్టుటకు తామే కారకులమనియెంచి దుస్సంకల్పములు కల్గుచున్న వాటి నణచి బలవంతులగు సన్మార్గు లెట్లుగల్గుదురా అని ఆలోచించి పూర్వర్షి గ్రంథముల నవీనగ్రంథముల చదివి ఫలితమిడునని తోచినమార్గమున నడచి సత్సంతానము గనువారికి ఇహపర సుఖము గల్గును. యీ కర్మసిద్ధి రాజ్యమేలువారివల్లగాని తల్లి తండ్రి గురువులవల్లగాని కాదు. వారుమాత్రము బోధించ

గలరు. బలహీనులు దుష్టులగువారిని గనినచో తలిదండ్రులకు పితరులకు పరులకుగాని లాభముండదు. ఇట్టి దుష్టులు కోట్లు వృద్ధియైన తమకు పరులకు నాశనముగల్గునుగాని సౌఖ్యము గలుగదు. పుత్రపుత్రికలు తలిదండ్రులకన్న బలవంతులయి నిష్కామసత్కాములైనచో ఆగృహమెంతో వైభవము పొందును. వీరసేనుడు సామాన్యరాజు. అతని పుత్రుడు నలుడు భూలోకసన్మార్గచక్రవర్తి. ఈపుత్రునితో ఆకుటుంబము పెద్ద పేరుపొందినది. మనుమలు మునిమనుమలు ఒకరికన్న ఒకరు బలవంతులు. నిష్కామసత్కాములైన ఆగృహాశ్రమము సూర్యునిభాతి ప్రకాశించును. ఇట్లు గృహస్థులందరు వృద్ధి చెందిన రాజ్యము వైకుంఠమువలె నుండునుగదా! గాన ముందు రాజ్యమున సత్సంతానము వృద్ధికావలయును. దాని తర్వాత ధర్మార్థకామమోక్షములు. అవి సిద్ధిమార్గములుగల విద్యాశాలలు వృద్ధికావలయును. దాన దేశము కైలాసముగా ఆమానవులే చేయుదురు.

—: పుత్రాధిక్యత - పుత్రికాధిక్యత :—

తనకన్న బలవంతుడు సన్మార్గుడు అగు పుత్రునిగనినచో తండ్రి సంపాదించిన దానిని వృద్ధిచేయును లేక తండ్రి సంపాదించకున్నను ధనాదుల వృద్ధిచేయును. బలహీనుల దుష్టులగనినచో తండ్రి సంపాదించినది పోగొట్టి తాను సంపాదించలేక పరులకు తనకు తలిదండ్రులకు నానాకష్టములు గల్గించును గాన బలహీనులగనినచో యిహపరసుఖములేదని గ్రహించి

సత్పుత్రుల నెట్లు గననగునో ఆ మార్గాల గృహస్థులు నడిచిన గాని లాభముండదు. సత్కన్యనుగని కన్యాదానము చేసిన భర్తకు పుట్టినింటికి అత్తింటికి సౌఖ్యములిడి పేరుగాంచును. దుష్కన్యాదానముచే భర్త యింటికి నాశనమిడి పుట్టినింటికి చెడ్డపేరు దెచ్చి కన్యాదాతలగు తలిదండ్రులకు ఇహమున అపకీర్తి పరమున అసౌఖ్యము గల్గించును. తల్లి ప్రాణములు పోవునంత కష్టముజెంది యిట్టి దుష్టసంతానము గనుటకన్న సత్పుత్రుల సత్పుత్రికల గనుట జగమునకు తమకు శుభదాయకముగదా! భార్యభర్త లేకమైయున్న అనగా భర్తచెప్పినట్లు భార్యయు, భార్యచెప్పిన సన్మార్గము భర్తయు వినువారై యున్న అవతారపురుషుల బ్రహ్మర్షుల, సన్మార్గరాజుల, సన్మార్గవర్తకుల, సన్మార్గపురోహితుల, సన్మార్గకార్మికుల, సన్మార్గసేవకుల కనగలరు. అట్లే దుష్టులను కనగలరు. పూర్వము కనినట్లు భారతరామాయణాది గ్రంథములే సాక్ష్యములు. నేడామార్గములు గృహస్థులకు బోధించిన తప్పక కనగలరు. ముందు వారును గనగలరు: రాజు మొదలు సేవకునివరకు సాధువులుగా పుట్టిన భోజనాది సౌఖ్యములలో అందరు భగవత్పూజాపరులై దుఃఖములు అసూయతా లేక బ్రహ్మర్షులగుటకు ప్రయత్నించగలరు. బ్రహ్మర్షులచే నిండియుండు రాజ్యమున్న పరరాజుల భయములేకుండ జరుగును. దాన గృహాశ్రమములు చక్కగా జరుగును. భూలోకమున రాజ్యములు సేయవలసిన పని యింతేగదా? అవతార పురుషులగనుట

బ్రిష్టాచారులగుటకన్న మించినపని భూలోకానలేదు. మానవ సంకరజనులెక్కుడు వృద్ధియైన ఆదేశమునకుగాని పరదేశజులకుగాని నష్టము చేయుచు తాము ను నాశము జెందుదురు. ఈ సంకరజనులమని తెలిసిన వారును నిష్కామ మార్గముననో సత్కామ మార్గముననో చరించుచు పరోపకారులైన యిహ పరసుఖము లందెదరు. దేశాధ్యక్షుడు మంత్రిలు నిష్కాము సన్మార్గులైన ఎట్టి దుష్టులనైనా సన్మార్గమున బెట్టగలరు.

—: భారతదేశము క్రొత్త ప్రజారాజ్యము :—

కాంగ్రెస్ బలమగు పక్షము. వీరిచేతిలో రాజ్యమున్నది. వీరు సత్యాహింసాది సన్మార్గములను వృద్ధిచేయుట మద్యపాన తస్కరాది దుష్ట వృత్తుల నున్నవారి శిక్షించుట ఆహారవృద్ధికి అనేక ప్రోజక్టులు కట్టుట మొదలగు మానవశ్రేయోదాయకములగు కర్మవృద్ధిచేయుచున్నారు. ఇందు మతములకు కులములకు ప్రాముఖ్యతలేదు. హిందువులుగాని మహమ్మదీయులుగాని యితర మతస్థులుగాని భగవంతుని పూజింపగూడదని శాసనములు చేయుటలేదు. విద్యాశాలలు రాజబాటలాది సన్మార్గము లెన్నియో వృద్ధియగుచున్నవి. ఈ దేశహిందు మహమ్మదీయాది యితర మతస్థులకు అంగీకారముగల రాజేంద్రప్రసాద్ జీ అధ్యక్షుడు, నెహ్రూజీ ముఖ్య మంత్రియై యున్నారు. వీరిని పడగొట్టి తామాపదవులు పొందవలెనని మిగిలిన పక్షస్థుల ఊహ.గాని లోకములో నిష్కామ, దుష్కామ, సత్కామ, కర్మములు మూడేగదా! అందు

దుష్కామమున నడువకుండాచేయుటేగదా! ఏ పక్షమువారైన చేయునది గాన అట్టి ఊహాలుమాని వారు మనముఒక దేశీయుల మని తలంచి మొదటివలె అందరు కాంగ్రెస్‌లోచేరి అధికార వ్యామోహము విడచి సత్యధర్మమార్గస్థులయి యిహపర సౌఖ్యములకు దగిన వృత్తుల నడచుచు రాజేంద్రప్రసాద్‌జీకి నెహ్రూజీకి వారున్నంతకాలము ఆ పదవులలో స్థిరముగా నుంచి తాము పదవులపై అపేక్ష వదలి ప్రస్తుతము ప్రసాద్‌జీ నెహ్రూజీలకన్న మిన్న మేధావులులేరని వారుండగానే వారి కన్న బలవంతులగు సత్సంతానాభివృద్ధి చేయదగుననియు ప్రతి గృహి నిష్కామ సన్మార్గమున నడచుచు సత్యాహింసా క్షమాదులను మహిమలబొందువరకు ఆచరింప బూనుచు భగవంతుని బూజించుచు ఋషి మహర్షి బ్రహ్మర్షిత్వసిద్ధికి పాటుపడుచు,అసూయ లోభాది దుర్గుణములు విడచి,పరులకు స్నేహ మార్గమున నడువదగునని బోధించుచు, తాము నడుచుకొనుట ఉత్తమమార్గము. అంతియేగాని పన్ను లెగవేయుడని రైతులకు వర్తకులాది సంఘములకు బోధించుచు మా పక్షముచేరుడని ప్రజలకు బోధించినంత మాత్రాన ప్రస్తుతము కాంగ్రెస్ పడిపోదు. కాంగ్రెస్ రాజకీయసేవకులగు గ్రామాధికారులు మొదలు జిల్లాధికారులు వరకును ప్రసాద్‌జీ నెహ్రూజీ శాసనముల ప్రకారము లంచములు మొగమాటము భయము విడచి తమకు వచ్చు జీతములతోనే ధర్మమార్గమున జీవించుచు దుష్ట మద్యపానుల తస్కరుల ద్యూతకారుల మొదలగు

దుష్టుల గట్టిగా శిక్షించినచో వారు సన్మార్గులగుదురు. పూర్వమున్న సన్మార్గులు వీరు కలసినచో అతిత్వరలో భారత దేశము రామరాజ్య మగుట కేసందియము లేదు. ఈ మాత్రము కాంగ్రెస్‌వారు చేయకపోరు. భూలోకమున ప్రతి దేశస్థులిట్లాచరించిన భూలోకమంతయు రామరాజ్యమగును. గతకాలమున నెందరు పాలించినను, దుర్మార్గశిక్షణ సన్మార్గరక్షణయేగదా! ఇప్పుడును ముందును అంతేగదా! గాన మనదేశములో గల నానావిధ రాజకీయ పక్షములు కాంగ్రెస్‌లో చేరి ఏకపక్షమగుట పరమోత్తమమని నాయూహ. అట్లు సాగుట కష్టమనినచో కాంగ్రెస్‌వారివలె సత్య అహింసాది సన్మార్గముల నడచుచు వాటి మహిమలు పరీక్షించుచుదుర్మార్గము విడచి నిష్కామ సకామ సన్మార్గస్థులయి రెండవ పక్ష ముండుట ఉత్తమము. పెక్కుపక్షములుండుట దేశానర్థకరము. మరియు దుష్టజనవృద్ధిగల బలమగు పక్షముండుటయు దేశానర్థకరమే. గాన పరదేశజుల హేళనలకు పాత్రమగును. కాంగ్రెస్‌వారంతా నిష్కామ సకాములా అన్న ప్రసాద్‌జీ నెహ్రూజీ మొదలగు వారనేకులు గలరు. కొంతమంది దుష్కాములున్నను రహస్యముగా ఆచరింపవలెనేగాని పైకి కన్పడిన శిక్షింపబడుదురు. అధర్మమెపుడు వృద్ధియగునో అప్పుడు ఆ పక్షము దానంత నదియే తగ్గిపోవును. పై సర్వ ప్రభువగు దేవుడు అధర్మపరులకు నాశన మిచ్చుచుండును. రాజ్యము స్థిరమైనగాని గృహాశ్రమ ధర్మము నడువదు గాన

ప్రజలు తమ్ము బాగుచేసుకొన ధర్మాత్ములగువారికే వారి వోటు నిచ్చి శాసన సభ్యులుగా పంపదగునది. దుష్టుల శాసన సభ్యులుగా చేసిన వారును వీరును నానాకష్టముల పాలగుదురు.

-:భార్యా, పిల్లలు, భర్త, సన్మార్గమున నడచుటకుతగినది గృహాశ్రమము:-

గృహాశ్రమము చిన్నరాజ్యము. ఇందు భర్త రాజు, భార్య రాణి, పిల్లలు సేవకులు, ఇందు సన్మార్గమున తనకు వీలగు వృత్తినుండి ధనార్జనచేయుట సాధువులగు పేదలకు సహాయపడుట దుష్టులచేరనీయకుండుట, దుష్టుల చేరకుండుట, నిష్కామ, సత్కామ, సన్మార్గముల భగవంతుని ఇంటివారం దరు పూజించుట, తనకు సహాయముచేయు ఎద్దు, ఆవు, మేక, గుఱ్ఱము మొ॥ సాధుజంతుపోషణచేయుట, తానున్న రాజ్య శాసనప్రకారము రాజులకు పన్నులుకట్టుట, సన్మార్గ రాజ్య శాసనప్రకారము నడచుటయే గృహరాజ్యపాలనము. ఇద్దరు కలసి చాలాకాలము సఖ్యముగానుండుట చాలా దుస్తరమని తలంచి జగదభివృద్ధికై ఋషులు భార్యాభర్తల సఖ్యతకై అనేక గ్రంథములలో ధర్మమార్గములువ్రాసిరి. అవి సంస్కృత భాషనుగలవు. ప్రతి గృహస్థుడు చదువదగును. ఇహాపరముల లాభములేని దుష్టకావ్యము లీమధ్యవారు కల్పించినవిగలవు. వాటిని విడిచి ఋషికృత గ్రంథములనేచదివి అర్థముగ్రహించి ఆ ప్రకారమాచరించిన ఫలమిడగలదు. అర్థముచెప్పుటలో తప్పైన సత్యార్థమును ఆచరించి తెలుసుకొనునదిగాని ఆ గ్రంథములు తప్పునరాదు. భూలోకమున నేదేశమునను నిట్టి

ధర్మమార్గ గ్రింథములులేవు. (ఇవి దుష్టగ్రంథములని చెప్పు వారుకొందరుందురని నాకు తెలియును.) పశ్చిమదేశ వివాహము లెక్కుడు ఫలప్రదముగా లేకుండుటంజూచి భారతదేశ ఋషిధర్మ వివాహాక్రమములకొలది వ్రాయుచున్నాను. అమరము:-వేదాదులలో భార్యానామములు పత్నిఅనగా భర్తకు ఈమెతోకూడా యజ్ఞయోగముగలది. పాణిగృహీత వివాహమున దీనిచేయి భర్తగ్రహించును. ద్వితీయా యజ్ఞఫలము భర్తతోకూడాచెందునది. సహధర్మిణీ భర్తతోగూడ దాన యజ్ఞాది ధర్మములుగలది. భర్త యేయే గుణకర్మములు గల వాడో భార్యయు అట్టిదైనగాని లాభముండదు. ఉదాహరణ: రాముడు యుద్ధాది సర్వధర్మజ్ఞుడు. సీతయు యుద్ధాది సర్వ ధర్మజ్ఞురాలు. దశకంఠుని, సహస్రకంఠ రావణుని రాముడు సంహారించెను. సీత శతకంఠుని సంహారించెను. దీనినిబట్టి స్వసంఘములో తన సమగుణ కర్మానురాగ ధర్మములుగల స్త్రీని పెండ్లాడుట పరమోత్తమము. రాముడు సర్వజనకుడు. సీత సర్వమాత. వారుభయులు ప్రజలాచరింప గృహాశ్రిమ ధర్మములాచరించి చూపిరి. వాటింబట్టి ప్రజలు నడచుకొనిన నేడును గృహస్థులు సర్వసౌఖ్యములు పొందకమానరు. తన గుణకర్మమెరుంగని పరసంఘస్త్రీని వివాహామాడిన ధర్మము తెలియక తుదకిరువురును కష్టముల విరోధముల పాలగుదురు. అక్కడక్కడ ఏదైన సౌఖ్యముగా నడచినను మొత్తమున ధర్మమార్గమున నడువక కుంటువడును. గుణ కర్మానురాగము,

గుణానురాగము గల స్త్రీనైనను పెండ్లాడుట మంచిది. ఉ॥ భీముడు, హిడింబి.

రా మా య ణ ము, బా ల కాం డ:— జనకుడు రామునికి సీతను కన్యాదానముచేయుచు

శ్లో॥ ఇయం సీతా మమసుతా సహధర్మచరీతవ। ప్రతీచ్ఛ చైనాం భద్రంతే। పాణిం గృహిష్వపాణినా। పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతాసదా॥

నా కుమార్తె సీత ఇదిగో, నీకూడా ధర్మమున చరించును. ఈమెను పరిగ్రహింపుము. నీకు శుభమగుగాక. నీచేత యీమె చేయిపట్టుకొనుము. మరియు ఈమె పతివ్రత. మహా భాగ్యముగలదై నిన్ను నీడవలె అనుసరింపుచుండగలదు. అని కన్యాదానముచేసెను. రామాయణమును వాల్మీకియు భారత మును వ్యాసుడు వ్రాయుటజూడ గృహాశ్రమము స్థిరముగా నుండుటకు అందు భార్యాభర్తలు జీవితాంతమువరకును తర్వాత పరలోకాలను ఒకరికొకరు సహాయ ప్రేమస్నేహాము లతో చరించుట, భార్య పరులచే బాధపడకుండా కాపాడుట, భార్య తానదివరకు సంపాదించిన భగవంతుని కృపామహి మచే శత్రువులకు లొంగకుండుట, ఎప్పుడు భర్తనే అనుసరించి నీడవోలె భర్తకు సుఖముచేకూర్చుట, భర్తసముల భర్తకన్న బలవంతులగు సంతానమును గను మార్గముల భర్తతో సమ కృషిచేయుట గలిగినదే సహధర్మిణి. సీత రావణుని జయింప సామర్థ్యముగలదైనను భర్త ఆజ్ఞలేనిదగుటచే రావణునిజూచి

నాభర్తను కనుగొనిరమ్ము. అతడేమిచేయుమనిన అట్లుచేయుదు నని గడ్డిపరక రావణుని చూచి త్రుంచెను. అనగా తనకు రావణుడు గడ్డిపరకవంటివాడనియు, లంకాపట్టణము వీరు లందరిని తానే జయింపగలననియు భర్త ఆజ్ఞలేదుగాన అట్లు చేయరాదనియు, చేయుటకు భర్త ఆజ్ఞకై చూచెనని భావము. భర్తను విడచుట ఇష్టములేక అరణ్యమునకు నీడవోలె బయలు దేరెను. 13 ఏండ్లు అయోధ్యలో మేడలలో నున్న దానికంటె ఆకుటిళ్ళలో సౌఖ్యముగా భర్తతో కాలముగడపెను. అట్టి భార్యను రావణు డపహరింప ఆమెను రక్షింప ప్రాణములపై ఆశవిడచి దేశదేశాలు తిరిగి మిత్రాదుల జేర్చుకొని రావణుని జంపి సీతను రావణునియింట తానెరుంగక కొలదికాలమున్నం దుకు అగ్నిపరీక్షచేసి సర్వదేవ గరుడకిన్నర మానవాదులు మెచ్చగా సీతనుగూడి అయోధ్యజేరి సౌఖ్యముగా రాముడు పాలించెను. అనగా రామాయణములో కధయు, భారతకధయు భూలోకాన ప్రతిదినము జరుగుచుండుననినాయూహ. ఒక గృహస్థుని భార్యను పరగృహస్థుడు మోసముచేసి తీసికొని పోయిన భర్త మొదలగువారు ఆమెనుపట్టి వానిని శిక్షించి యింటికి దెచ్చుటయేగదా! కొందరు మూర్ఖశిఖామణులు రామాయణము జరుగలేదందురు. ప్రతినాడు చూచిన లోకాన లెక్కకుమిన్నగా రామాయణమువంటి మార్గమునే భార్యను పరులచే మోసపోవువారుందురు, అప్పుడు నడువవలసిన ధర్మ మును మిగిలిన సద్ధర్మములనేకముగూర్చి భూలోకమున్నంతకా

లముగృహాశ్రమధర్మము నిలచుటకై రామాయణము వ్రాయ బడినది. భారతమన్న జ్ఞాతులు బంధువులు కూడిన కలహ ములు పెద్ద యుద్ధములై నాశనమగుట ప్రతినాడు జరుగుచునే యుండును. అట్టితరి నడువతగిన ధర్మములతో భారతము వ్రాయబడినది. యీగ్రంథ మబద్ధమని మూర్ఖశిఖామణులు హేళనచేతురు. తమ ధర్మము గొప్పదనియు రామాయణ, భారత ధర్మములు మంచివిగావను మూర్ఖులును గలరు. అట్టి మూర్ఖుల ధర్మము విడిచి ఆ సద్గ్రంథ ధర్మమార్గాల నడచిన సత్ఫల మిడకమానదు. కాకాసురుడు, విరాధుడు సీతను తాను. జూచుచుండ అంటుటచే దోషములేదని రాముడు దానికెట్టి ప్రాయశ్చిత్తము చేయలేదు. దీనిబట్టి భర్త దరినుండ పరు లంటినమాత్రాన దోషములేదని భావము. పరపురుషులతో, పరస్త్రీలతోను జ్ఞాతులు బంధువులతోను కలహము లెప్పుడు. భూలోకాన జరుగుచునేయుండును. గృహాశ్రమములో గొప్ప కష్టములివి. వీటిని దాటుటకై రెండే ఇతిహాసములు వ్రాయ బడినవి. మూడవ ఇతిహాసము వ్రాయనవసరములేదని మూడవ ఇతిహాసములో వ్రాయదగునవి యీ రెండు ఇతిహాసముల యందే గలవని పూర్వులు వ్రాయలేదని నాయూహ. ద్రౌపది యుద్ధముచేయలేదుగాని భర్త హీనులైననాడు దుర్యోధనునిగాని, కర్ణునిగాని. ధనవంతులగాని కోరక తన పతివ్రతాశక్తి నందరికి జూపి భర్తలతోపాటు అరణ్యకష్టములు జెంది గొప్పవాడైనను కీచకునిపై అపేక్షను విడచి తిరిగి భర్త

లపై ప్రేమగలదై యుద్ధములో భర్తలు జయమొంద మరల రాణియై జగత్కల్యాణమార్గము స్త్రీసమాజమునకు భార్యా ధర్మము నేర్పెను. గాని విడాకులు పొందలేదు. సీతయు విడాకులు చెందలేదు. ఇదియే భార్యాభర్తల వివాహమునాటి నుండి గల్గిన స్థిరమైనప్రేమ. (ద్రౌపదీ వివాహము ధర్మమనియు ఆమె పతివ్రత అని వేరే చిన్నపుస్తకము వ్రాసితిని. చదివి చూడుడు.) రాజు, రాణి, వారి సంతతి ధర్మమార్గముననున్న ఆరాజ్య గృహస్థులు, గృహిణులు, వారి పిల్లలు వారి ధర్మ మార్గము ననుసరింతురు. రాజు అన్యాయ మార్గస్థుడు, భార్య వ్యభిచారిణి, పిల్లలు దొంగలైన ఆరాజ్య గృహస్థు లట్లే నడువసాగుదురు. రామాయణ భారతకథలు దురాచారము లేని భార్య భర్త సంతతిగలవారైనట్లు ప్రజలానీతిని నేర్చు కొనదగినట్లు దుష్టరాజు, రాణి పాలనలోనున్న, ఆకథలు చదివి ధర్మము విడువకుండునట్లు ధర్మము స్థిరముగానుండునట్లు బ్రహ్మర్షులు అగు వాల్మీకి వ్యాసులు, రాజు రాణులకు, దేశ ప్రజలకు, సంఘములకు తగినట్లు ధర్మరూపమున శాసించి నట్లు వ్రాసినారు. భూలోకములో ధర్మవిరోధులై భార్యా భర్తలు విడాకులుచెందినట్లు, ధర్మమార్గస్థులై విడాకులుచెందని భార్యాభర్తలు ఎప్పుడును గల్గియుందురు. వారు తపస్సు, బ్రహ్మత్వసిద్ధి పొంద ప్రయత్నించి స్థిరులైన రామలక్ష్మణా దులవలె, ధర్మరాజు భీమాదులవలె, సీతా ద్రౌపదులవలె, గృహస్థులు, గృహిణులు ప్రకాశింతురు. వ్యభిచారములేనంత

మాత్రాన కొంతదిఫలమే గల్గును. తపోవ్రత బ్రహ్మాత్వ సిద్ధులను గాంచినచో నెక్కువ ప్రకాశింతురు. ప్రజారాజ్యమున గాని రాజు రాజ్యమునగాని పెద్దవా రేది ధర్మమందురో ఉన్న వారు దానినే ఆచరింతురు. పూర్వమున జరిగిన చరిత్రలు రామాయణ, భారతములుగా వ్రాయబడినవి. ఇంకెన్ని చరిత్రలు వ్రాసినను అంతకన్న మిన్న ధర్మములు వ్రాయ లేరు. దాన రెండే ఇతిహాసములు వ్రాయబడినవి. అందు ననేక స్త్రీపురుష ధర్మములుగల పూర్వచరిత్రలు చేర్చబడెను. ఇతిహాసములు, పురాణములు కథలు జరుగలేదనియు అవి సరియైనధర్మములు కావనియు అంతకుమించి స్త్రీపురుషరక్షణకు తామేదో కొత్తమార్గమును కనిపెట్టితిమని కొందరు వాపోవుచుందురు.

పరకలహములు, జ్ఞాతికలహములకుమించి జగమున ఏమియులేదుగదా! అవియే కథారూపమున వ్రాయబడెను. పేళ్ళు, కథలు కొద్దికొద్ది బేధములు అక్కడక్కడయున్నను కథాఫలముమాత్రము బేధములేదు. పురాణములు పైరీతి ననేకరాజుల గృహధర్మములు యుద్ధధర్మములు మొదలగు ధర్మములతో నిండియున్నవి. అక్కడక్కడ కథాభేదములు పేళ్ల బేధములు గల్గియున్నను ఫలముమాత్రము బేధముగాలేదు. మరియు వేదము 'సత్యంవద, ధర్మంచర', అని శాసించెను. స్మృతులుదానిని అంగీకరించెను. వాటిని గథారూపమున సత్య ధర్మఫలము లందరికి తెలియుటకై కల్పితకథలతోగాక జరిగిన

చరిత్రలపై పురాణేతిహాసములు వ్రాయబడినవి. గాన శ్రుతి స్మృతులను అనుసరించియేయున్నవి. వేదమను వృక్షమునకు స్మృతులను కొమ్మలు పురాణేతిహాసములను పుష్పఫలముల వలె ఉన్నవి.

వ్యాసస్మృతి:— 'శృతిస్మృతి పురాణానాం విరోధోయత్రదృశ్యతే, తత్రిశ్రౌతం ప్రమాణంతు పురాణానాం స్మృతిర్వరా' అని పురాణకర్తయగు వ్యాసుడు తనధర్మములకు శ్రుతిస్మృతులకు విరోధమైన శ్రుతిస్మృతిధర్మములే శ్రేష్ఠములని చెప్పినాడు. ఆరెంటియందులేనిది ఆచరించిన సత్ఫలమిడునది. అయిన తనధర్మమును ప్రజలాచరించిన మంచిదని తన ధర్మమును మూడవధర్మముగా వ్రాసెను. గౌతమ ధర్మశాస్త్ర సారసంగ్రహమున పురాణధర్మము అధమమనియు, స్మృతి ధర్మము మధ్యమమనియు, స్మృతుల విరోధమున మనుస్మృతి ధర్మము మంచిదనియు, శృతిధర్మము శ్రేష్ఠమనియు, శ్రుతికి శ్రుతికి విరుద్ధమైన దేనికదే ధర్మమని కలదు. గాన శృతిస్మృతి పురాణేతిహాసములలో ధర్మము లొకదానికొకటి విరోధమై యున్నట్లు పూర్వర్షులే తెలుసుకొనినారు. అందుచే వేదము ముఖ్యమని ఋషులంగీకరించిరి. స్మృతి రెండవరకపుధర్మము. పురాణము మూడవరకపు ధర్మము. మొత్తమన్నియు ధర్మమునే బోధించుచున్నవి.

ఉపనిషత్తులు:— నామముల నేకములైనను భావ మొక్కటే. మార్గమొకటే అయియున్నది. ఇందు దేవుని నామ

ములుమాత్రము భేదముగానున్నవి. ప్రతిఉపనిషద్ధర్మమున తాను నిర్ణయించిన నామదైవమొకడే భగవంతుడని చెప్పబడి నది. అతనిని మానవుడు పొందుమార్గము ధర్మమున సర్వేందిస్త్రి యార్చనయే నిష్కామముగా చేయుటయని తెలియుచున్నది. షడ్దర్శనములు, షడ్శాస్త్రములు భిన్నరూపములైనను వేదాదుల సంబంధము విడువలేదు. వేదార్థము తెలియుట చాల కష్టము. దానినే పురాణేతి హాసరూపాలఅర్థమును కథా రూపముగాజరిగిన చరిత్రలపై మళ్ళీచేసిన ఫలము జరుగునట్లు వ్రాయబడినవి. ఫలమిడనిమార్గము ధర్మముకాదు, సత్యముకాదు గాన శ్రుత్యాది గ్రంథములుచదివి భూలోకమానవులందరు తత్ఫలము పొందుదురుగాక.

—: ద్రౌ ప ది :—

ద్రౌపదికి అయిదుగురుభర్తలు. ధర్మమా యన్న అది ప్రత్యేకముగా ఆమె కొక్కదానికేగల్గిన ఈశ్వరవరము. ధర్మశాస్త్రకర్త వ్యాసాంగీకారమున వివాహము. తలిదండ్రి సోదరులఇష్టముపై జరిగినది. అది ఆమె గతజన్మ లక్షణము.

పరాశరస్మృతి:—నల్గురు లేక ముగ్గురుగాని వేదపారగు లేకముగాచెప్పినది ధర్మము.

శ్లో॥ మునిన్యామాత్మవిద్యానాం ద్విజానాం యజ్ఞయాజినాం
వేదవ్రితేషు స్నాతానా మేకోపి పరిషద్భవేత్ ॥

బ్రహ్మవిద్యాసిద్ధుడగు మహాపురుషుడొకడైనను పరిషత్తన బడును. అట్టి పరిషత్తు చెప్పినది ధర్మము. దీనింబట్టి ఈశ్వర

వాక్యము వేదమేగాన ద్రౌపదీవివాహము వేదోక్తము. ధర్మ శాస్త్ర కర్తవ్యాసాంగీకారముగాన స్మృత్యుక్తము. యీవివాహము దానిఫలము శ్రుతిస్మృత్యుక్తమైనది. గాన యితిహాస రూపమున, భారతములో రాజులగు పాండవులు రాణియగు ద్రౌపది వారిసంతతి ధర్మమూర్తులనియు వారిప్రకారము జనులు నడువదగినదనియుఅట్లునడచిన సత్ఫలమిదునని వ్యాసుడురచించి లోకకల్యాణముచేసెను. 'స్త్రీణాం భర్తాహి దైవతః'. స్త్రీలకు భర్త దేవుడు. ద్రౌపది అయిదుగురుభర్తలను ఒకే దేవునిగా జూచునది. గాన యీమెకు అయిదుగురు భర్తలున్నను దేవు డొకడే భర్తయయ్యెను. దీనింబట్టి ద్రౌపది పతివ్రత, సహ ధర్మిణి అయినది. స్త్రీలలో యీమెవివాహము ప్రత్యేకధర్మ మనియు, యితరులట్టివివాహము చేసుకొనరాదని సంస్కృత భారతమున వివాహపర్వ 215 అధ్యాయం 6 వ శ్లోకాన యితరస్త్రీల కీధర్మము కూడదని వ్యాసుడు రచించెను. ప్రస్తు తము అయిదుగురుతో వ్యభిచరించిన స్త్రీ ఇట్టి మహిమలు చూపగలదా! ఆమె వివాహమై పతివ్రతయై పతివ్రతాశక్తి చూపించినది. ప్రస్తుతము యీమెవలె హిమవంతప్రాంతమున టిబెట్టున ఒక స్త్రీకి 5 లేక 6 గురు భర్తలుగలియున్నారని చెప్పుచున్నారు. అది ధర్మము గాదు. యీశ్వర వరముకాదు. ఋషిజనాంగీకారముకాదు. పాండవులు చేసికొనినారని యీ అజ్ఞులు చేసుకొనుటేగాని అది అధర్మము. యిహ పర సుఖము కానిది. పేరుప్రఖ్యాతులులేనిది. అడవిజంతు ధర్మమైయున్నది.

ఆ సురీసంపదవారి మార్గమై యున్నది. సంకరజనవృద్ధి చేసి గృహారిష్టము, గ్రామారిష్టము ఎక్కువ వృద్ధియైన దేశారిష్టము చేయునది. భార్య విద్యలలో సమమైనను భర్త గుణకర్మములు తెలియనిదైన ఇద్దరికి కుదురుటకష్టము గాన అనురాగయుక్త డగు భర్తతో సమాన గుణకర్మధర్మానురాగములు గల దానిని స్వసంఘ ధర్మయుక్తయగు నొకస్త్రీని పురుషుడు వివాహమాడిన సర్వసుఖములు పొందితీరును. లేనిచో కొన్ని కష్టములు గల్గకనూనవని నాయూహ. దీనింబట్టి దేశాంతర జాత్యంతర సంఘాంతర వివాహములు చేయరాదని నాయూహ కాదు. దానిచే భార్యా భర్తల గుణకర్మధర్మము లొకరి కొకరికి తెలియక కలహములుగల్గి విడాకులు వరకు వచ్చును.

ఉ దా హ ర ణ:— కమల్ పాషా టర్కీ అధ్యక్షుడు. భార్య ఫారిస్సు రత్నాల వర్తకుని కూతురుని పెండ్లాడెను. ఇద్దరికి సమధర్మము కాదు. గాన కుదరక విడాకులిచ్చెను. యీ వివాహము దేశాంతరము, జాత్యంతరము, సంఘాంతరము. ఇన్ని ధర్మములా స్త్రీకి తెలియకపోవుటచే భర్తతో కాపురము చేయలేకపోయినది. అక్కడక్కడ కొందరు సౌఖ్యముగా నుండుటయు గలదు. నేనుచెప్పినది ప్రతిదేశమున ఎక్కువగా జరుగుచున్న ధర్మమై యున్నది. పాశ్చాత్య దేశాలలో విడాకులధర్మమెక్కువుగలదు గాన భారతదేశ వివాహ ధర్మ ములవలంబించిన వారి గృహస్థధర్మము ఎక్కువ సౌఖ్యమిచ్చును. సాధారణముగా నేటికిని భూలోకములో యేదేశస్థులా దేశ

స్త్రీలనే ఎక్కువగా వివాహమాడుచున్నారు. అట్లే స్వసంఘ స్త్రీలను వివాహమాడుచున్నారు. అక్కడక్కడ ఒక దేశ స్త్రీ ఒక దేశ పురుషుని, ఒకసంఘ స్త్రీ వేరొకసంఘ పురుషుని వివాహమాడుచున్నది. ఎక్కువగా జరుగుట ఆచారములో లేదు. పూర్వమింతే.

ఉ దా హ ర ణ:— అర్జునుడు-చిత్రాంగద. భూలోక మున మానవులుగా పుట్టుట భోజనము వ్యభిచారము చేయుచు విలాసముగా తిరుగుటకు ఫలహీనపనులు చేయుటకుగాదు. భార్యాభర్తలిద్దరు ఏకమై భగవద్ధ్యానము చేయుచు తమకు దగిన ధర్మమార్గమున నడచుచు బ్రహ్మర్షిత్వము చెందనై యున్నది. బలవంతులు సుజ్ఞానులు అగు సాధుసాధ్వీల గను టకునై యున్నది. యిట్లుపొందనివారు అసురీసంపదవారు. వీరు చేయున దేమన సాధువులకు తమ బంధువులకు ప్రజలకు అపకారముచేయుచు అధర్మమార్గమున నడచుచు దుష్టసంతతి వృద్ధిచేయుచు పగలుచరించియు, సాధుసభలకు సాధువిమర్శల దరికిబోక రాత్రి చరించు గుడ్లగూబ, తోడేలు, నక్క, పులుల వలె జీవితము దుఃఖమయముగా గడపి తుదకు నరకమున గూలుదురు.

—: పద్మపురాణము - భూమిఖండము :—

పి శు పా టి చి ద ం బ ర శా స్త్రి కృ త ము:— కంసునితల్లి గోబలుడను రాక్షసుడు పొందుటలో నా వ్రత భంగము చేసితివని ఆమె శపింపబోవ ఆతడిట్లనియె—

కం. పరకాంతల భుజియించుట
పరధనమునుగొనుట భంగపరచుట తపము
ధ్వరములు చెరచుట ధార్మిక
నరులను బీడించుటయును నాధర్మంబుల్. —

కం. పురుషోత్తమ సంకీర్తన
పరుడగు వానికిని సత్ప్రభావుండగు భూ
సురునకును బతివ్రతకును
తరుణీ! జంకుదురు యాతుధానులు వింటే.

గీ॥ చదివినాడను వేదశాస్త్రములు సర్వ
ధర్మములెరుంగుదును గాని దానవుండ
నగుట నాచరణంబు లేదయ్యె నాకు
ధాత సృజియించె యిట్లు మాజాతికెల్ల.

వేదాదిశాస్త్రములు చదివి వాటి సత్యార్థములప్రకారము ఆచరింపరు. పైగాఅధర్మ అర్థములుచెప్పి అధర్మమార్గమున చరింతురు. వ్యభిచారము, దొంగతనము చేయుటయు, తపస్సు, యజ్ఞములుచేసిన వాటిని చెడగొట్టుట, ధర్మాత్ములగువారిని పీడించుచుండుట రాక్షస లక్షణములు యీజాతికి బ్రహ్మసృష్టినుండిగలవు. కృష్ణార్చకుల, వేదప్రభావయుతుల పతివ్రతల భంగపరచుటకు మేము భయపడుదుము. వీరైన వారికి సాయముచేతుము.

ఉ దా హ ర ణ:— ద్రౌపదికి సూర్యునుండి పంపబడినరాక్షసుడు కీచకుడు బాధింపబోవ దప్పించి సాయపడెను.

అనగా పతివ్రతలగు స్త్రీల నేమియు బాధింపలేరు. పై లక్షణ ములు గలవారే భూమిని రాక్షసులు లేక ఆసురీసంపదవారు. భార్య భరింపబడునది. జాయ అన 'జాయతేస్యాంపతిః' పుత్రరూపేణ భర్తరూపముతో సమానరూపపుత్రుని గనునది.

మను స్మృతిః—'క్షేత్రభూతాస్మృతానారీ బీజభూతః స్మృతఃపుమాన్, క్షేత్రభూత సమాయోగాత్ సంభవస్సర్వ దేహినాం॥' భార్య పొలమని చెప్పబడును. పురుషుడు విత్తన మని చెప్పబడును. ఈ రెండును కలియుటచే సర్వశరీరులు పుట్టుచున్నవి. మినుములు, అనుములు, వడ్లు మొదలగు వాటిని పొలము బాగా ఎండియున్నతరి వర్షము కురిసిననాడు విత్తనములు జల్లిన కొంతకాలమునకు పూర్వపు మినుములు, వడ్లు వంటి విత్తనములు పండునుగదా! మనోవాక్కాయ తపస్వినియు, పతియను దేవునియందే దృష్టిగలది పతివ్రత. అట్టి స్త్రీయను పొలములో సదృతుకాలమున అదివరకు కొంత కాలమునుండి సద్బీజాభివృద్ధి చేయు ఆహారము భుజించుచు శుక్రాభివృద్ధి గలవాడై జీవయుక్తబీజవర్షము కురియింపగా భర్తవంటి ఆకారాదులతో పుత్రుడు జనించును. శోణిత మెక్కుడైన స్త్రీ జనించును. కొద్ది తండ్రిరూపము గలిగి యుండును. యిదియే మనుష్యులపంట. యిదియే సత్సంతా నము గను మార్గము. సంతానము లేనివారైనను యితర రోగములు బాపుకొని పై రీతి ఆచరించిన మానవులపంట పండింపగలరు. ఆవులు సంతాన కామములోబడి ఋతు

కాలాన భరింపరాని కామము దగిలిననాడు అనగా వేద బోయిననాడు అదివరకు జీవయుక్తశుక్రము నిల్వజేసి యుంచిన ఆబోతును బొందిన సంతానము గనుచున్నది. ఇట్లు జంతువు లన్నియు చేయుచున్నవి. ఇట్లే—

భాగవతము:— పతివ్రతయగు దితి తన కతి కామము గల్గుటజూచి భర్తయగు కశ్యపునిచేరి సంతానము నకై పొందనిచో భరింపరాని కామమది యని చెప్పగా ఋతుకాలమైనను చెడుసమయమనియు కొలదికాలము ఓర్పు చెందమనిన అట్లోర్పుచెంద వీలులేదని భార్యచెప్పగా కశ్యపుడు భార్య ఇష్టప్రకారము పొందెను. దాన హిరణ్యాక్ష హిరణ్య కశ్యపులను దుష్టులు పుట్టిరి. సద్రుతుకాలమున భార్య రజస్వ లైనదాది 16 రాత్రులయందు 5, 6, 7, 8, 9, 10, 12, 14, 15, 16 రాత్రులలో భార్యకు అతికామము గల్గిననాడు అనగా భరింపరాని కామము గల్గిననాడు బ్రహ్మచారియై శుక్రము నిల్వచేసియుంచిన భర్తతో చెప్పి పొందదగును. దాన రోగము లేనిదై ఆవులవలె ఆనాటి సంయోగముననే గర్భము నిలచును. ఇట్లు నూటికి 99 మందికి గర్భము నిలచును. ఔష ధము లక్కరలేదు. వంధ్యలైన ఔషధముచే వంధ్యత్వము బాపుకొని ఇట్లే చేయునది. ఒకరాత్రికన్న ఒకరాత్రి బలవం తులు పుట్టుదురు. అందు సరిరాత్రుల పురుషులు, బేసిరాత్రుల స్త్రీలు పుట్టుదురు.

శివగీత 8 వ అధ్యాయము:—

శ్లో॥ షోడశే దివసే గర్భో । జాయతే యసుభ్రువః
చక్రవర్తీ తదా రాజా । జాయతేన నసంశయః॥
శ్లో॥ ఋతుస్నాతా యస్యపుంస । సాకాంక్షీ ముఖ మీక్షితే
తదాకృతి భవేద్గర్భ । స్తద్పశ్యేస్వామి నేముఖం॥

16 వ రాత్రి సంయోగయజ్ఞమున గర్భము నిల్చిన రాజుగాని రారాజుగాని అగును. రాజు చక్రవర్తులు పుట్టించుశక్తియు భగవంతుడు మానవునియందే యుంచెను. ఋతుస్నాతయగు స్త్రీ ఎట్టి పురుషుని అతికామమున జూచునో అట్టి ఆకృతి గర్భము గల్గును. గాన స్వామిముఖమునే చూడనగును. దేవునిచూచి అతనిని తనయం దైక్యముచేసినచో దేవునే కనును. 15 వ రాత్రి పతివ్రతయగు రాణి పుట్టును. 5, 6 రాత్రులందు సామాన్యధనవంతులు, పతివ్రితయగు స్త్రీ, ధర్మాత్ములగు పురుషుడు పుట్టునని తెలియునది. 7 వ రాత్రి వంధ్యయు, పతివ్రిత యగును. 9 వ రాత్రి పతివ్రత ఎక్కుడు ధనవంతురాలు ధర్మమార్గయుక్త జనించును. 11, 13 రాత్రుల గొప్ప ధనవంతురాండ్రు వ్యభిచారస్త్రీలు పుట్టుదురు. 10 వ రాత్రి విశేషసంతానము ఎక్కువధనము ఎక్కువధర్మము గల వాడు పుట్టునని వశిష్టసంహిత (ముహూర్తగ్రింథము) లో గలదు. 16 వ రాత్రి దాటినతర్వాత మరల రజస్వలయై ఋతుస్నాతయగువరకు నింద్యకాలమని ఋషులందరు స్మృతులలో వ్రాసిరి. పురాణముల గలదు. 17 వ రాత్రి మొదలు దీనింబట్టి దుష్టర్తుకాలమనియు అందు పుట్టువారు ఆసురీ

సంపత్తువారు, అధర్మమార్గస్థులగుదురని తెలియుచున్నది. గాన 17, 18 రాత్రులు వరుసగా దుష్టరాజు, దుష్టరాజ్ఞి పుట్టుదురని గ్రహించునది. అంతకంతకు తగ్గుదుష్టులు దుష్ట స్త్రీలు పుట్టుదురని గ్రహింపదగును. రజస్వలయైనదాది 4 రాత్రులు స్త్రీని పొందరాదు. ఏకశయ్యను పరుండరాదు. రజస్వలాస్త్రీని ఆ నాల్గురోజులు పొందిన పురుషునకు ప్రజ్ఞ, తేజము, బలము, దృష్టి, ఆయువు నశించును అని గలదు. కొందరు 3 రాత్రులే నిషేధమని చెప్పిరి. గాన 17 వ రాత్రి మొదలు మరల రజస్వలయగు వరకు కృష్ణపక్షమనియు, ఇందు ఆసురీసంపదమానవులు జనింతురనదగును. పై ఋతుకాలము శుక్లపక్షమనియు అందు కూడని దినములు మొదటి 4 రాత్రులు. 11, 13 దినములుదక్క తక్కినరాత్రులు దైవీ సంపదమానవులు పుట్టుదురు అనదగినది. యిట్లు మానవసృష్టి మానవులపై జంతుసృష్టి వాటిపై తక్కినసృష్టి తక్కినవాటిపై బెట్టి దక్షప్రజాపతి తాను సృష్టించుట మానినాడు అని బ్రహ్మపురాణమున గలదు. పూర్వమున నేమను బ్రహ్మర్షులు చక్రవర్తులు మొదలుకొని హీనుడగు చండాలునివరకు సృష్టించు శక్తి మానవులందు గలదని శాస్త్రసిద్ధాంతము. భూమి ఎక్కువ బద్దలగు వేడి పొందిననాడు రజమగును. అదియే రజస్వల. దానిపై వర్షముకురియ ఏవిలిగల్గి భూమి మంచి శక్తిగలదై యుండును. నాడు నాటిన విత్తనములు బలముగాను, రోగరహితముగాను ఎక్కువగా పండును. అట్లు

గాక చాలకాలము నీళ్ళను నానియుండుటజేసి వేడిపోయి రజముగాక అన రజస్వలగాక యుండుటను మేవిలిగల్గదు. ఆ కాలమున వి త్తిన వి త్తనములు అనగా దాళవవరి అనగా రెండవపంటధాన్యము ఎక్కువ పండినను, తక్కువపండినను అల్పకాలమున నశించును. ఆ బియ్యము సాధారణముగా అందరికీపడక రోగాలహేతువగును. ఇట్లే అతికామము గల్గక సామాన్యకామమున్న స్త్రీని పొందిన బలహీనులు, రోగ యుక్తులు గొప్పవారైనను తక్కువవారైనను అల్పాయుష్కు లగుదురు, అనుట కేసందియము లేదు. శుక్లపక్షఋతుకాల ములో చెడుసమయముల అనగా సంధ్యాకాలాది దుష్టసమ యముల అతికామము దితికివలె గల్గిన చన్నీళ్ళస్నానమున కొంతతగ్గి కొంతకాలమునకు మరల వృద్ధిచెందును. గేదెలు ఆవులు వెదబోవుకాలమున నీళ్ళలో దిగిన అతికామము చల్లారుట రైతులందరెరింగినదే. ఋతుకాలములో సంధ్యా కాలమును పగళ్ళనుగాక రాత్రుల స్త్రీల దీపముండగా యింటి యందు బొందుటచే శుభసంతతి వృద్ధియగును. అగ్ని వెలుతురు తగిలినంతవరకు దుష్టజంతువులు రాక్షసాది గ్రహములుచేరవు.

ప్రశ్నోపనిషత్తు:—పగటిసంయోగమునప్రాణము నశించుటచే అల్పాయువుగల్గును. రాత్రి సంయోగమున బ్రహ్మచర్యవ్రతమునాశనముగాక ప్రాణముఆయువువృద్ధియగును అని కలదుచదువుము. శంఖస్మృతి: 'శరీరాత్ ధర్మం స్రవంతి పర్వతే వలిలంయథా!' పతివ్రతకు సాధువులగు పురుషులకు

శరీరమునుండి ధర్మము ప్రవహించును. అట్లే దుష్టస్త్రీలకు దుష్ట పురుషులకు దుష్టులకు పాపము ప్రవహించుననదగును. స్త్రీలు చన్నీళ్ళస్నానమాడి తడిబట్టకట్టి అన్నమువండుట భారతమున కొన్ని జాతులయందుగలదు. దాని విచారించ ఆమె దుష్టకామి యైనఅన్నములోకిఆమెనుండిపాపము జారుననిదాన గుహ్యేంద్రియాదులు చల్లబడియుండునని పూర్వులు తలంచిరి. దీన కొద్ది లాభమేగాని ఎక్కువలాభముగాదు. కఫశరీరికి ఇది రోగము దెచ్చును. ఆమెకు సరిపడిన నీళ్ళ స్నానమాడి శుభ్రమగు బట్టకట్టి నిష్కామసత్కామ స్త్రీవంట అమృతము. దాని భక్షణ రోగరహితము. మేధావంతము నిడును. వ్యభిచారిణి తడిబట్టతో వంటచేసినను పాపదాయకమే. వేడినీళ్ళు చన్నీళ్ళ స్నానము సత్కామ స్త్రీలకేగాని దుష్కామస్త్రీలకు కొద్ది శుభ్రమిడును.

రా మా య ణ ము: 27 అయోధ్యకాండ :— 'భర్తుర్భాగ్యంహి భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభా' రాముడా, భర్త యొక్క భాగ్యమునంతయు అనుభవించునది భార్యయొకతే గాన నీతో నీడవలె అడవికివచ్చెదనని సీతఅనెను. అనగా భాగ్య మన గతజన్మకర్మఫలము. భర్తదరిద్రుడైన భార్యయు దరిద్రురాలె, భర్త ధనవంతుడు భార్య ధనవంతురాలగును. భర్త రాజు భార్యరాణిఅయి భర్తతో అతనిరాజ్యమున గతకర్మమును భార్యయొక్కతె అనుభవించును. వివాహముకాగానే భార్య యీమార్పుచెందును. భర్త ఆజ్ఞల పాలించు పతివ్రత

యగుభార్య ఎంతగొప్పదైనను భర్త దరిద్రధనముల అనుభవించును. భార్యజాతకము గొప్పదైనచో తన్నాజ్ఞాపించువారు లేని కాలమున ద్రౌపదికి ఆ ప్రభావమునకు ఝడిసి ధృతరాష్ట్రుడు భర్తల విడుదలచేసి రాజ్యమిచ్చెను. ద్రౌపదిని అవమానించిన దుర్యోధను డంగీకరించెను.మరల ద్యూతములో ధర్మజుడోడెను.అతనితోపాటు ఈ ద్రౌపదియుదరిద్ర కాలమనుభవించెను. యోగ్యురాలైన భార్య జాతకమున భాగ్యము గొప్పగానుండి భర్తభాగ్యము తక్కువగానున్నపుడు భర్త యెరింగి ధనాదులందు భార్యపెత్తనముచేయ ఆజ్ఞ ఇచ్చినచో ఆమెవల్ల ధనాదులు వృద్ధియగును. అట్లాజ్ఞయిడకున్న భారతము: 'పౌరుషేణ ప్రయత్నేన వినాదైవం నసిధ్యతి' పురుష ప్రయత్నములేనిది దైవఫలము సిద్ధింపదు. పుత్రునిజాతకము మంచిదైన అతనిచే వ్యాపారముచేయించిన వృద్ధియగును. ముగ్గురువి మంచివికానిచో నానాకష్టముల పాలుచేయును. అమరము స్త్రీలకు యోగ్యానామములు.

—: పతివ్రతామహిమ - దైవీసంపదస్త్రీలు :—

సుచరిత్ర:— భర్తను దేవునిగాచూచునదై నిష్కామసన్మార్గముచే దేవునిగూర్చిచేయు తపోవ్రతాదిఫలములు తనకు భాగవంతుడగుభర్త కల్పించుచు భర్త్రాజ్ఞచే పరోపకారాది సత్కృత్యములు చేయునదగుటచే సుచరిత్రగలది.

సతి:—ఆమె దర్శనముచే పరులపాపము పోగొట్టునది. అనగా పరమేశ్వరుని పూజించి ఆమెను తనయందైక్యపరచి

తానే పరమేశ్వరునని నిశ్చయించి ఆమెవలెశ క్తి తనయందు ప్రకాశించువరకు పూజించుచు భర్తను భగవంతునిగాజూచుచు గూడుచుండునది. యీమెను భక్తితో దర్శించిన దుర్గా లక్ష్ముల నెవ్వరిని దర్శించినను పాపహారమై సుఖదాయకమగు నట్లు కల్గును.

సాధ్వి :— అనగా సుగుణములుగలది.

పతివ్రత :— భర్తను దేవునిగా పూజించుచు ఉదయము మొదలు పరుండువరకు అతనిసేవించుచు ఆజ్ఞలు పాలించుచు అతనికి ఆయుర్వృద్ధి క్రమమార్గములు నడచుచు అతని హితమగు ఆరోగ్యమగు ఆహారములవండుచు కాలము గడుపునది. తాను లక్ష్మియైన తనభర్తను విష్ణువుగాను, తన్ను దుర్గయని భావించిన తనభర్తను శివునిగాను, దలచుట అనగా దుర్గగా తన్ను భావించి భర్తసేవసేయుటన భర్తను శివునిగా పూజించుచు తనకుడిభాగమునుజేర్చి ఇద్దరు ఏకముగానున్నట్లు భావించుట లేక భర్తకున్న ఆశ్రమధర్మములు అతను లేనపుడతనివలెనేసాగించి కాపాడుట.యిట్లు జరుపు స్త్రీలుభర్తలును అత్యంతానందమునొందుచు కాలముగడిపెదరు. వ్రతమున ఉదయము మొదలు సాయంత్రమువరకు ఒకే దేవునిపూజలనుండుట. అట్లు భర్త పూజల అతనికి కావలసినఅన్నము మొదలగునవి వండుట మొదలగు భర్తపనులనుంచుటయే పతివ్రత. యీమె పరపురుష సంబంధమువిడిచి చరించును. ఒకవేళ కావలసినపుడు పురుషుల తండ్రివలె అన్నలవలెజూచి మాట్లాడును. తనభర్త

నొకనినే దేవునిగా జూచునుగాని పరులు తన్ను కష్టముల పాలు చేయనున్న వారిని ద్రౌపది దుశ్శాసనునివలె దేవునిగా జూచి దేవునిస్మరించును. దాన దేవుడువానిపై బడి వారి బారినుండి తప్పించుట జరుగునని భావము. దమయంతి కిరాతుడు వచ్చినపుడు తన దేముడగు నలుని స్మరించినది. ఆ దేవైక్యముగల నలుని వానిపై జూచినది. పైగా శపించినది. తక్షణము వాడు చచ్చెను. గ్రంథాలలో దుశ్శా సనుని ద్రౌపది, దమయంతి కిరాతుని, దేవునిగా జూచినట్లు లేదుగాని, భాగవతమున జడభరతుని చరిత్రలో చంప వచ్చినవారిని దేవునిగా జూడ వారందరు నాశనమైరని గలదు. దానింబట్టి ద్రౌపదీ దమయంతులకా దృష్టిగల్గియుండునని గ్రహించి వ్రాసితిని. స్వయంవరా:తండ్రి అన్నదమ్ముల సన్ని ధానమున తనంతటనే పురుషుని వరించునది. ఎవ్వరూలేక వరిం చుటకూడదు. ఉదా॥ ద్రౌపది, సీత, సావిత్రి.

రామాయణము బాలకాండ:–కుశరాజుకూతుండ్రు 100 మంది వాయుదేవుడు కోరగా మా తండ్రినడుగుము. అతని అంగీకారమే మా అంగీకారమనిరి. దాని కంగీకరింపక వాయువు శపించినను వానిని కోరక తండ్రిచే కన్యాదానము చేయబడి బ్రహ్మదత్తుని పెండ్లాడిరి. అనగా తండ్రి అంగీక రించిన వానిని భర్తగా స్త్రీలు పొందుటగలదు. పశ్చిమ దేశాల యీ మార్గాలులేవు. అక్కడక్కడ కొందరికి స్థిర [illegible]ము గల్గియున్నను ఎక్కువగా భార్యాభర్తలకు

స్థిరగృహాశ్రమము గల్గక స్త్రీ స్వాతంత్ర్యము పేర విడాకుల చట్టముచే నడచుచున్నది. భారతదేశములో ఎక్కువగా పేదవారియందు ధనవంతులందు మహారాజులందు ఒకే విధముగా భార్యాభర్తలకు స్థిరమగు గృహాశ్రమము జరిగినది, జరుగుచున్నది, జరుగనున్నది. విడాకులు పొందుట తక్కువగా జరుగుచున్నది. భారతదేశ స్త్రీ స్వాతంత్ర్యమునకు పశ్చిమదేశ స్త్రీ స్వాతంత్ర్యమునకు చాలా భేదమున్నది. గాన పశ్చిమదేశీయులు భారతగృహాశ్రమ స్థిరధర్మములు నేర్చి సుఖింతురుగాక.

—: వ్యభిచారిణి మహిమ, ఆసురీ సంపద స్త్రీలు :—

పుంశ్చలి, ధర్షిణీ, బంధకీ, అసతీ, కులట, ఇత్వరీ, స్వైరిణి పాంశులా శబ్దములు వ్యభిచారిణి పేర్లు. పుంశ్చలీ అన పరపురుషుని మోహింపజేసి పొందునది. ధర్షిణీ అన భర్తను మాయ చేసి పరపురుషుని పొందుటలో దిట్టదనముగలది. బంధకీ అన పరుని తనవశము చేయునది. అసతి అన భర్తను దేవునిగా చూడనిది పూజింపనిది, కులట తానొక్కటియయ్యు అనేక విటుల పొందునది. ఇత్వరి అన అసాధుజన స్థానమునకు పోవునది. స్వైరిణి అన తండ్రి అన్న భర్తను లెక్కచేయక స్వేచ్ఛగా చరించునది. పాంసుల అన దుష్ట చరిత్రముగలది. ఇవి వ్యభిచారిణికి పేళ్ళు. ఈ స్త్రీలకు దేవతలన్న దేవుడన్న గిట్టదు. వీరి దృష్టిలో నెన్నడు వారి ఆకారములే కన్పడవు. నిత్యము దుష్టమానవుల ఆకారము దర్శించుచుందురు. వారి

పై ఎక్కువ ప్రేమగాన అట్టి దుష్టులనేగని జగమున అధర్మ స్థాపనచేయుదురు. వి+అభిచారిణి, మంత్రములచే అభిచార ములన ప్రయోగములచే పరుల నశింపజేయునట్లు, పరపురుషుని బొంది ఎక్కువగు పాపముచే రోగాలచే అతనిని త్వరలో నశింపజేయునది వ్యభిచారిణి. జాతక భాగ్యకాలమున ఏవి సంకల్పించిన అవి సిద్ధించును. గాన దుష్టులు పరస్త్రీలగోర, వారు వశవర్తినులగుటలో ఆ భాగ్యకాలము జరిగిపోయి తరువాత బలహీనులు, అగౌరవ యుక్తులయి దుఃఖములతో ఇహపరసుఖముల బొందరు. పతివ్రిత అయిన స్త్రీని జాతక భాగ్యకాలమున కోరినను ఆమె. వశవర్తినిగాక ద్రౌపదిని గోరిన కీచకుడు త్వరలో నశించినట్లు కోరినవాడు నశించును. పతివ్రతకు వ్యభిచారిణికి ఎంత భేదమున్నదో గ్రహించుడు. ఈ వ్యభిచార స్త్రీలే ఆసురీసంపద స్త్రీలనబడుదురు. అధర్వ వేదము:- స్త్రీని పొందుట ఎక్కువ పుణ్యమున్నగాని గల్గదు. పొందిన మాత్రాన అతని పుణ్యము నశించును. పరస్త్రీయైన పూర్వపుణ్యమంతయు నశించును. గాన భార్యనైనను సంతానార్థియై ఋతుకాల గామికే ఆయుర్వృద్ధి యగును. విశేషముగా మంచిచెడ్డలు లేక భార్యను పొందువానికి భార్యబలహీనమై పోవుటగాక భార్యారోగమున క్షయ రోగము కల్గును. లేక యితర రోగగాలు గల్గును. శుక్రిబలము తగ్గును. ఆయువు తక్కువగును. గాన గృహస్థబ్రహ్మచారికి సంతానాభివృద్ధి భోగ భాగ్యములు గల్గి పూర్ణాయువు గల్గును. పరస్త్రీని

బొందుటచే అధర్మమై త్వరలో అతని పుణ్యమంతయు నశించి హీనుడుగా జనవిరోధిగా అగును. ఇది ఇహఫలము. దీనిం బట్టి పరఫలము చాల కష్టమనదగును. హీనజాతి స్త్రీల బొందువాడు త్వరలో హీనుడై నానాకష్టములపాలగును. అధిక జాతిస్త్రీలబొందినవాడు అధికుడుగాక అధర్మమగుటచే నాశము జెందునుగాన యోగ్యురాలైన భార్య నొకదాని బొందువాడు భూలోక సహజముగా కొన్నికష్టములబొందినను మొత్తమున సర్వసౌభాగ్యములను అనుభవించును. ఇహ ఫలము జరిగిన నాడు పరఫలమెందుకు జరుగదు.

—: భారతము అనుశాసనికము స్త్రీధర్మములు :—

సీ. పరమేశయాసురి పైశాచిరాక్షసి
యనుపేళ్ళుగల వధర్మాంగనలకుఁ
వ్యభిచార తత్పరత్వంబు వారికి నెల్ల
గల దసురాంశజ క్రౌర్యనిరత
తన యిచ్ఛబాలియించు ధనధాన్యములచలఁ
హృదయభోగ పరాత్మ యీర్ష్యగలదు
పైశాచికోధన భర్తపుత్రులయందు
నిస్నేహ గృహకార్య నిపుణకాదు
తే. కలహశీలరాక్షసి సయికంబులేదు
బొంకుపల్కు నెప్పుడు నిద్రవోవు వీత
లజ్జయిందరు నాదు కులంబువారిఁ
దురితమొనరించి పోదురు నరకమునకు.

యిట్టి దుష్టస్త్రీకైనను కొంతకాలమునకైన తనది అధర్మమని తెలిసి అహల్యవలె దేవుని పూజించుచు పతిభక్తితో ధర్మమార్గముననున్న పాపహారమై భర్తతో స్వర్గమొందగలదు. అసుర, పిశాచ, రాక్షసజాతి, స్త్రీలలోను పతివ్రతలు గలరు. సర్వజాతుల స్త్రీలు పైరీతినున్న పైనామములు పొందుదురు. ఉదా॥ కై, కేశి, మండోదరి, లీలావతి, మొదలగువారు. సామాన్యముగా ఆజాతులలోను పై అంశలచే భూమింబుట్టిన స్త్రీలలోను వ్యభిచారము ఎక్కువగానుండును. వీరిని పెండ్లాడిన పురుషునికి పిశాచరాక్షస ఆసుర గ్రహములు పట్టిన ఎంతసుఖము గల్గునో అట్టి దుష్టఫలమే గల్గును.

—: పూర్ణవ్యభిచారిణి—మధ్యమవ్యభిచారిణి—అధమవ్యభిచారిణి :—

యింజనీరయిన ఆపనికి యిల్లు విడిచిపోవును. సైనికోద్యోగి ఆపనికిపోవును, వర్తకుడాపనికి పోవును. రైతు పొలమునకు, కార్మికుడు తనపనికి పోవును. వ్యభిచారిణి కాళీగానుండి పరపురుషులగూడు చుండును. పూర్ణవ్యభిచారిణి, భర్తయింటనున్నను వానికి తెలియకుండా వ్యభిచారము చేయుచుండును. వీరిని పట్టుట చాలకష్టము. తమ భార్యలు యోగ్యులగు పతివ్రతలని భర్తలు తలంతురు. యిట్టి స్థితిలో ఈ సృష్టి పరీక్షించిన తల్లక్రిందగుట చూచి అన హీనులు పుట్టుటజూచి శాస్త్రమబద్ధమందురేగాని భార్య వ్యభిచారిణి యని తలంచరు. తలంచరు. భగవద్గీత: తస్మాత్ శాస్త్రం ప్రమాణంతు కార్యాకార్య విచక్షణౌ. అనగా ఈకార్యమిట్లు చేసిన ఫలించును.

యిట్లు చేసిన ఫలించదనుటకు పూర్వులనుభవించి వ్రాసిన శాస్త్రమే ప్రమాణము అని భగవంతుడగు కృష్ణ వాక్యము వీరు త్రోసివేయుదురు. అందుననే రాజ్యమేలు రాజులు స్త్రీలకు అంతఃపురములు కట్టి బంధించి గొప్ప సంతతిని కనినారు. అందు పతివ్రతయైన మంచిదేగదా! వ్యభిచారిణియైన పరపురుష దర్శనములేక మంచి సంతతినే గనునని వారట్లు చేసిరి. రాను రాను మధ్యమాధమ వ్యభిచారిణులు దీనలొంగిరి. కాని పూర్ణ వ్యభిచారిణి అంతఃపురములను బద్దలు చేసినది. యీ దుష్టస్త్రీల వల్లను పతివ్రతయైనను శాస్త్రార్థము చెప్పెడివారు లేకను ప్రస్తుతము దుష్టసంతతి వృద్ధియగుచు. అధర్మమార్గమున కలియుగము వృద్ధియగుచున్నది. గాన యీ దుష్టసంతతిని గనుట మానిన యీ కలియుగమే కృతయుగమనబడును. పూర్ణ వ్యభిచారిణి దాని జీవితాంతమువరకు ఎన్నినీతులు విన్నను వ్యభిచారము మానదు. పూర్ణవ్యభిచారిణులు తమకు గల్గెడు దుష్కామము నాపలేక తమ్మును పరపురుషుల తల్లిదండ్రుల పాపులజేసి భర్త కుటుంబాంతముచేసి తన్ను వీరిని యిహ బాధల నింపి మానవ సృష్టిలో గొప్ప సంతతిగనుట అనుశాస్త్ర ప్రమాణముల అసత్యముచేసి వీరు పరబీజములచే పుత్రుల గనుటవల్ల మానవ సంకరమై ఆ పుత్రులు తల్లిదండ్రులకు విరోధులయి బాధింతురు.

ఉ దా హ ర ణః— కంసుడు. వారివల్ల పితృఋణము తీరక్షు. పైగా పితృశాపము గల్గును. ఈ దుష్టస్త్రీలు

దుష్టపురుషులు వృద్ధియైన జగన్నాశన యుద్ధములు అధర్మ ములగుటచే ఎక్కువగా గాలివానలు, అగ్నిదహనములు, క్షామా డంబరములు మొదలగు కష్టములు గల్గును. పుట్టినతర్వాత వీరిని రాజ్యమేలువారు శిక్షించుట ఎక్కువపని యగును. పర గృహస్థులకు వీరు నానాకష్టములు గల్గింతురు. గాన భూలోక సర్వగృహస్థులు యిట్టి సంకర సంతానమును యీలోకానికి రాకుండా చేతురుగాత. ఒక దేశజు లాచరించినచో వారును ఒకపట్టణస్థులాచరించినచో వారును, ఒక గ్రామస్థులాచరించి నచో వారును ఒకగృహస్థుడాచరించిన ఆతడును దుష్టులబారి నుండి తప్పి సర్వసౌఖ్యములందెదరు. పై చెప్పినది ఋతుకాల సృష్టి. 'సంయోగ శ్చిత్తవృత్తి నిరోధః' అని నాధర్మ సూత్రము.

## —: సంకల్పసృష్టి :—

సంయోగ యజ్ఞమునందు యితర స్త్రీపురుష జంతు సంబంధముగాని దుష్టతలంపులుగాని ఉండరాదు. గ్రంధ ముల చెప్పినప్రకారము భగవంతుని రూపముగాని, అవతార రూపములుగాని యితరదేవతల సూర్యాదిగ్రహములు యింద్రా దుల వర్ణనలుచదివి భారత రామాయణముల గతించిన మహా పురుషుల మరియెట్టి బ్రహ్మర్ష్యాది ఋషుల వర్ణనలు చదివి వారిని సృష్టింపదలచిన భార్యాభర్తలు వారివారి రూపముల స్పష్టముగా ప్రేమతో జూచుచు తమయందు వారినైక్యము జేసి భార్యకు అతికామముగల్గిననాడు ఋతుకాలములో సంయోగ

యజ్ఞము సేయ ఎదుటనున్న వారి ఆకారములు ఫోటోలుదీయు వారు ఫోటోలుదీసిచూపునట్లు వారివారి లక్షణములు శక్తులు గల్గిన సంతానమును గని జూపగలరు. మహాత్మ్రరాండ్రిను సాధ్వీలను దుర్గాది దేవతలను సృష్టింపదలచిన యిదేమార్గము. హీనాకారములు జంతువుల ఆకారములు దుష్టాకారములు జూచుచు నీయజ్ఞము సేయువారు అట్టి లక్షణములు శక్తిగల మానవసంతతిని గాంచెదరు. రజస్వల అయినతర్వాత 16 రాత్రులు గడచినతర్వాత మరల రజస్వల అగువరకు సంయోగము మాని స్త్రీసంతతి గననెంచిన భార్య యోగ్యము బలము వృద్ధిసేయు ఆహారము దిననగును. భర్త భోజనము కొంత తగ్గించవలయును. పురుషసంతతి గోరువారు పురుషుడు బలమైన ఆహారమును దినుచు, భార్య ఆహారము కొంత తగ్గించి తినదగినది. అనగా శుక్రాభివృద్ధిచే పుత్రుడును శోణితాభివృద్ధిచే స్త్రీయు పుట్టునని గ్రహించునది. యీ మార్గములు శ్రుతి స్మృతి పురాణేతిహాసాదుల ననేకస్థలముల గలవు. చదువుడు ఆగ్రంథములబద్ధములనకుడు. ఆగ్రంథములు వ్రాసిన వారు ప్రస్తుతపు కవియుగపు కవులవంటివారు కారు. ఋషి గ్రంథములకు అర్థముచెప్పి ఆచరించి ఫలముగల్గిననే సత్యార్థమగును. కానిచో అర్థము తప్పెనని మరల ఫలముగల్గు అర్థముచెప్పి పరీక్షింపనగు గాని అవి తప్పుమార్గములనరాదు. తాము చెప్పినఅర్థము తప్పినదని గ్రహించుట ఉత్తమము. ఈ సంతానమార్గాలలో పశ్చిమదేశజుల వ్రాతపై వ్యా

మోహపడరాదు. పశ్చిమ దేశజులకు భూలోకమున యితర దేశజులకు భారత దేశ గ్రంధసత్యమును వెల్లడించుడు. భూలోకమున నన్ని దేశముల సాధు సాధ్వీజనము వృద్ధియైన గాని యుద్ధ క్షామాది భయములు పోవు. గాన యీ సృష్టి మార్గము జగమంత ప్రచారముచేయుట లోక కళ్యాణదాయకము. మానవులై యీలోకాన పుట్టిన ఫలము తపస్సుజేసి ఋషిత్వముగాని, బ్రహ్మర్షిత్వముగాని పొందుటగదా! అట్టి మార్గాల నడచి తపస్సున వాటిని సాధించునది. మనపొరుగు దేశీయులు దుష్టులైనవారితో సఖ్యముకుదరక కలహములతో కాలమునరిపోయి దేవాసురయుద్ధములయి ఉభయులకు సౌఖ్యమేకాలమున నుండదు. ప్రస్తుతము అమెరికా, రష్యాలు ఒకరినిచూచి ఒకరు భయపడుచున్నారు. శాత్రుల నిద్ర సరిగాపోరు. ధనాది సౌఖ్యములెన్నియున్నను భయముతోనే కాలముగడపుట గల్గుచున్నది. ఒక దేశజులు మంచివారైనను మరియొక దేశజులు దుష్టులైనను యిరువురు దుష్టులయినను కొలదికాలము తాము కష్టములపాలై భోగభాగ్యములువిడచి యితరులకుగూడ దుర్యోధనునివలె నష్టముగల్గింతురు. దుష్ట స్త్రీపురుషులు వృద్ధియైననాడే యుద్ధ క్షామాది భయములు గల్గునని భారతాది గ్రంధములు చెప్పుచున్నవి. గాక సర్వ దేశజ స్త్రీపురుషులకు జంతుజాలమునకు సంతోషదాయకము, సౌఖ్యదాయకము అగు లోకకల్యాణ మన్మథ యుద్ధమున సత్సంతానమనే ధనసౌఖ్యము పొందుటమంచిది. జగమంతట

సాధుసాధ్వీజనవృద్ధి యెక్కుడై దుష్టులు స్వల్పమైన, వారు ఝడిసి సామాన్యధర్మము నుందురు. దాన లోకము స్వర్గము వైకుంఠము కైలాసమువలె ప్రకాశించును. యీ మన్మథ యుద్ధమున జ్ఞానహీనములగు గుఱ్ఱములు, ఆవులు తమదృష్టి గనునటువంటిదాని గనుచుండును. వ్యభిచారిణి తను ప్రేమించు పురుషుని పొందకపోయినను ఆకాలమున వాని యాకారము ప్రీతితోజూచి అటువంటి రూపపువారిని గనుచుండుటందరు ఎరిగినదేగదా! ఇక జ్ఞానవంతులు, పతివ్రతలు అగు మానవ స్త్రీలు భర్తను దేవునిగా ప్రేమతో జూచి కృష్ణాది అవతార పురుషులను, ఇంద్రాదుల జూచి పాండవులవంటి పుత్రుల లక్ష్మివలె దుర్గవలె జూచి, రుక్మిణీ సావిత్రులవంటి స్త్రీలను సృష్టించుట ఒక లెక్కకాదు. ఈ గొప్ప మానవసృష్టి సర్వ స్త్రీపురుష సామాన్యమైనను ఆసురీసంపద స్త్రీలు, పురుషులు దేవదేవేంద్ర దుర్గాదులయందు ప్రేమలేనివారగుటను పరపురుష పరస్త్రీలయందే ప్రేమగలవారగుటను మరియు జంతుజాలమన్న ప్రీతిగలవారగుటను అట్టి అధర్మగుణ సంతానమును గని జగదపకారము నిరంతరము చేయుచుందురు. ఇది భూలోకసహజమే. కాని వీరు సూర్యచంద్రులనుండి జగదుపకారము గల్గుచున్నదని అంగీకరింతురు. గాన సూర్య చంద్రులవంటి సంతానము వీరు కన్నచో కొంతవరకు జగము బాగుపడును. రాజ్యమేలువారు కవులు, పండితులు, గృహస్థులకు తగు శాస్త్రీయ సద్బోధలు చేయుచున్న కొందరైనను

మంచిసంతానము గనెదరు. అదెట్లన్నను నూటికి 75 గురు వరకు మంచివారైనచో అధర్మమార్గము ధర్మమార్గమునకు సేవకావృత్తి చేయును. ప్రస్తుతము సర్వదేశజులు సర్వగ్రంథములలో ధర్మముల చదువుదురు. వినెదరు. గాని చేయరు. తాము చేయకున్నను, పరగృహస్థులకు బోధించరు. యేకాలమునను సంతానమును భార్యాభర్తలు కనకమానరు. పురుషునకు కామము గల్గినపుడెల్ల భార్యను పొందుటేనని. భార్య దాని కంగీకరించుటేనని. దాన ఏదోరకపు పిల్లలు పుట్టక మానరు. దాన సంతోషించుచు పిల్లలు ఎదిగినతర్వాత తమకు వారివల్ల గల్గు విరోధాదుల దలంచి దుఃఖించుటేగాని వేరు మార్గము గానరాదు. కొందరు బలహీనులు అజ్ఞానులు అగు ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టిన తర్వాత ఆస్తి తక్కువయగునని పోషింపలేమని సంతాననిరోధకశాషధములు పశ్చిమదేశజుల వలె తినుచున్నారు. వారికొందరు గర్భము గలిగిన భ్రూణహత్యాదోషమని తెలిసియు దానిని పాడుచేసుకొనుచున్నారు. దానిలో కొందరు ప్రాణములు పోగొట్టుకొనుచున్నారు. ఇట్టి మార్గములతో దేశములుగాని గృహాశ్రమముగాని బాగుపడవు. గాన పశ్చిమదేశమార్గములు వదలి భారతర్షి మార్గముల గృహస్థ బ్రహ్మచర్యవ్రతమున బుట్టు సత్సంతానము లోకకల్యాణదాయకము కాగలదు. గాన యీ భారతర్షి ధర్మములు భూలోకమంతటను ప్రచారమై అట్లాచరించుచో త్వరలో సాధుసాధ్వులతోనిండి భూజగము వైకుంఠమనదగి

యుండును. ఓ భారతీయులారా! ఓ భూలోకవాసులారా! వల యీ బలహీనము, అజ్ఞానవంతము అగు సంతతినిగని దేహసౌఖ్యములుబాసి దుఃఖపడుట, ప్రతిదేశమున బలవంతులు, సాధుసాధ్వీలగు స్త్రీపురుషుల సృష్టించకున్న సౌఖ్యములు గల్గవు. గాన జగము బాగుపడుటకు మొదటిసోపానము సత్సంతానమును గనుట, రెండవ సోపానము సాత్వికాహారవృద్ధి, సద్విద్య, సత్స్నేహము వృద్ధిచేయుట, సద్ధనార్జనచేయు మార్గములు వృద్ధిచేయుట. గీత॥ ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః। రస్యాఃస్నిగ్ధాః స్థిరాః హృద్యాః ఆహారాస్సాత్విక ప్రియాః॥ యిట్టి సాత్వికాహారము ప్రాణమయమై అది సాధుమనోమయమై అది విజ్ఞానమయమై అది ఆనందమునకు చేర్చును. దీన సత్సంతతియు వృద్ధియగును. అశుద్ధము పందిపెంట మొదలగు దుష్టమగు ఎరువులచే పండించు ఆహారము దుఃఖము దుష్టసంతతినిడును. గాన ప్రతిదేశజులు సాత్వికాహారమునే తినుట వృద్ధిచేయునది. మూడవ సోపానము. ప్రతి గృహస్థుడు భార్య పిల్లలును పరులతో కలహములనొనక స్నేహభావముస మెలంగుట, రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షుల నొకనిగాచేయు నిష్కామసన్మార్గమున ఉదయసాయంత్రముల బ్రహ్మవిద్యామార్గమున భగవంతునిగూర్చి స్వాధ్యాయతపంబులు చేయుట (స్వాధ్యాయమన తాను చదువుట దానిని సాధువులగు యితరులకు చెప్పుట దీన తపంబునకు బలముగల్గి త్వరలో ఫలించు.)

దీన ఆయాలోకములనుండి భూలోకమున దరిద్రమానవులుగానైన ధనవంతులుగానైన మానవులుగా పుట్టినందుకు సాఫల్యము యింతకన్న మిన్నమార్గ మొకటియుండదు. 'నాన్యపంథా అయనాయ విద్యతే' రెండోమార్గం లేదు.

—: భూ లో క ము :—

అనేక కులములు అనేక సంఘములు గలవు. యీకుల సంఘాలయందు సంతానముగను మార్గ మొకటే అయి యున్నది. గీత॥ వీరందరు రెండుపక్షములని శ్రీకృష్ణుడనెను.

తైత్తిరీయము, నారాయణ ప్రశ్న:— 'అదితిర్దేవా గంధర్వా మనుష్యా పితరో సురా_స్తేషాం సర్వాభూతానాం మాతా మేదినీ॥' దేవ మనుష్య గంధర్వాదులు ఒకపక్షము. అసురులు రెండవపక్షము. వీరందరు ఆయాలోకములనుండి భూమిని మానవులుగా పుట్టుచున్నారు. యిందు సాధువులనుమాత్రము భూమి భరించుననియు దుష్టుల భూమి భరింపదనియు వీరు వృద్ధియైననాడు యుద్ధాదులు, అధికవర్షాదులు క్షామాదులచే జననాశనము జరుగునని భారతము చెప్పుచున్నది. వారివారి గుణకర్మములబట్టి దేవాసురాదుల కనుగొనువది. ప్రతిమనుష్యుడు ప్రతిస్త్రీ తన గుణకర్మములబట్టి తానెవరో తెలుసుకొని దుర్మార్గసంకల్పములు కల్గుచున్న రాక్షసలక్షణములని వాటిని వదలి సన్మార్గమున నడచునది. గాని ప్రారబ్దము బలమైన దుర్యోధనునివలె తిరగదు. తక్కువైనచో కొద్దిమార్పు జరుగుచు ఉండును. గాన సృష్టియే స్థితి

కన్న బలవత్తరము. గాన సృష్టించుటలో మానవులు సదృతు కాలమున సన్మార్గుల గనునది. దుష్టులను కనినతర్వాత వారిని సన్మార్గులుగా మార్చుట చాల కష్టము.

సాధుదరిద్రులైనను, సాధు ధనవంతులైనను భూలోకమునన్ని దేశముల మానవులలో దైవీసంపదవారొక పక్షము. వీరు సద్గుణకర్మములు, నిష్కామ, సత్కామ మార్గాల సత్యాహింసాదుల మహిమలబొందు వరకు ఆచరించుచు సంతోషముతో కాలము గడిపెదరు. భగవంతుడు గలడని పూర్ణమైన నమ్మిలో కర్మములు చేయుచుందురు.

దుష్టదరిద్రులైనను దుష్ట ధనవంతులైనను యీ లోక మానవులలో ఆసురీసంపద వారొక పక్షము. వీరు దుర్గుణ దుష్టకర్మములు దుష్కామ హింస లోభ అసత్యమార్గాల నడచుచుందురు. ఇందుకొందరు దేవుడున్నాడని చెప్పుటేకాని పూజాదులుండవు. అంతమాత్రాన సత్ఫలము వారికి చెందదు. కొందరు దేవుడులేడనియు తామే దేవుడనియు నొక్కి వక్కాణింతురు. దేవుని శక్తి వారియందావేశింపనవసరముండదు. దేవనామము తమకు గలదని వచింతురు.

సంపూర్ణ మాధుర్యమునకు సంపూర్ణమగుకారము విరోధమైనట్లే పూర్ణ, మధ్యమ, అధమసన్మార్గులకు, పూర్ణదుష్ట, మధ్యమదుష్ట, అధమదుష్టులకు నిత్యవిరోధము సృష్టి

యం దేగలను. సాధువు లెక్కుడై జగత్కల్యాణము, దుష్టు లెక్కుడైన జగన్నాశము జరుగును.

అ థ ర్వ వే ద ము:— సత్య, అసత్యమార్గములు రెండు ఏకాలముననను స్థిరముగా భూలోకమున యుండునని గలదు. అందు దైవీసంపదవారు సత్యమార్గమున, అసురీసంపద వారు అసత్యమార్గమున నడచుచుందురు. కొంతకాలము సహవాసమున వారి గుణకర్మములు వీరు వీరి గుణకర్మములు వారుగైకొని మారుచుందురు.

ఉ దా హ ర ణ:— వాల్మీకి, నారదుడు. భారతాది గ్రంథములలో అసురీసంపదమానవులను తమతమ రాజ్యము లలో లేకుండాజేసి నిష్కామ, సత్కామ, సన్మార్గముల పాలించినట్లు గలదు. ఈ మూడు యుగాల అనుభవములబట్టి కలియుగమున జనులందరు నిత్యసంతోషులై సర్వసౌఖ్యము లతో అనుభవించవలసినదిపోయి గొప్ప ధర్మమార్గములబాసి హీనజనులు అధర్మమార్గమున బడసి మెలంగుటజూడ ఋషులు కలి యిట్లుజరుగునని ముందే వ్రాసినట్లు జరుగుచుండుట కలి ప్రభావమును కొంత గొప్పగా జెప్పనగును. సత్యమార్గము వారిని కలితుంటదు. గాని నేటికాలమున భూలోకగృహస్థులు పాలించువారు వీరివీరి గృహములమన్మథయుద్ధమున యింద్రియ విషయములగాక దుష్టాహారము తినిన దుష్టజీవులు పురుషుని యొందు ప్రవేశించి దుష్టఋతుకాలాన (అనగా రజస్వలాది 4వ రాత్రి మొదలు 11-13 రాత్రులుదక్క 16 రాత్రులు

ఋతుకాలముగాక తక్కినకాలము నింద్యమని ఋషులు చెప్పిరి. దానినే దుష్టఋతుకాలమని నేను చెప్పుచున్నాను. ఆకాలమున భార్యను గూడ గర్భమునిల్చిన అసురీసంపద జనులు వృద్ధియగుచురు. సాధ్వాహారము తిని భార్యను ఋతుకాలమునగూడనిల్చిన దైవీసంపదజనులు వృద్ధియగుదురు.

రెండవ మార్గము:— దుష్టఋతుకాలాన దుష్ట తలంపులతో దుష్టుల ఆకారము సంకల్పించి వారినిజూచుచు భార్యను గూడిన ఆసురీసంపద వృద్ధియు, ఋతుకాలాన సాధు భావముల విష్ణ్వాది ఆకారముల జూచుచు భార్యను గూడ నిల్చిన దైవీసంపదవారు వృద్ధియగుచుందురు. యీ రెండు మార్గముల పూర్వమునుండి గల అనుభవముల శ్రుత్యాది భారతగ్రంథములందు వ్రాయబడియే యున్నది. యిక యిప్పటి మానవులు ఆచరించిచూచుటేగాని క్రొత్తగా పశ్చిమదేశజుల వలె కనుగొననవసరములేదు. సర్వవిధ సత్యమార్గముల మాన వోన్నతికొరకై సర్వసౌభాగ్యములు పొందుటకునై భారతదేశ శృత్యాదిగ్రంథములను ఋషులు వ్రాసియున్నారు. వాటిని అర్థముజేసి ఆచరించిన ఫలము తేలగలదు. ఫలము తేలనిచో తనకన్న గొప్పపండితులదరి అర్థముచేయించి ఫలము గల్గు వరకు చేయుటేగాని గ్రంథముల తప్పనరాదు. ప్రతి దేశపా లకులు కవులు పండితులు యిందులకై పాటుపడిన త్వరలో సత్యము కనుగొనగలరు. యీకాలమువారి సౌభాగ్యనాశము కొరకు వారు వ్రాయలేదు కలియుగములో సత్య ధర్మ మార్గ

అధ్యక్షుడొక చోటనుండి శాసించుశాసనముల అతడు తమ సాన్నిధ్యముననున్నట్లు తమతమ పాలనగల గ్రామపట్టణ రాష్ట్రముల పాలించి జనుల సన్మార్గులచేయుట, లంచములు, దుర్మార్గములు వృద్ధిచేయకుండుట గల్గిన సత్యమగు రాజసేవకులు. అతనివల్ల జీవించుచు అతని శాసనముల పాలింపక రాజద్రోహులైన శిక్షింపబడుదురు. వీరు భగవంతుని యిండ్లపూజించుచు తరువాత తన పాలక గ్రామాదులలో రాజ శాసనము పాలించి నడచిన వారికి భుక్తి ముక్తి గల్గును.

గృహస్థ సేవకులు:— గృహ యజమాని లేనపుడు అతనివలె అతని భార్యపిల్లలను ధనమును యిల్లును రక్షించి అతడు వచ్చిన అతనికి అప్పజెప్పువాడు నిజమగు గృహస్థసేవకుడు. అట్లుగాక భార్యనుగాని పిల్లలనుగాని ధనముగాని హరించిపారిపోవువాడు సేవకుడన బడడు. గృహాశ్రమద్రోహి శిక్షార్హుడు అగును. సేవకుడు తన యజమానిని తండ్రివలె యజమాని భార్యను తల్లివలె పుత్రుల సోదరులవలె పుత్రికల సోదరీలవలె చూచుచు యజమాని చెప్పిన పనులను యజమాని స్వంతముగాచేసిన నెట్లు ఫలించునో అట్లు ఫలించునట్లు దొంగతనము మొదలగునవి విడచి చేయువాడు నిజమైన గృహస్థ సేవకుడు. యితని సహాయము గృహరాజు గృహిరాణియున్నంత కాలము చెప్పుకొందురు. అట్లే గురుసేవ జననీజనక సేవ వర్తక సేవ రైతుసేవలు జరిగిన స్వస్వాఖ్యములు గల్గునుగదా! సర్వజాతి మానవులలో పూజ్యులైన భారత దేశ

ములో చెప్పుకొను కులస్థుల కిక్కడ అర్థముకాదు, భూలోక ములో నెవ్వరజ్ఞానులో అనగా భగవంతునిగా జగమునుజూడ నేర్వని వారును అసత్యమార్గమునబడి ఇంద్రియలోలురై దుష్ట మార్గముల దిరుగువారు ఎక్కువ తమోగుణులు శూద్రులనబ డుదురు. వీరి జ్ఞానాభివృద్ధికిని సౌఖ్యముగా భుక్తి జరుగుటకు న్ను, గురు, మాతృ, పితృ, బ్రహ్మర్షి సద్గృహస్థ సద్వ్యర్తకసద్వ్య వసాయక సదార్జ్యసేవకులుగా నుండెడివారు. నేడు అట్టి వారు యిట్లు నడచిన ఆ సౌఖ్యములగాంతురు. వీరు సచ్ఛూ ద్రులు. నాల్గవవంతుసేవకా సంఘమున్నగాని జగమే కాలము వను నడువదు. భగవంతుని పూజించు ఋషి, మహర్షి, బ్రహ్మర్షి మార్గస్థులకు సంఘములేదు. అతడొకడే సంఘము రెండవ వానితో వానికి పనిలేదు. లేక సాధుసంతానముతో సద్భా ర్యతో గృహమునసుండి న్యాయమగు నేదోవృత్తితో భుక్తి జరుపుకొనుచు సేవకులున్నను శిష్యులున్నను లేకున్నను కాలము గడపగలరు. ప్రేమతో యజమానిని దర్శించుచున్న ముక్కుసోహం అది నేను అని యెదుట వానిశక్తి పొందజేసి సేవకుని అధికునిగాచేయుచున్నది. అట్లే భగవంతుని సేవకుడు అగువాడు గొప్పవాడగు సచ్ఛూద్రుడు. ఇతనికి భగవంతుని ప్రేమతో దర్శించుటకల్గె నేని ముక్కుసోహము చేయుటచే కొంతకాలమునకు బ్రాహ్మణుడు అన బ్రహ్మర్షిగా మారును. అట్లు మారువరకు భగవంతుని సేవ మానరాదు. గురుసేవ శుడు గురువగువరకు చేయునది. జననీజనక సేవ తాను జనకు

డగు వరకు, స్త్రీ జననియగువరకు చేయునది. ఏది కావలసిన వారు దానిసేవించినగాని దాని పొందరు. అట్లు రాజసేవకులు రాజులగుటలేదు గాని ఎక్కువ రాజమర్యాదల పొందుటగలదు. ప్రస్తుత ప్రజారాజ్యముల రాజసేవకులు అధ్యక్షులుకావచ్చును. ఇట్లే వర్తక రైతు సేవకులు, వర్తక రైతులగుటగలదు. కొందరు మందభాగ్యులు ఆసేవకావృత్తిలోనే ఉండుటగలదు. ఇంతకు ప్రారబ్ధము బలమైన ఊహించినఊహాలు ఫలమునిడును. దీనినే జాతకము బాగుండిన అంతయుమంచియే అగునని చెప్పుదురు. యిట్టి సాధువృత్తులువిడచి అన్యాయవృత్తులబడి జనాపకారులు అజ్ఞానులు అగు మానవు లెవరో భూలోకాన వారే శూద్రులని మన్వాదిస్మృతులు చెప్పుచున్నవి. ప్రతి మానవుడు సేవకావృత్తిలేనిచో బాగుపడడు. ఎవనినో ఒకనిని ప్రతివాడు సేవించితీరవలయును. భూలోకజుల వదలినను దేవతలనో దేవునో సేవించి తీరవలయును. ఇట్లు సత్సేవకులు కాని మానవులనే శూద్రులనిరి. వారే బ్రాహ్మణవృత్తినున్న బ్రాహ్మణులనియు, క్షత్రియ వృత్తినున్న క్షత్రియులనియు, వర్తకవృత్తినున్న వర్తకులనియు, వ్యవసాయకులైన రైతులనియు పిలువబడిరి. కొన్నిరాజ్యముల కులవృత్తుల మారనివ్వక ఎవరి వృత్తిని వారేనుండనిచ్చిరి. కొన్ని రాజ్యముల గుణకర్మములబట్టి కాలముగడిపిరి. భూలోకమున బుట్టిన జంతుజాలమే శూద్రులనబడుదురు. వీరేకర్మకాండలచే ద్విజులయిరి. భూలోకాన నాల్గుసంఘాల జనులను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను

ద్విజులందురు. అనగా మానవులుగా పుట్టి గాయత్ర్యాది జప ములచే దేవతలగా మారుట లేక వారి కృపపొందుటగల వారని భావము. వర్షము కురిపించుట మొదలగు శక్తులు వీరియందు గల్గియుండెడివి. అందు బ్రాహ్మణ ద్విజులను భూదేవతలనిరి. దేవతాశక్తి పూర్తిగాపొందిన వారే రెండవ రకపుబ్రాహ్మణులు. దేవుడుగా మారినవారు మొదటి రకపు బ్రాహ్మణులు, క్షత్రియ వైశ్యులు గాయత్ర్యాది దేవతల కృపగలిగిన వారు. యజ్ఞోపవీత ధారణమాత్రమున ద్విజత్వసిద్ధిలేదు. పాలించురాజు దేవమయుడనిరి. వీరికి బ్రహ్మర్షి సేవ త్వరలో ఫలించుననిరి. శూద్రులై బ్రహ్మర్షి సేవకులైనచో నిష్కామ సన్మార్గులై బ్రహ్మర్షులయిరి, ఉదా:— విదురాదులు. వేదాంత శాస్త్రమార్గమున సిద్ధిగల్గినచో అన్ని జాతులవారు బ్రాహ్మణులగుదురు. యీ బ్రాహ్మణాది జాతులు, రత్నముల, పశువుల, మేఘముల, పక్షులాదులను గలవు. కొన్ని స్మృతులలో కులనిర్ణయమైనవారు బ్రాహ్మణులనుకొనెడివారు. వారు అజ్ఞానులైన శూద్రఫలమునే జెందుదురు గాని బ్రాహ్మణ నామముగల వాడని వ్రాసిరి. ఇది సంఘము కట్టుబాటనదగును. అనగా స్మృతినిర్ణయము. ప్రస్తుతము కారునడుపుట తెలియనివాడు కారు నడపినచో తనకు కారునున్న జనమునకు నష్టముకల్గించునట్లు వేదమున కర్మకాండ అందు దేవతాపూజలు సద్యఃఫలములు ఏమాత్రము తప్పినను చేసినవారికి పరులకు నష్టముగల్గించును. గాన అజ్ఞానులు వేదము సుజ్ఞానులవద్ద నేర్చుకొని ఆచ

రింపదగిన దేశాని స్వంతముగా చదువరాదనిఅర్థము. దీనినే శూద్రులు వేదముచదువరాదని మనగ్రంథాలవ్రాసిరి. భారతము అను శౌనకము.

క. ఎంతెంత మేలుచేసినఁ
అంతంతియ కులమునెక్కుడై సమకూరున్.

మంచివాడైనకొలది కులము మారుచుండును. గత జన్మమున ఏయేపనులుచేసిరో వారు మళ్ళీవచ్చి ఆయాపనులే చేయుచుందురు. ఉదా॥ ఒకడు బ్రహ్మర్షికా లేక మరణము జెందిన మరలపుట్టి అక్కడనుండి అభ్యాసము చేయునని గీతా వాక్యము. బ్రాహ్మణ క్షత్రియవైశ్య నచూద్ర వంశము లలో దుష్టులగు వారందరు రాక్షసజాతిగా నిర్ణయింపబడిరని నాయూహ. వీరివల్ల చాలా నష్టకష్టములు జనులు పడినారు. నేడా రాక్షసజాతి అన్నిసంఘాలలో కలసియున్నది. యీ నాలుగుసంఘాల మానవులుగాని జంతుకుంభాదుల పుట్టిన మానవులుగాని నిష్కామసన్మార్గులయి భగవధ్యానము సేయువారై చాలమంది బ్రహ్మర్షులయిరి.

—: జీవుల పుట్టుక :—

ము ం డ కో ప ని ష త్తు:— ఆయాలోకములనుండి సూర్యునిచేరి అతనినుంచి చంద్రునిజేరి అతనినుంచి మేఘాగ్నిని తగులబడి వర్షరూపాన భూమింబడి ఓషధులయి అన్నరూపాన పురుషునిజేరి శుక్రరూపాన స్త్రీనిచేరి కొంతకాలమునకు మానవులుగా, జంతుకీటాదిక్రిమిరూపులుగా జీవులు

పుట్టుచున్నారు. యీ జీవులకు మొదటినుండి నిష్కామ, దుష్కామ, సత్కామములు తెలియును. యీజీవులు సూర్య చంద్ర సాధు మేఘ సాధువగు ఓషధులు చేరినపుడు యెండ, వెన్నెల, వర్షము, ఆకులు, ఫలములు, నిష్కామముగానే చేయుచున్నవి. (దుష్టవర్షములు, దుష్టభూమి, ఓషధులచే రజో తమోగుణములు పుట్టుచుందురు.) యింతవరకు సాత్విక ముగానుండి యీజీవులు సాధుసాధ్వులజేరి సాధువులుగా, దుష్టస్త్రీపురుషులజేరి దుష్టులుగా పుట్టుదురు. దుష్టునకు పిల్ల నిచ్చుటయు, దుష్టబాలికను పెండ్లాడుట కూడదని ఋషులు నొక్కి వ్రాయుటజూడ దుష్టసంతతి యీలోకాన ఉండరా దని వారి యూహాయైనట్లు కన్పడుచున్నది. యీసృష్టికి మానవుడొక యంగముగానున్నాడు. శుక్లశోణితములు ఆహా రమునగాని కల్గవు. అది వర్షము, వెన్నెలనుగాని గల్గదు. యీ రెండు సూర్యచంద్రులవల్లగాని కల్గవు. గాన సర్వము భూలోకానికి సూర్యునుండి వచ్చుచున్నది. సూర్యుడే బ్రహ్మ మని కొందరుపాసింతురు. ఆ సూర్యుడు భగవంతుని ఆజ్ఞచే నడచువాడని కొందరు చెప్పుచున్నారు. అసావాదిత్యో బ్రహ్మ యీసూర్యుడు బ్రహ్మమే. బ్రహ్మమే భగవంతుడు గాన వీరిద్దరిలో నెవరి నుపాసించినను ఫలదాయకమేనని నా యూహ.

భారత అరణ్యపర్వము, యక్షప్రశ్నలు:—

సూర్యుని నడుపనిదేది, అతని నెవరు పూజించితిరుగుదురు.

తే॥ 'అనిన ధర్మజుడిట్లను నబ్జహితుని నడుపు బ్రహ్మంబు సురకోటి నడుచుగొలచి' ఆమహాత్మునకు సత్యమాధార మంత్రము—' బ్రహ్మముచే సూర్యుడు నడుపబడుచున్నాడు. మన పూర్వులు మంత్రములచే పరకాయప్రవేశాది విద్యలచేతను, బ్రహ్మర్షిత్వసిద్ధిచే గల్గు శక్తిచేతను సర్వమున నేమియున్నదో కనుగొని పుస్తకములు వ్రాసినారని నాయూహ. మనవారు సూర్యచంద్రులవద్ద అగ్నిముఖులగు దేవత లున్నారనిరి. యంత్రాలచే పశ్చిమదేశజులు అగ్నిపర్వతము లున్నవనిరి. అగ్ని వారికి వీరికి తుల్యమే. ముఖము పర్వతము తేడాగదా! వీరికన్న ఋషులు బలవంతులగుటచే దేవతలుండుట సత్యము. ఆయాలోకములనుండి భూలోకానికి వచ్చు సర్వజీవులు, ఖనిజాదులనున్న సర్వజీవులు సూర్యునుండి వచ్చుచున్నవి. మరల ఆతనిని జేరి ఆయాలోకములు పోవుచున్నవి. గాన దుష్టుల భూలోకానికి రాకుండాజేసి సన్మార్గుల వృద్ధిచేయుట మేలు. యిది సర్వదేశ గృహస్థుల చేతిలోనున్నది. అది విడచి పశ్చిమదేశజులు అసాధుసంతానముతోపాటు సాధుసంతానమును నిరోధము చేయుచున్నారు. అది అన్నిదేశములకు ప్రాకి చాలమంది అట్లు చేయుచున్నారు. పైగా ప్రాయశ్చిత్తములేని పాపమిడు గర్భపాతము చేయుచున్నారు. ధనవంతులు నలుగురు పిల్లలున్న ఆస్థి తరుగుననియు, దరిద్రులు పిల్లలున్నచో పోషింపలేమనియు గర్భమురాకుండా చేయించుకొనుచున్నారు. దీన సృష్టి మూలమునకే దెబ్బతినుచున్నది.

ధనవంతుడొకడు, దరిద్రుడొకడూ లేడు. అది తలిదండ్రులచేత ఎక్కువ శ్రద్ధతో చేయబడిన ధనవంతుడగును. హీనమైన హీనుడుగా పుట్టును. మరియు అన్నిలోకములకన్న యీ లోకము మానవుడు బ్రహ్మర్షి యగుటకు, దేవతగామారుటకు, సత్కార్మాచరణ చేయుటకు తగినది. యిది కార్మికలోకము. పైవి ఫలమనుభవింపదగిన లోకములు. దీనింబట్టి భారత దేశము కర్మభూమి అనిరి. ఇతర దేశములు భోగభూమి యని ఋషులు వ్రాసిరి.

పురుష సూక్తము:—'పద్భ్యాంభూమి, పద్భ్యాం శూద్రో అజాయత', భగవంతుని పాదములు భూమి. పాదము నుండి పుట్టినవారే శూద్రులు. అనగా భూలోకస్థులందరు పుట్టుకలో శూద్రులనియు, తరువాత సంస్కారములచే ద్విజు డగునని తెలియుచున్నది. సంఘములున్నగాని రాజ్యములు సాగవు. అదివరకున్న తలిదండ్రుల సంఘము పేరు శిశువునకు గల్గునని స్మృతికర్తలనిరి. శైశవావస్థ సర్వజంతువులకు శూద్రత్వ మనక తప్పదు.

అత్రి స్మృతి:—'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః' పుట్టుక తోనే బ్రాహ్మణశబ్దము గల్గును. ఇట్లన్నిజాతులకు గల్గును. సంస్కారముల ద్విజత్వము, విద్యచేవిప్రత్వము, బ్రహ్మవిద్యచే విప్రుడగును. అనగా కర్మములతో పేరులు మారుచుండును. పుట్టిన బ్రాహ్మణాది శిశువులకా సంస్కారాదులు లేనిచో మిగులునది శూద్రత్వమేకదా! దీనిని నామధారక బ్రాహ్మణ

క్షత్రియ వైశ్యత్వమందురు. యీ అత్రిస్మృతిలోనే ఎట్లున్నదో చూడుము.

శ్లో॥ దేవో మునిర్ద్విజో రాజా వైశ్య శ్శూద్రో నిషాదకః।
పశుర్మ్లేచ్ఛాపి ఛండాలో విప్రా దశవిధావిస్మృతాః॥

అని బ్రాహ్మణులలో పదివిధములు గలరని కలదు. యిట్లే క్షత్రియ వైశ్య శూద్రుల నిర్ణయించిరి.

పరాశర స్మృతి:—'అగ్నికార్యపరిభ్రష్టా సంధ్యోపాసనవర్జితాః వేదంచైవ నధీయానాః సర్వే తేవృషలాస్మృతాః' వర్ణాదులుగల్గ అగ్నికార్యము లేనివారు గాయత్ర్యాది పూజ లేనివారు వేదాధ్యయనములేనివారు శూద్రులు. 'తస్మాత్ వృషలభీతేన బ్రాహ్మణేన విశేషితః అధ్యేతవ్యోప్యేక దేశో యది సర్వం నశక్యతే॥' శూద్రత్వము గల్గునసే భయముతో బ్రాహ్మణుడు కొంత వేదము చదువునది. యీ బ్రాహ్మణ సంఘము ఎప్పుడుకావలెనన్న అప్పుడు వర్షము కురిపించువారు. నవగ్రహదోషాలు శాంతిజేయువారు. వీరు పూర్వకాలపు ఇంజనీరులు అనదగును. ప్రస్తుతపు ఇంజనీరులు కురిసిననీరు ఉపయోగించుచున్నారు. వీటింబట్టి యీసంఘమువారు ఇంకొక సంఘముగా మారినట్లు గలవు. ప్రస్తుత ప్రజారాజ్య సంఘాల వలెనే యున్నవి. కొంతకాలము కట్టుదిట్టముగా నడచినవి, యిప్పుడు నామమాత్రమైనవి. యీ సంఘములుగాని, కులములుగాని గృహాశ్రమమును విడువలేదు. గృహస్థ ధర్మములో బ్రహ్మర్షిత్వము సంపాదించువారు అధికులు. రెండవది మహర్షి

ఋషి రాజర్షిత్వములు. 3 వది ద్విజత్వము సంపాదించుటే కావలసినపని. అది లేనివారు శూద్రత్వమున అజ్ఞానమునొందెదరు. గాన ప్రతిమానవుడు యీ శూద్రత్వము బాసి సుజ్ఞాన మార్గమున బడునది. భూలోకము కార్మిక లోకము. అనగా సేవకావృత్తిలోకము. యిందు దేవునిసేవ దేవతాసేవ జననీ జనకసేవ గురుసేవ మొదలగు సేవలచే జీవించుట తల్లిదండ్రి గురుసేవలచే తానొకరికి తండ్రియగుట, గురువగుట గల్గుచున్నది. యిట్లే మానవుడు దేవునిసేవచే దేవునిగాను, దేవతాసేవచే దేవతగాను, యితరసేవలచే దానికి తగువిధముగాను, ఎడ్ల దున్నల ప్రేమించి సేవించువాడు వాటిశక్తిగలవాడగును. దేవుని సేవకులు తగుఫలముల ఆయాలోకాల అనుభవించి కొందరు బ్రహ్మర్షిత్వసిద్ధి గాంచవత్తురు. కొందరు భ్రష్టతచెందగలరు. అట్టి యోగ్యులీలోకమునకు వచ్చుటకు గృహస్థుడాధారముకదా! అట్టివారికి తలిదండ్రుల సహాయముగలదు. అవతారపురుషులుగా బ్రహ్మర్షులుగా సన్మార్గులుగాసృష్టించుశక్తి సద్గృహస్థునియందున్నదికదా! పరీక్షించినవారికి తెలియును. యితరులకేమియు గ్రాహ్యముకాదు. సృష్టిలో శ్రేష్టమానవుడు అవతారపురుషుడు-బ్రహ్మర్షి - హైన్యమానవజన్మము చండాలుడని నిర్ణయించిరి. వ్యాసస్మృతి: 'కుమారీసంభవత్వేక సగోత్రాయాం ద్వితీయకః బ్రాహ్మణ్యాం శూద్రజనితశ్చండాలస్త్రివిధాఃస్మృతః' తండ్రికూతురికి, అన్న చెల్లెలకు బ్రహ్మజ్ఞానస్త్రీని బలాత్కారముగా అజ్ఞానికి పుట్టువాడుచండాలుడని పేరిడిరి.

దే వీ భా గ వ త ము:—శాపచండాలుడు త్రిశంకుడు. వసిష్టుడు శపించిన వెంటనే

తే॥ గీ॥ పొసగ పల్కెడిమాటలు బూతులాయె

చండాల లక్షణములు బూతులుపల్కుట పెంకులు ధరించుట మొదలగునవి. పూర్వర్షులు సంతాన శ్రేష్ఠము మొదలు తుదివరకు పరీక్షించిరి.

గణేశగీత. చండాలోపిభజన్ భక్త్యా బ్రాహ్మణేభ్యోధికోమమ—

చండాలుడైనను భగవంతుడనగు నన్ను ప్రేమతో పూజించిన, పూజింపని బ్రాహ్మణునికన్న అధికుడే అనిగలదు. గాన భగవంతుని సేవచేత బ్రాహ్మణాది నాలుగుజాతులున్ను అనులోమ విలోమజాతులగు అన్ని తెరగుల మానవులు ఋషి, మహర్షి, బ్రహ్మర్షులుగా మారినట్లుగా గలదు. తమసంఘముల నుండి వేరుగా గృహస్థుడైగాని భార్యను పిల్లలపై విడిచిగాని, నైష్టికబ్రహ్మచారియైగాని ఒంటరిగానుండి దేవుని సేవించువారు రాజర్షి, ఋషి, మహర్షి బ్రహ్మర్షులగుదురు.

ఉదా:— మతంగమహర్షి, విశ్వామిత్రమహర్షి, వసిష్ఠ మహర్షి మొదలగువారు—

సంఘములు లేక కులములు:— కొంతకాలము నకు పాపభూయిష్టములగుటయు, కొంతకాలము పుణ్యభూయిష్టములగుట గలదు. పాపభూయిష్టకాలమునాడు వారిపాపము లంటి దేవార్చనతో ఆపాపములు బోవుటే గల్గును గాని సిద్ధి గల్గదు. అందుచే నానావిధకులస్థులు పూర్వము బాల్యమున

విద్యనేర్చుట ఆప్రకారము గృహస్థుడై ఆచరించుట తర్వాత అందు ప్రేమతో సంపాదించిన ధనాదులన్నిటిని పిల్లలకు వదలి యితరులకు దానముచేసి మునిపల్లెలుండుచోటికి తానొక్కడే గాని, భార్యతోగాని వెళ్ళి జీవితాంతమువరకు దేవుని పూజించి ఋషిత్వాదిసిద్ధి గాంచెడివారు. నేఁడును నట్లుచేసిన అట్లు పొందగలరు. భూలోకములో కొన్ని ప్రజారాజ్యముల ఎక్కువ ధనవంతులుండరాదు. కొన్నిచోట్ల ఎక్కువధనవంతు లుండవచ్చును. కొన్నిచోట్ల యింతభూమి ఇంత ధనమేయుండ దగునని నిర్ణయములున్నవిగాన అన్నవస్త్రాలు ఆరోగ్యము రాజ్య పాలకులు చేయుచున్నారు. దీనిపై ప్రతిగృహస్థుడు దేవార్చన చేయుటగల్గి సత్సంతానమును గన్నచో సర్వసుఖాస్పదమగును. భూలోక ప్రతి రాజ్యపాలకులు తమ రాజ్యమందుగల పాఠ శాలలో చదువదగిన శాస్త్రములతోపాటు భూలోకములో యితర గ్రంథముల లేని మార్గము అనగా బ్రహ్మర్షిగా మాన వుడు మారుమార్గము గీత ఉపనిషత్తులు వేదాంత దర్శనాది సద్గ్రంథముల గలదు గాన యీ పుస్తకముల భూలోక పాఠ శాల లన్నిట చదివించిన ధర్మార్థకామ మోక్షములపై పిల్ల లకు వారు చెప్పాటచే వారి తలిదండ్రులకు కోర్కెగల్గి ఆచరిం తురు. దాన ప్రతిరాజ్యప్రజలు సౌఖ్యము లందెదరు. ధర్మ మున సత్యముగలదు. అదిలేని అర్థకామ కైవల్యములు తత్ఫలమిడవు. మొదట కొంతలాభించినను తుదకు దుర్యోధ నునివలె నాశనమిడును. అర్థకామపరులు కలినెక్కుడగుదురు.

గాన ఇంటియందు తలిదండ్రులు పాఠశాలల గురువులు రాజ్యమున రాజు రాజసేవకులు ధర్మమహిమ బోధించుచున్న ప్రజలు ధర్మపరులై సుఖింతురు. సంయోగ యజ్ఞమున సాధుసంకల్ప దృష్టులచే యెల్లకాలము సాధుప్రజలును, దుష్టసంకల్పములచే చెడ్డమానవులు పుట్టుదురు. యీ పుట్టిన మానవులు - భారతము యక్షప్రశ్నలు.

కం॥ 'అతులతపోయుక్తి మహాత్వము వడయున్' ధృతిచే సహాయయుతుడగు అతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్'. మరియు,

చ. అధ్యయనంబున దేవ భావమున్।గను నవనీసుపర్వుడధిక
వ్రతశీలత సాధుభావమా।తనికి విశిష్టవృత్తి దిగదాప్తి
యసాధు వనంగనుండు శౌ।చనియతి లేక మృత్యుభయ
సంగతి నాతడు మానుషుండగున్.

ఇంద్రియ నిగ్రహము లేనివాడు మృత్యుభయముగల వాడును మనుష్యుడు అనబడును. పైవృత్తుల ఆ మనుష్యుడే తపస్సుచే మహిమ ధృతిచే సహాయము గలవాడు సజ్జనసేవచే బుద్ధిమంతుడు సద్గ్రంథ పారాయణమున దేవత్వము వ్రతముచే సాధువు దుష్టవృత్తిచే దుష్టుడు అగును. దేవాదులకు పితృ మాతృ భృత్యజనుల కేమియు నిడక తానే తినువాడు జీవన్మృతుడు, అనగా చచ్చినవానితో తుల్యుడు అని వైదిక వంశవారు చెప్పుదురు.

—: అసురీసంపదవారి వాదము :—

తలిదండ్రుల శుక్లశోణితములచేత సర్వజంతువులు పుట్టును. యీ జగమునకు ఆధారుడులేడు. యెండ వర్షము మొదలగునవి సహజము జరుగుచుండును. యేదో వృత్తిని ధర్మముగాని అధర్మముగాని తిండిలేనిచో మృత్యువు గల్గునని భయముచే ధనమెక్కుడు సంపాదించుట స్వర్గాదిలోకాలు లేవనుట దేవుడు లేడనుట సద్గ్రంథపఠనాల లాభములేదనుట ధనమునకై పరుల హత్యచేయుట దొంగతనము వ్యభిచారము దోషముకాదనుట వారి వాదమని గీత చెప్పుచున్నది. పై రెండుమార్గముల నేది మంచిదో తెలియుట కష్టముకాదు. శుక్రశోణితములగుటకు అన్నము ఆధారము. దానికి పంట, పంటకువర్షము, వర్షానికి సూర్యుడాధారము. అతనినుండి జీవులు నిష్కామముగా వచ్చుచున్నట్లు గన్పడుచుండగా శుక్ల శోణితములే ముఖ్యముగాదని తేలుచున్నది. ఆ సూర్యునికి బ్రహ్మమాధారమని గలదు. భూలోకములో యీ మార్గస్థు లెంతకాలమో యుండరని తెలిసియు స్థిరముగానుండువారివలె బ్రతికిన కొలదికాలములో అనేకవిధముల వాదింతురు. జీవులు యోగవాహులు గాన సూర్యునిజేరి వానివలె ప్రకాశింతురు. దుష్టులజేరిన దుష్టులగుదురు.

దైవీసంపదవారు:—తాము కొలదికాలమే యీ లోకాననుందుమని తలంచి నిష్కామ సకామ మార్గముల నొకటిగాని సన్మార్గమున నడచుచు సన్మార్గమునుబోధింతురు.

వి వా హ ము:—'విశేషేణవహనం వివాహం' ఎక్కువ భారము మోయునది వివాహము. యితరదేశ వివాహములకన్న భారతదేశ వివాహమున భార్యాభర్తలు స్నేహముగా నుండుట కెట్టి మార్గములు ఋషులు చూపిరో విమర్శించిన తెలియును. వారి అభిప్రాయములు చదివి భూలోకగృహస్థులందరు నడచి స్నేహమున మెలంగుదురని నా యూహ.

—: భారతము – యక్ష ప్రశ్న :—

'భార్యాదైవకృతస్సఖా' గత జన్మపుణ్యావశమున పురుషునికి గల్గిన స్నేహితురాలు. స్నేహభావము లేనిచో విరోధినియై భర్తను సాధింపవచ్చిన పగతురాలు. యిది గత దుష్టవిధి ఫలము.

శ్రు తి:— 'సఖా స ప్త పదాభవ' యేడడుగులు నడచుటవల్లలేక యేడుమాటలు పల్కుటచే నాకు నీవు స్నేహితుడవగుము అని భార్యవాక్యము. స్నేహితుడపకారము చేయడని గ్రంధములుచెప్పును. మిత్రద్రోహి నానాకష్టముల పాలగును. సాధారణముగా బలహీనుడు యుద్ధాదులందు జయము పొందలేడు. యెక్కువధర్మములు తెలియలేడు. ఆరీతిగా తనకన్న బలవంతునిజేరి పరుల యుద్ధాదులనుండి రక్షణపొందుటకు భర్త దేవుడగుటకు తాను పరమేశ్వరియగుటకు పత్నీమార్గమున నడచుటకు తగుధర్మములు భర్తవల్ల నేర్చి ఆచరించుటకు (భర్తకు తెలియకున్న గొప్పపండితుల నుండి తెలిసికొని భార్యకు చెప్పనగునుగాని భార్యను పండితుని

వద్దకుపంపరాదు.) వివాహము నిర్ణయింపబడినది. గాని వేళా కోళముకు ఎప్పుడు కోపమువచ్చిన అప్పుడు విడాకులిచ్చుటకు గాదు. యీ లోకాన ఆ వివాహబంధము జీవితాంతమువరకు చచ్చినతర్వాత స్వర్గాదిలోకములసుఖము నిద్దరు అనుభవించు టకు నిర్ణయముచేసిరి. గురువులకు తగినధనమిచ్చి తలి దండ్రుల సేవసేయుచు భార్యతో సఖ్యముగానుండి తాను చదివిన సత్యధర్మమార్గాలఫలము గన్పడువరకు నడచుచు సత్పుత్రులగాంచుచు, దేవ, ముని, సాధు, మొదలగు మంచి వారిని పూజించుచు మోక్షమునో స్వర్గమునో పొందుటకు చిన్నరాజు గృహస్థుడు గాన భార్యసహాయము నందినాడు. గాన పై రీతి భార్య 'సఖాసప్త పదాభవ' అని పల్కినది.

భాగవతము:—7వ స్కంధము. స్త్రీలకు సత్యము, ధర్మముగలిగి దివ్యదృష్టి అనగా భర్తను దేవునిగా జూచుట సత్సంతానము వృద్ధిచేయుటకు, భర్త పరస్త్రీగమనము చేయ కుండుటకునై శృంగారించుకొనుట,మధురవాక్కులతో శృంగార రసమువృద్ధిజేసి భర్తకు సంతోషము గల్గించుట. రెండవవారు వుండినచో విషాదులు తనకు భర్తకు పెట్టుదురని భయముచే తానే స్నానపాన భోజనశయనములుసల్పుట, తమ వార్ధక్య కాలము చచ్చినతర్వాత కాలము, సౌఖ్యముగా నడచుటకు సహాయము తమకన్న బలవంతులగు సత్పుత్రి పుత్రికలెట్లు పుట్టుదురాయని యిద్దరాలోచించి ఆ ప్రకారముగనుట చెప్ప బడినది. దాన వీరున్నంతకాలము సౌఖ్యముగానడపి తలి

దండ్రులుసేయు జపతపోవ్రతములకు సాయముజేసి వారి అనంతరము చేయుదగిన దానాలుచేసి గంగలో యెముకలు గయలో పిండము పుత్రులువేయుదురు. లేక తలిదండ్రులపేర చాలాకాలముండు విద్యాశాలలు దేవాలయాదులు గట్టుదురు. ఎవరినామము ఎంతకాలము మంచిదిగా భూలోకాన ఉండునో అంతకాలము స్వర్గమున ఉండుటగల్గును. అట్లపకీర్తి గలిగిన నరకముగల్గును. రజస్వలఅయిన 16 రాత్రులలో 5—9—15 రాత్రులలో పతివ్రతలైన సుకన్యలు పుట్టుదురు. 7 వ నాడు వంధ్యాస్త్రీ మంచిదేయగును. ఔషధాలచే వంధ్యత్వముబాపిన సంతతిగల్గును. యిట్టి సుకన్యల సాధుపురుషునికి దానమిడిన వారిసంతతి వృద్ధియై బలహీనులు కొడుకులైనను, లేకున్నను మనుమలనుండిగాని కూతులనుండిగాని గంగాస్థులు గయా పిండము జరుపగలరు. అని ఊహించి, 'రతిపుత్రఫలా దారా,' సంయోగయజ్ఞముచేయుట సత్పుత్రుల గనుటకై యున్నది. తలిదండ్రులు తమవద్దనున్న కాలములో సత్యాధర్మాహింసాది సద్గుణ ఫలవివరము:- సత్సంతానాభివృద్ధి చేయు మార్గములు. వివిధములగు వంటలు వండుటగల విద్యలను, బ్రహ్మవిద్యను నేర్చియున్నకన్యను భార్యగా పొందవలయును. అందుచే స్వసంఘములో తన సమగుణకర్మనురాగములుగల సాధుకన్యను వివాహమాడునది. యితరసంఘస్త్రీలకు తన గుణకర్మములు తెలియక కొన్నిచిక్కులు గల్గగలవు. దానిచే కలహములు విడాకులువరకుపోవును. అట్లు విడిచినవానికి పైపనులవల్ల లాభము లేదుకదా !

—: వివాహసాక్ష్యములు :—

భార్యాభర్తలు సఖ్యముకుదురుటకు చేయుమార్గములు:- యీ భార్యాభర్త అంగీకరించి వివాహమాడినట్లు వారి సంఘ పెద్దలు, వాద్యగాండ్రుకలరు. వివాహమున ఒక క్షత్రియుడు, ఒక బ్రాహ్మణుడు ఉండదగునని గృహ్యాసూత్రమునగలదు. ఆంధ్రదేశమున పండితుడును క్షత్రియులమను కులస్థులలో నొకడగు భట్టురాజు, బ్రాహ్మణులమనువారిలో వైదిక శాస్త్రజ్ఞుడు ఉండి గౌరవముపొంది వారిద్దరి వివాహమైనతర్వాత ఆశీర్వాదములుచేసిరి. నేడది పూర్వగౌరవములేక తగ్గినది. యీ సాక్ష్యములచే ఆ కన్యను రెండవవారు వివాహమాడ మానుట జరుగుచున్నది. ఆకాలమున యిద్దరి మనస్సులు మాధుర్యరసముచే ఏకమగుటకు సంగీతము పాడించుటగలదు. పూర్వసంగీతమున యిట్టిమహిమ లెన్నియోకలవు. ఆకాలమున గంగోదకమునగాని సూర్యుడు ఎండకాయుచుండ కురియు వర్షోదకము, దివ్యగంగ. దానిచేగాని పాతాళగంగచేగాని బట్టీపట్టిన నీటగాని (డిస్టిలువాటరు) స్నానముచేయించువారు. దాన యథార్థముగా వారియందుగల విషదోషములు క్రూర భావదోషములు నశించునని భావము.

—: ఆకాశగంగమహిమ :—

భారతము, స్వర్గారోహణపర్వము:— స్వర్గమున ధర్మరాజుకి తమ్ములు నరకముననున్నట్లు, దుర్యోధనాదులు స్వర్గముననున్నట్లు కన్పడినది. దానికతడు కోపిం

పగా యిది స్వర్గలోకము. యీలోకధర్మముగా నడువుము.
యింద్రుడు.

క. నీవీ యాకాశనదీ
పావన సలిలముల మునుగు భవ్యాత్మ భవ
ద్భావంబు విడుచి మానుష
భావ వికారముల శోకబంధములుడుగున్.

అనిచెప్ప అట్లుచేయ మానుషతనువుబాసి దేవత్వ దేహముగల్గెను. భూలోకములో శరీరములుండగానే నిష్కామ కర్మమున దేవుడుగా సకామకర్మమున దేవతగా మారుట గలదు. దీనినే ద్విజత్వమందురు. యీఫలమిచ్చునది ఆకాశ గంగాస్నానము. యీ వర్షము ఆశ్వయుజ కార్తీకములలో కురియును. దీనిని పురోహితులు దాచియుంచి వివాహమున స్నానము చేయించువారు. దాన నిద్దరు దేవత్వము అన ద్విజ త్వముజెంది సన్మార్గులై సఖ్యతతో వర్తింతురనదగును. యీ నీరు దొరకనిచో గంగానీరములు లేక పాతాళగంగ బట్టిపట్టిన నీట స్నానమాడించిన మంచిఫల మిడగలదు. యిది విడచి మురుగునీరుస్నానమాడింతురు. దానఫలములేదు. మొత్తమున వివాహస్నానము భార్యాభర్తలకు స్నేహముగల్గించును. యిట్టి స్నానము ప్రతినింటను స్త్రీ పురుషులాడిన సర్వసద్గుణసంపద వృద్ధియగును. గాని తక్కిన నీళ్ళ స్వల్ప శక్తి మాత్రముగల్గును.

—: ఆభరణములు :—

రత్నాలు మేలిమి బంగారము: ధారణ శుభ ప్రదమైనది. బ్రాహ్మణుడు. వేదోక్త కర్మములచే భార్యా

భర్తలకు సఖ్యముగల్గించుట కొన్నిసంఘములవారికే చేయగల్గును. విశ్వబ్రాహ్మణుడు మేలిమిబంగారముతో చేయబడు మంగళసూత్రాది ఆభరణములచే నానాజాతి భార్యాభర్తలకు స్నేహము చేయువాడైయున్నాడు. గాన విశ్వబ్రాహ్మణుడనుటకు సరిపోయినది. బంగారము రత్నములయందు దేవతలుందురని శాస్త్రము. యీ యిద్దరివల్లగల్గు మహోపకారము చెప్పనలవిగాదు. యీ మేలిమిబంగారము పశ్చిమదేశాల గానరాదు. అణువైనను ఇతరలోహములు కలియని బంగారమూ దేశములలోలేదు. అది విశ్వబ్రాహ్మణులచేతిలో గలదన చెడుబంగారమును పుటములుబెట్టి అణువైనను యితరలోహములు కలియని బంగారము చేయుదురు. గాన వారిద్దరిని పూజించి తగుగౌరవము వధూవరుల తలిదండ్రులు చూపిన శ్రద్ధతో చేయుదురు. గాని వారిని చాలాహైన్యముగా చూచుటచే వారు మంచినిచేయుటమానిరి. ధనికులు యీ బంగారముచే మంగళసూత్రము శిరస్సుమొదలు పాదాలవరకు గల వస్తువులు చేయించువారు. మధ్యములు మధ్యమముగా, అధములు అధమముగా, లేనివారు మంగసూత్రముతైనా చేయించువారు. దర్భలు ధరించిన పాపహారమని ఋష్యాది గృహస్థులు వాటిని ధారణచేసిరి.

అథర్వ వేదము:— బంగారమహిమ: దీని ధారణచే 'అసాధ్వీ సుసాధ్వీ భవతి',ఎంతదుష్టస్త్రీ అయినను సాధ్వి యగును. యెంత పేదలకైనా బంగారుధారణచే అన్నవస్త్రము

లకు లోటుండదనిగలదు. ఆయుర్వృద్ధియగుననికలదు. దీనిని శుభమంత్రములచే మంత్రించి దేవతాస్థాపనచేసిన మరింత శక్తిగల్గునని మంత్రశాస్త్రాభిప్రాయము. అందుచే వివాహ కాలమున మంత్రాలుచదువుచు స్త్రీలకు మంగళసూత్రములు కట్టుదురు. అన్నిలోహములు నశించునుగాని బంగారము మాత్రము దేనితోనూ నశింపదు. గాని యిట్టిది శరీరమున ధరించినచో అరగి శరీరమున కలియును. దాన విషహారము రోగహారమై ఆయుర్వృద్ధిగల్గును. మానవశరీర మెంతగొప్పదో ఊహింపుడు.

చరకసంహిత:— (చరకుడు పూర్వపు భారత దేశమున గొప్ప డాక్టరు) 'హేమం సర్వవిషాణ్యాశు, గరాంశ్చ వినియచ్ఛతి.' బంగారము సర్వ విషముల గరముల హరించును. శరీరాగ్నిచే మెల్లమెల్లగా పరాగమై శరీరమున రొక్కును. దాన విషాదిహారమై సౌభాగ్యస్త్రీలగుదురు. ఇది విడచి రాగికలిసిన బంగారము అనగా కాసులు ధరించుచున్నారు. దాన దుష్కామము, గర్వాది దుర్గుణములు వృద్ధియగును. రత్నాలు బంగారు చేర్చి ధారణ శుభప్రద మైనది. అనగా దేవతలు శివ, విష్ణువులు యీ రత్నాలను బంగారున నిల్చియుందురని శాస్త్రము. రాక్షస పిశాచములు చేరవని భావము. రత్న బంగారముల సహవాసమున వాటి యందు దేవతలు శివ, విష్ణువుల పూజింప సద్గుణవృద్ధియై దేవతగా గాని, బ్రాహ్మణిగాగాని స్త్రీ మారునని భావము.

ముక్కున అడ్డబాసలో రత్నాల బంగారు ఫలము. ముక్కు-సోహమని అజపగాయత్రిజపము చేయుచుండును. ఇదియెరిగి మనసుచే ముక్కున రత్నముల బంగారులున్న దేవతలగాని శివ విష్ణువులగాని జూచుచు సోహం జపముచేసి వారివంటి శక్తిగలవారుగా తొందరలో స్త్రీలగుదురని భావము.

రామాయణము:— రాముని ఉంగరము, సీత శిరోరత్నము రెండును రత్నములు బంగారముగలవి. ఇవి గల్గియున్న రాక్షసభయముండదు. రాముడు ఈఉంగరమునిచ్చి శిరోరత్నము తెప్పించినాడు. అనగా యీ రెంటియందు ఈ మహిమ గలదనిభావము. మరియును వారిద్దరును జీవించియున్నారనుటకు గుర్తైయున్నది. రాక్షసస్త్రీ పురుషమధ్యస్థ్థైనను సీత వారివల్ల నెట్టియాపదలు పొందలేదు. వధూవరులు వివాహమున చేయిచేయి పట్టుకొనుట స్నేహభావము వెల్లడించును. రాముడు, సుగ్రీవుడు ఒకరిచేయి ఒకరు పట్టుకొని అగ్నిసాక్షిగా ప్రతిజ్ఞచేసి ఆప్రకారము నడచినారు. ఆ భావమే భార్యాభర్తల పాణిగ్రహణమున అగ్నిసాక్షిగా వివాహము చేయుదురు. గాన కౌగలించుట పూర్ణస్నేహము. నీవే నేను, నేనే నీవు అను ఎక్కువప్రేమనుజూపు చేష్ట కౌగిలి భార్యాభర్తల గర్భాదానమున గల్గును. అరుంధతీ వసిష్టుల దర్శనము చేయించెదరు. దాన వారివలె నిత్యగృహస్థులై సఖ్యముగా నుండుడని భావము. అగోచరులై హేమాదుల యందు దేవాదులును ప్రత్యక్షముగా అనేక సంఘములు జనుల

మధ్య సాక్షులుగా జరుపబడుటచే మరియొకడామెను వివాహము చేసుకొనరాదని తెలియుటకే అయియున్నది.

—: జ్యోతిషము; ముహూర్తము :—

గతజన్మదోషమున విరోధముగానున్నను ఆదోషము హరించుటకు పురుషప్రియత్నమగు బలమైన శుభముహూర్తమున వివాహముచేసిన యిద్దరికి సౌఖ్యము గల్గునని భావము. అనగా జాతకదోషముల హరించు బలమగు ముహూర్తమైన శుభఫలమిడగలదు. లేనిచో రెండునుగలసి నాశనమతితొందరలో నిడును. కొందరు ముహూర్తముల లాభము లేదని, తమ యిష్టమువచ్చినకాలముల పెండ్లాడుచున్నారు. ఆముహూర్తము మంచిదైన మంచిఫలము చెడుగైన చెడుఫలమిచ్చును. ఇట్టిమూఢులు వృద్ధిపొందిననాడు శాస్త్రముల త్రోసివేయుదురు. దాన వారే తగుఫలము ముందు బొందగలరు.

మార్కండేయ పురాణము 5వ అధ్యాయము. 194 పద్యం–ఉత్తమమనువు బ్రాహ్మణుఁడు. భూలోకమునంతయు మనువేలువాడు. వానికి వాని భార్యకు సఖ్యతగల్గలేదు. అది వివాహదోషమని బ్రాహ్మణుడు మిత్రకామేష్టి యజ్ఞము చేయించి వారిద్దరిస్నేహము కుదిరింపగల్గెను.

చం. పరిణయవేళనిన్ను రవిభౌమశనైశ్చరులున్ భవత్సంతతిన్
మరగురుదైత్యమంత్రులునుజూచుటజేసి నరేంద్రనీకు న
త్తరుణిమనోహరాకృతిముదంబొనరించుచునుండెజూడ్కిక
త్తరుణికినీదుమూర్తి ప్రముదంబొనరింపమినట్టిదయ్యెడున్.

లగ్నము భర్త, 7వ స్థానము భార్య. యీ రెండుస్థానపతులను యోగమిచ్చు శుభులు చూచుట, కలియుట కల్గిన ఇద్దరికి సౌఖ్యముగల్గును అట్లుగాక మనువు పెండ్లిలో లగ్నపతిని పాపులును, 7వ పతిని శుభులు జూచుటచే స్త్రీకి భూలోకమంతయు నేలెడివాడైనను యిష్టుడుకాకుండె. భార్యాస్థానపతి గ్రహమును శుభులు చూచుటచే ఆమెయందు భర్తకు ప్రీతి గల్గెను. మిత్రికామైత్రిచే ఆదోషముపోయి సుఖించిరి. వివాహలగ్నమున యేడవస్థానమున యేగ్రహముండరాదు. ఉన్నచో ఆ వివాహనక్షత్రమునకు దశకట్టి 7వ స్థానమున నున్న గ్రహదశ వచ్చినచో భార్యాభర్తలు మృత్యువొందుటగాని విడిపోవుటగాని తప్పక జరుగుచున్నది. యిట్టి గొప్పముహూర్తములుంచుట గొప్పపండితులకేగాని సామాన్యులకు చేతకాదు.

—: స్త్రీ పునర్వివాహము :—

బ్రహ్మోత్తర ఖండము :— మొదటి వివాహమున గల్గిన దోషముచే భార్యాభర్తలు చాలకాలము యెడబాయుట గల్గిన మరల ఆభర్త చేరినపుడు శ్రోత్తముహూర్తముంచి వివాహము చేసినారు.

ఉదాహరణ:—నలుని మనుమడు. స్త్రీకి పునర్వివాహము చేయవలసివచ్చిన మొదటిభర్తకే చేయునది. రెండవవానికి చేయరాదు. రెండవసారి శుభముహూర్తముంచి వివాహము చేసిన సఖ్యత వృద్ధియై సంపదగల్గినట్లు అనుభవముగా

వ్యాసుడు వ్రాసినాడు. మొత్తమున స్త్రీకి యెన్నిసార్లైనా ఆభర్తకే వివాహము శుభముజెందచేయసగునని తెలియుచున్నది. యింతమాత్రమున లాభముండదు. ధర్మమార్గమున నడచునది. భర్తయందు ప్రేమగల్గి వ్యభిచారిణికాకున్నది అగు భార్యకే యీవివాహము సిరిసంపద వృద్ధిచేయునని పైకథ చదివిన తెలియును. మరియు—

ప రా శ ర హో ర:—'గ్రహరూపీ జనార్దనః' విష్ణువు గ్రహరూపియై యున్నాడు. ఆగ్రహములకు తగిన రాజయోగమున ముహూర్తముంచిన వివాహమున పూర్ణ ఫలమిడును గాన లేనిచో స్వల్ప ఫలమిడును. యిట్టి ముహూర్తములుంచువారు వాటి ఫలములు చూపించువారు నేటి భారతదేశమున చాల అరుదుగానున్నారు. తప్పుడుముహూర్తములుంచు మానవరాక్షసులు తమకు ముహూర్తము తెలియదనక యేదో ముహూర్తము భూలోకమేలు పైమనువులకే ఉంచిన వారు నేడుమాత్ర ముంచకమానుదురా! మంచిఫలమిడు ముహూర్తముంచువారు యేకాలమున తక్కువగా నుందురు. ఒకవేళ ముహూర్తముంచినను ఆకాలమునకు సరిగా వివాహాదులు జరుగవు. దాన ఫలముగల్గక జ్యోతిషము హాస్యమునకు నిలయమైనది. యీ మానవరూపులగు రాక్షసు లేనాడు ఫలితమిడు శాస్త్రములు చదువుదురో (అనగా నాటి అర్థము తెలియక అనుభవములేక చదువుదురని భావము) ఆనాటి నుండియే ఆ శాస్త్రమర్యాదలు తప్పుట కారంభించును. దాన

జ్యోతిషము జరుగకుండుటకు పార్వతీశాపమున్నదని చెప్పు దురు. గాని తమరుంచిన ముహూర్తము సరియైనది కాదనరు. ప్రశ్న భాగమునకే పార్వతీశాపమని గ్రహింపదగును. పార్వతీ శాపమెందుకన బృహస్పతి ప్రశ్నజెప్ప శివుడు పరీక్షింప స్నానమాడుచుండెను. భర్త చూడరాదు, చూచినాడనిన ఇట్లందరుజేసి మహాదోషము జెందుదురనియు శుభములిడు అనేక రహస్యకర్మములు బయటపడుననియు ఆమె శపించినది. ప్రశ్నభాగమన కేరళము ప్రశ్నభాగములకు అర్థము. జ్యోతి షములో ఒకభాగముగా దీనికి సంబంధము కలదు. దీనికే శాపమని అర్థముచేసిన సరిపోవును. జ్యోతిషమున సిద్ధాంతము, జాతకముహూర్త భాగాలుగా ఋషులు నిర్ణయించిరి. కేరళ మందు కలపలేదు. జాతకమున ప్రారబ్ధకర్మము చెప్పునది. లగ్నముసరియైన గ్రహములుసరియైన ఫలము తెలియ వచ్చును. లేనిచో లాభముండదు. జాతకమున్న దుష్టఫల కాలమున శాంతిచే దోషవిముక్తుడగుటకుతగును. లేనిచో నానావస్థలపాలగుదురు. ముహూర్తభాగము జాతకదోషముల బాపి ఫలమిచ్చునది. లేక జాతక శుభఫలముల వృద్ధిచేయు నది అయియున్నది. తెలియనిచో చెడుఫలములనే యిచ్చును. సిద్ధాంతభాగము గ్రహములచారము తెలియబడును. పంచాం గము తప్పు మంచిదా అని తెలియుటకు జాతకముహూర్త భాగములై యున్నవి. ఒక పంచాంగములో మిథునలగ్నమున శని మకరమునమండెను. యింకొక పంచాంగములో కుంభ

మందున్నాడని వ్రాసిరి. అప్పుడు పుట్టినవానికి మకరమైన నాశనఫలమును, కుంభమైన శుభఫలమిడును. యిట్లు ఫలముల బట్టి దుష్టపంచాంగము మంచిపంచాంగము నిర్ణయింపదగును. ఆ స్థానఫలమిడనిచో పంచాంగ గ్రహములు తప్పినవని గ్రహించునది. యిందుకు ఋషిగ్రంథములగు పరాశరహోర, జైమిని, వసిష్ఠ, నారద, గౌతమ మొదలగు సంహితల యోగాలు జరుగకున్నచో పంచాంగము తప్పనియే నిర్ణయింపవచ్చును. జ్యోతిష శాస్త్రము చాలా గొప్పది. మేధావులు చదువదగినది. మానవరాక్షసులు చదువదగినదికాదు. చదివిననాడు దాని గౌరవమే పోవును. ముహూర్త గ్రంథాలలో వసిష్ఠ, నారద, గౌతమ సంహితలు మొదలగు ఋషిగ్రంథములు నేడును పరీక్షించిన ఫలమిడును. ఫలమిడు అర్థజ్ఞుడే ముహూర్తముంచిన ఫలముగల్గును. యీగ్రంథములు ఫలితములిడు అర్థము తెలిసినవానియొద్ద నేర్చినచో వానికన్న లోకోపకారి యొకడుండడు. విష్ణుదయ ముహూర్తములచే మానవులకు కల్గించువాడట్టి ముహూర్తజ్ఞుడు ప్రేమయున్నను ముహూర్తము తెలియనివాడు యెట్టి శుభమార్గముల చూపింపలేడు.

వసిష్ఠ సంహిత:— చాలా గొప్ప గ్రంథము. అందుగలట్లు ముహూర్తముంచిన ఫలములిచ్చు మార్గము గలది. 'తస్మాత్ వివాహే యాత్రాయా మాధానే జాతకోపివా గ్రహయోగాత్ఫలం వాచ్యం । శేషమన్యద్ధి నిష్ఫలం॥' వివాహ, యాత్రా, గర్భాదానముల జన్మకాలమున గ్రహ

యోగములుబట్టి ఫలము జరుగుననియు యితరమార్గము ఫల మిడదనియు గలదు. యిట్లు ముహూర్తముంచలేక, తిథివార నక్షత్రములు, తారాచంద్రులు, పంచకరహితము కుదిరిన యీముహూర్తము మంచిదని వాదింతురు. వారికి తెలియ కున్నను వారుంచిన ముహూర్తములో యోగగ్రహములుండి ఫలించినను ముహూర్తబలమందురు. లేకున్న లాభములేదు కదా! తెలిసినచో ప్రతిముహూర్తమున లాభము పొంద వచ్చునని తెలియుచున్నది. జాతకమునకన్న బలమగు ముహూర్తమున్నగాని ఫలితము గానరాదు. దానినెరింగి ముహూర్తముంచునది.

—: స్త్రీని యిద్దరు పెండ్లాడుట అధర్మము :—

రా మా య ణ ము:— సీతకు వివాహము కాకున్న పుడు అనేక రాజులు ఆమెకై జనకునిపై బడి యుద్ధములకు వచ్చువారు. రామునికి సీతనిచ్చి వివాహము చేసినతర్వాత ఒకరాజును మరల రాలేదు. దీనింబట్టి ఒకస్త్రీకి అందరిలో వివాహమైన మరల రెండవపురుషునితో వివాహముచేయుట కూడదు. శూర్పణఖకు మొదటివివాహమైనది. భర్తచచ్చెను. ఆమె విధవయైనను మరల వివాహమాడలేదు. ఒకసారి వివాహమైనదానిని రెండవసారి వివాహము చేసుకొనరాదు. అట్టి విధవస్త్రీని ఉంచుకొని భోగించనురాదు. దాన భార్యకు నాశము గల్గునంద్రు. విరాధుడు రామలక్ష్మణ సీతల జూచి ఒక స్త్రీకి ఇద్దరుభర్తలు లేరే? ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ

ఉన్నారని ఆక్షేపించెను. దీనినిబట్టి రాక్షసజాతిలోకూడా విధవావివాహములు లేవు. కర్ణుడు ద్రౌపదినిజూచి భార్యకు దైవహితుండైన భర్త యొకండె, దీని కనేకభర్తలున్నారని ఆక్షేపించెను. దీన అధికదుష్టమార్గస్థులలోను భార్యకు భర్త ఒక్కడే అని తెలియుచున్నది.

యజుర్వేదము:—ఒక రాటికి రెండు త్రాళ్ళుండ వచ్చు. ఒక త్రాటికి రెండురాళ్లుండరాదు. అట్లే ఒక స్త్రీకి ఒకడే భర్తగాని యిద్దరు భర్తలులేరు. అనగా యేకారణ మునసైనా సంతానార్థియై భార్యాజ్ఞతో పురుషుడు రెండవ స్త్రీని వివాహమాడదగునని మనువు చెప్పెను. భార్యాజ్ఞ లేనిచో రెండవవివాహము పురుషుడు చేసుకొనరాదు. భర్త తెలివితక్కువచేగాని, అధర్ముడైగాని, జీవించియున్నపుడు గాని, చచ్చేటపుడుగాని భార్యకు రెండవవివాహము చేసుకొన ఆజ్ఞయిడరాదు. నాల్గుజాతుల పురుషులును ఆజ్ఞయిడగూడదని శ్రుతిస్మృతిపురాణేతిహాసాలు చెప్పుచున్నవి. అట్లు పూర్వము నుండి నేటివరకు యేరాజ్యమున జరిగినట్లు గానరాదు.

ఉదాహరణ:—నలుడు-దమయంతి. రెండవపురుషుని వివాహమాడుట కూడదనియు ఎట్లు జరుగునో చూచుటకే వెళ్ళెను. అందేరాజులు లేకుండుట జూచెను. ఆమెవచ్చి నిన్నే రెండవసారి స్వయంవరమున పొందనిశ్చయించితినన నాయాదేవత ఆమె పతివ్రత యనిచెప్ప నలుడంగీకరించె.

భారతము:— యేకచక్రపురమున బ్రాహ్మణుని

భార్య, పురుషునకు ఇద్దరుభార్య లుండవచ్చునుగాని స్త్రీకి యిద్దరుభర్త లుండరాదని పై వేదధర్మముకు సరిపుచ్చెను.

పురాణములు:— స్త్రీలకు రెండవసారి పరపురుషునికి వివాహమైన ట్లే కథలు గానరావు.

బృహత్పరాశరస్మృతి:— 'జీవన్ వాపి మృతో వాపి పతిరేవస్త్రియః ప్రభుః॥' భర్త జీవించియున్నను చచ్చినను స్త్రీల కతడే భర్త.

పరాశరస్మృతి:—

శ్లో. నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ।
పంచాస్వాపత్సు నారీణాం।పతి రన్యోవిధీయతే॥

వివాహ నిర్ణయముచేసి వివాహమయ్యేలోగా ఆనిర్ణయభర్త నష్టుడైన, చచ్చిన, సన్యసించిన, నపుంసకుడైన జాతిభ్రష్టుడైన యీ అయిదింటిలో నొక ఆపదపొందిన స్త్రీకి తండ్రి యింకొకభర్తను చేయవచ్చును. దాన కన్యాదాన ఫలము పోదని నిర్ణయము. భారతములో ఒకనికి కన్యనిచ్చెదనని వాగ్దానమైన తరువాత రెండవవానికి వివాహముచేసిన దోషమని కలదు. గాని పై ఆపదలలో చేసిన దోషము రాదని స్మృతి చెప్పుచున్నది.

శ్లో. మృతే భర్తరియా నారీ బ్రహ్మచర్య వ్రతేస్థితా।
సామృతాలభతే స్వర్గం యథాతే బ్రహ్మచారిణః॥

భర్త చచ్చిన బ్రహ్మచారిణియై రెండవ భర్తనుకోరని స్త్రీ స్వర్గము చెందునన వివాహమాడినచో యిహసుఖమెంత

గల్గిన నంతయేగాని పరసుఖములేదని తేలినది. ఒకవేళ ఇహసుఖములేనిచో చెప్పునదేమీ లేదు. యిది పురాతన మార్గము. నవీనమార్గమది కాదన్న భార్యాభర్త ధర్మము లెప్పుడు ఒకేవిధి ధర్మముగలవి లేనిచో విడాకులగును. యిట్లు శ్రుతి స్మృతి పురాణేతిహాసములు విధవా వివాహము నిషేధించినవి. యింటనుండి వ్యభిచారముచేసి గర్భపాతములు చేయు విధవాస్త్రీలకు వివాహము చేయుట మంచిది కాదా యన్న, ఆసురీసంపద స్త్రీలలోను అతి దుష్టులై గర్భపాత మొనరించు దుష్ట విధవలకే యీ విధవా వివాహ నిర్ణయముచేసినను లాభమెంత యుండును. దైవీసంపదవారు కొంద రిది ధర్మము కాబోలునని వివాహమాడిన యిహసుఖ మిత్తురుగాని ఆసురీసంపద స్త్రీలు వివాహమాడినను ఆడకున్నను కష్టములనే కల్గింతురు. పూర్వము విధవలందరికి పృథుచక్రవర్తి తండ్రి వైన్యుడు వివాహ నిర్ణయము ప్రప్రథమమునచేసియున్నాడు. గర్భపాతమున ఆస్త్రీయే ఆపాపము యెక్కువగాపొందినను పురుషుడు కొంత పాపము పొందకమానడు. గాన రాజు శాస్త్ర విరుద్ధముగా స్త్రీకి రెండవ వివాహముసేయ అంగీకరించుట అధర్మమైనది. దాని పాపము అతనిని తుదను బాధించినది. కొడుకు పాపమునుండి అతడు విడువడినాడు. భారతదేశములో ఎవరెంత ప్రచారముచేసినను చాలమంది విధవలు పరపురుషుని వివాహ మాడుటలేదు. ధర్మాధర్మములు తెలియక అది తప్పు లేదనేవాదము, చేయువారనేకులుండుటచే కొంద

రది అధర్మముగాదని వివాహమాడువారు గలరు- ముందును కల్గగలరు.

మనుస్మృతి:— విధవాస్త్రీ తన భర్తను దేవునిగా పూజించుచు నిష్కామముగా భగవంతు నర్చించుట, తండ్రి వల్లనో అన్నవల్లనో నేర్చి సాత్వికభోజనము సేయుచు భగవతిగామారుట సిద్ధిబొందుటుత్తమమార్గము. అట్లు నడుచుటుత్తమము. భారతదేశాన గృహస్థ ధర్మము స్థిరమునకే భార్యాభర్తలిద్దరు మితౄతగా చిరకాలముండుటకే ఋషులెన్నియో సుకర్మములు చేయించిరి. యిద్దరు మనుష్యులు చాలా కాలము స్నేహముగా నుండుటలేదు. వివాహ మట్టిదికాదు. జీవితాంతమువరకును చచ్చిన తర్వాతను యితరలోకాల భార్యాభర్తలు కలిసియున్నట్లు భారతము స్వర్గారోహణపర్వమున బ్రహ్మోత్తర ఖండాది గ్రంథముల స్వర్గకైలాసాది లోకములలో భూలోక భార్యాభర్తలుచేరి సుఖమున నున్నట్లుగలదు. వివాహము సాక్షుల యెదుట అగ్నిదరిని సత్యముతోగూడిన ప్రతిజ్ఞచేసి అనగా నేను నీకు స్నేహితుడను నేను నీకు స్నేహితురాలను (అనగా ఆపదలయందు యితరకాలముల సుఖము చేయువాడు స్నేహితుడు) మనమిద్దరము ఒకటే అని యిద్దరు చెప్పుకొని నిష్కారణముగా భార్యను వదలువాడు పరస్త్రీల మరగి భార్యతో తానన్న వాక్కుతప్పి అనృతమాడెను. అట్లే పరపురుష స్నేహితురాలై భర్తను మాయచేసి పరులవల్ల పుత్రులగనుచు వివాహమున తానన్న సత్యవాక్కు తప్పి

భర్త కుటుంబాంతము చేసినది భార్యఅయ్యెను. అట్టి వీరిద్దరు మిత్రద్రోహులుగదా!

మనుస్మృతి:— అన్నజలాగ్ని వాయు దానముల కన్నను ఇతరదానములకన్నను 'సర్వేషామేవ దానానాం వాగ్దానంచ విశిష్యతే' సత్యవాక్కు దానమిందుకు సర్వదాన ములకన్న శ్రేష్టము. అదిభగ్నమయిన అసృతమైనది. దైవీ సంపదగల సాధుసాధ్వీలు చక్కగా నడువగలరు. భర్త బలవంతుడగు యోగిపుంగవుడైన ఆసురీసంపద భార్యయైనను చక్కగా నడచును. ఉదా॥ విశ్రవను, కైకేసి—

రావణుడు వ్యభిచారియైనను మండోదరి భర్తను వారింప లేదు. రావణుడు ఆమెను ఎన్నడు నవమానింపలేదు. రావ ణుడు తనపేరు, భార్యపేరు శాశ్వతముగా నుండుటకు అర్క ప్రకాశమను వైద్యగ్రంథమును లోకోపకారార్థము వ్రాసెను. బలహీనుడు, అమాయకుడు అగు భర్తకు ఆసురీసంపదలో వ్యభిచారిణి తగిలిన తగువులు బయలుదేరి విడాకులవరకు వచ్చును. భర్త బలవంతుడైన భార్య వ్యభిచారిణియైన విడా కులవరకు వచ్చును. భార్య వ్యభిచారిణి కాకున్నను భర్తకు అన్యాయముగా సందేహముకల్గినపుడు విడాకులవరకు వచ్చును. భర్త ఆసురీసంపదవాడై భార్య దైవీసంపదతాలైనను ఒక ప్పుడు విడాకులవరకు వచ్చును. గృహ్యాసూత్రమున వివాహ కాలమున రాజు బ్రాహ్మణులు ఉండవలెనని కలదు. భట్ట కులస్థులగు రాజులు భట్టురాజులని కొందరును, బ్రాహ్మణో

త్పత్తి మార్తాండగ్రంథమున భాట్టీయక్షత్రియులు అన చంద్ర వంశస్థులని కలదు. వీరే ఆంధ్రమున భట్టరాజులని కొందరు వేదవేదాంగములు చదివిన పురుషునకు భట్టశబ్దము బిరుదముగా గలదు. అది బ్రాహ్మణులమనువారిలో చదివినవారికి గలదు. క్షత్రియులమను తెగలలో నొక తెగకు బిరుదముగా గల రాజులు భట్టరాజులనబడిరని కొందరు చెప్పుదురు. వివాహములో వీరిరువురు రాజుగా బ్రాహ్మణులుగా అంగీకరించిన సాక్షులుగదా! వైదికబ్రాహ్మణుడు మహర్షిగా, భట్టరాజు రాజర్షిగానుండి ఆశీర్వదించెడివారు. దానిప్రకారము నానావిధ భార్యాభర్తలకు సఖ్యత సౌఖ్యములు గల్గెడివి. ఇప్పుడవి తగ్గినవి. వారును తగ్గినారు. సత్యసంగీతము ఇద్దరికి స్నేహము కూర్చునది. అది తగ్గినది. మంచి మేలిమిబంగారము ఆభరణములు చేయించుటలేదు. రత్నాలు సరియైనవికావు. వారి వారి సంఘపు పెద్దలు సత్యవంతులుగారు. వారాశీర్వాద ఫలము జరుగుటలేదు. వివాహానిషేక ముహూర్తములుగలవు. యివి సరియైన ఫలమిచ్చునట్లు ముహూర్తముంచు దైవజ్ఞుడరుదు. వాద్యగాండ్రు సరియైన ధ్వనిచేయుటలేదు. వీటిలో కొన్ని గలిగియున్నను అసురీసంపదవారును, బాగుపడెదరు. ఇవి సామాన్యముగా నున్నచో దైవీసంపద స్త్రీ పురుషులు సఖ్యతగా సుఖముగా కాలము గడపగలరు. భారతము అశ్వమేధపర్వము:—

తే॥ గీ॥ పతియె చుట్టంబు పక్కంబు పతియె చెలియ
పతియె తల్లియుం తండ్రియు పతియె గురువు

పతియె దైవంబుగాన నతని
పనియొనర్చుటయుచూవె నాతి కరయ.

గృహాశ్రమమున స్త్రీకి భర్తదక్క రాత్రింబవళ్ళు యెవరును యెక్కువ సహాయము చేయువారుండరు. దాన భార్యకు భర్తయే బంధువు, సమీపగురుడు, స్నేహితుడు, తల్లిదండ్రి, గురుదేవుడు గాన భార్య అతని సేవాధర్మముచే అట్టిశక్తిగలదై భర్తతో ఏకీభవించి గృహారాజ్య కార్యభారము నడుపుట సాధ్వీధర్మము. రెండవభర్తనంగీకరించుటయే వ్యభిచారిణి యగుట—

మనువు 5 అ॥ 'నద్వితీయస్య సాధ్వీనాం క్వచిద్భర్తో పదిశ్యతే'. సాధువైనస్త్రీలకు రెండవభర్త విధింపబడలేదు.

శాంతిపర్వము 6వ అధ్యాయము:—

ఆరయ మిత్రద్రోహము,
దారుణమగు పాతకము కృతఘ్నులకంటెన్
వైరముగొని విడువవలయు
నా రెండు తెరంగులవారి నాప్తులనైనన్.

మిత్రద్రోహము మహాపాతకము. గాన యిహమున కష్టముగల్గి పరమున కష్టము కల్గించును. భర్త పరభార్యల మరగి భార్యయందు ప్రేమలేనివాడైనను భార్య వ్యభిచారి యైనను యిద్దరు వివాహమున బల్కిన సత్యవాక్కు తప్పి కుటుంబాంతము చేసినవారగుటచే ధనాదులున్నను లేకున్నను మిత్రద్రోహులై నానాదుఃఖములపాలై నశింతురు.

రామాయణము యుద్ధకాండ: 'సత్యధర్మాభి రక్తానాం నాస్తిమృత్యు కృతం భయం' సత్యమును ధర్మమును పాలించు వారు అకాలమృత్యువునొందరు.

బాలకాండ - ఆరవసర్గ 18

శ్లో॥ దీర్ఘాయుషో నరాస్సర్వే ధర్మం సత్యంచ సంశ్రితాః
సహితా పుత్ర పౌత్రాశ్చ నిత్యం స్త్రీభిః పురోత్తమే॥

అయోధ్యలో స్త్రీలు పురుషులు సత్యధర్మపాలకు లగుటచే దీర్ఘాయువు పుత్రిపౌతు్రిలతో సర్వసంపదలుగల్గి నిత్యానందము నొందుచున్నారు. పుట్టుక సాధ్వీలనగా 5 వ యేటనుండి తలిదండ్రుల గురువాక్య సత్యధర్మమార్గస్థులైన స్త్రీలు ఉదా॥ సీత,

మధ్యములు:— బాల్యమునుండి సాధ్వీ సహవాసమున సత్యధర్మములు మెలగుచు వ్యభిచారాదిదోష వర్జితులై భర్తతో ఆనందముగా సుఖింతురు.

అధమ సాధ్వీలు:—అనగా గొప్ప ధర్మాధర్మములు తెలియకున్నను యిల్లుదాటి పరగృహములకుపోక, వ్యభిచారముచేయక భర్తతోమాత్రము కూడియుందురు. పరసంబంధము వారికి కిట్టదు.

పుట్టుక సాధ్వీలు:—వీరి భర్తలకు అకాలమృత్యు దోషమురాదు. ఉదా॥ సావిత్రి సత్యవంతుడు. మధ్యమాధమ సాధ్వీలకు భర్తలు అకాలమృత్యు వాతబడినను వారు పర పురుషుల గోరక భర్తనే పూజించుచు నిష్కామ భగవ

జపాది సత్యకర్మములు జీవితకాలాంతమువరకుచేసి పైలోక మున భర్తనుజేరుదురు.

మనువు 5 అధ్యాయము:—'ఆశీతా మరణాత్క్షాంతా నియతా బ్రహ్మచారిణీ। యోధర్మ మేకపత్నీనాం కాంక్షంతి తమనుత్తమం' భర్తగతించినతర్వాత ఓర్పుతో నియమము గలదై పతివ్రతల కెట్టిధర్మమో అది తెలిసి వాటి నాచరించుచు, కల్లు మొదలగునవిమాని చచ్చువరకు బ్రహ్మచారిణిగానుండును.

సుశ్రుత వ్యాఖ్యానము:— 'జలమగ్నిర్విషం శస్త్రం స్త్రియో రాజ కులానిచ అకాలమృత్యువో హ్యేతో తేభ్యోభి భ్యతి పండితాః' నీరు,అగ్ని,విషము,శస్త్రము, స్త్రీలు, రాజులు, అకాలమృత్యువు నిచ్చువారు, వారియందు తగినధర్మమును తప్పిన అకాలమృత్యువురాదు. ఇవి భూలోకఅకాలమృత్యువులు. అందరికన్న పరస్త్రీలు తిరుగరాని అకాలమృత్యువులు ఆకాశము నుండి విద్యుత్ మొదలగునవి దేవతలు రాక్షసులు మొదలగు వారిచే గల్గు అకాలమృత్యుకారణములు గతజన్మ దోషమున గల్గునవి కొన్ని తెరగుల అకాలమృత్యు కారణములు వీటి నన్నిటిని పుట్టుక సాధ్విబాపి భర్తకు పూర్ణాయువు నివ్వగలదు. ఉదా॥ సావిత్రి, సత్యవంతుడు. తక్కినవారు 3 వంతులు 2 వంతులు భర్తకు సాయముచేయగలరు. భార్యాభర్తలు సాధు సాధ్వులయిన పూర్ణాయువుగలవారై సత్యధర్మమార్గము లాచరించి సుఖపడుదురు.

భారతము: ఆదిపర్వము:— వివాహానిశ్చిత

మైనది. సాధ్వీయగు ప్రమద్వర సర్పదష్టయై మృతిచెందిన రురుడు తపంబు దేవతలకిచ్చి బ్రతికించి వివాహమాడెను. ఇది భర్తచే భార్యకు గల్గు సాయము.

రామాయణము: బాలకాండ:—బ్రహ్మదత్తుడు సంపూర్ణసాధువు. కుశరాజు కూతుండ్రు నూర్గురు వాయు శాపంబున వాతరోగ జ్వరయుక్తలయిన వివాహమున బ్రహ్మదత్తుడంటినంత శాపవిముక్తలై సుఖపడిరి. పాపులగు భార్యాభర్తలు కొందరు 'పాపీ చిరాయు'వన్నట్లు పూర్ణాయువుపొందుదురు. కాని అధర్మముగాను, అసౌఖ్యముతో కూడుగుడ్డ లోటుగా కాలముగడుపుచు యోగ్యులకు సాయముచేయక మానవజన్మము వ్యర్థముగా పోగొట్టుకొందురు. జనులు వారిని గౌరవింపరు–పూజింపరు.

శాంతిపర్వము 3 వ అ॥ 484

క. వినుమిత్రుండును రజతము
కనకము బుద్ధియును నాల్గుఁ గారణములు మ
ర్త్యుని దారిద్ర్యము బాయుటకని
దేవగురుండు సెప్పె నన్నిటిలోనన్.

గృహాశ్రమము యందు భార్యాభర్తలు వివాహకాలమున యిద్దరు మిత్రులయినట్లు అనేకసాక్షులయెదుట ప్రతిజ్ఞ చేసిరి.

ఒకరికొకరు నిష్కామమిత్రులయిన వారిద్దరు భగవద్ధ్యానము చేయుచు యేదో వృత్తిలో భర్త సంపాదించిన

ధనము భార్య సరియైన వ్యయముచేయుచు తమకున్నంతలో సాధువులైనవారికి అన్నాది ధనదానములు భగవంతునిగా జూచిచేయుచు (దానబలిచక్రవర్తి యొకనాడు దానముచేసిన దానితో భగవంతుని రక్షణలోనుండి బలి సర్వసౌఖ్యములనుభవించుచున్నాడు. ప్రతి నాడిట్లు చేయువా రెట్టిఫలంబు చెందుదురో జెప్ప వీలులేదు). జీవించుటచే దుష్టదరిద్రబాధ గల్గదు. మిత్రునివల్ల కనకరజతవృద్ధియగుట ధర్మము గాన ఒకరికొకరు మిత్రులగుటచే పుట్టుకతో దరిద్రజాతకులైనను దుష్టదరిద్రబాధపొందక అన్నవస్త్రములు లోటురాకధనవృద్ధి సౌఖ్యము చెంది తీరుదురు.

గరుడపురాణము:—'యత్ర స్నేహో భయం తత్ర స్నేహోదుఃఖస్యభాజనం స్నేహమూలానిదుఃఖానితస్మిన్‌త్యక్తే మహాసుఖం' స్నేహమున్నచోటవారి కేరోగాదులుగల్గునోయని భయము గల్గును. గాన స్నేహము దుఃఖస్థానమయినది. దుఃఖమూలమైనది గాన దాని విడచిన గొప్ప సుఖమున్నదని వ్యాసుని వ్రాతను బట్టి చూడగా ఆ మానవ భార్యాభర్త దృష్టిమాని భర్తను దేవునిగా భార్యను భగవతిగా లేక యిద్దరిని దేవునిగా ఒకరినొకరు చూచుకొనుచు స్నేహముగా నుండిన రోగాదులు లేక సర్వసౌఖ్యములు గల్గు ననదగును. దీనిం బట్టి స్నేహితుల నందరిని దేవునిగా జూడనిచో వారికి రోగాదులు గల్గినచో దాన బాధగల్గునుగదా! గాన దేవునిగా వారిని చూచినచో కొంతరోగము తగ్గును. ఇది మిత్రుడు

చేయు సాయము. ఆ దివ్యదృష్టిలో గొప్పశక్తి గలదు. ఇంక ననేక శుభ ఫలముల నిడ గలదు.

శ్లో. లాలయేత్ పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్ ।
షోడశే వర్ష ప్రాప్తే పుత్రం మిత్రవదా చరేత్ ॥

పదహారవయేడు దాటిన పుత్రునిస్నేహితునిగా జూడదగును. పుత్రుడు పుట్టిన నిమిషమునుండి దేవునిగా జూచినవాని కేరోగములు గల్గవు. భార్యాభర్తలు తమ అంగాదులు ఇడి పుత్రుని సృష్టింతురు. అట్టివాడే స్నేహితుడగును. సృష్టికాలాన భార్యాభర్తలు దుష్టసంకల్పములతో గూడియు దుష్టాకారమును జూచుచుగాని భార్య వ్యభిచారిణియైన గాని సృష్టింపబడిన పుత్రుడు సృష్టి సంకరుడై తలిదండ్రులకు విరోధియగును. దాన కంసుడు తలిదండ్రులవలె బాధలు చెందుదురు. పై దివ్యదృష్టి విడచిన స్నేహితున కనగా భార్యాపుత్రసహచరులకు రోగాదులు గల్గిన ఆకాలమున స్నేహము దుఃఖమూలమగును. అది విడచిన అనగా ఆ దృష్టిబాసి దేవునిగా జూచినచో అట్టి కష్టములు గల్గవు. లేనిచో వ్యాసుడు పై శ్లోకమును బట్టి భార్యాపుత్రమిత్రాదుల విడచుట మంచిదనుట గృహాశ్రమము విడువదగినదని అర్థమగుచున్నది. గృహాశ్రమము లేనిచో జగము నశించును. గాన గృహాశ్రమమున పై దివ్యదృష్టిలేనివారు ఎక్కువ స్నేహముతో నుండక తన సహాయార్థము సత్సంతానముగని కొంతకాలముగడచిన తర్వాత వారిని విడచి భగవధ్యాన సిద్ధుడైన మహాసుఖము

పొందునని భావము. ఆ భగవద్దృష్టి గృహాశ్రమమున నుండగా కుదిరినను మహాసుఖమే గల్గునని భావము. భగవద్దృష్టిలేని స్నేహమున కొంతకాలమునకు కష్టములు గల్గకమానవు. దాన దుఃఖములు గల్గకమానవు. మరియు వార్ధక్య సముద్రము దాట భార్య సహాయము భర్తకు, భర్తసహాయము భార్యకు గల్గిన గాని సత్పుత్ర సృష్టిచేయలేరు. ఆపదగల్గిన కాలమున సుఖముచేయువాడు మిత్రుడు. యీ స్థితి భార్యకు భర్తకు, భార్య పుత్రునకు తండ్రి, భర్తకు తల్లీ తండ్రికీ పుత్రుడు సహాయపడుదురు. దాన తల్లిదండ్రి పుత్రులు మిత్రులని భావము. వీరు నిష్కామసాధు వర్తనులై.

శ్లో. ఆత్మవత్సర్వ భూతాని యఃపశ్యతి సపశ్యతి.

సర్వమును భగవంతునివలె జూచువాడే జూచెడివాడు. అట్లు చూడలేనివాడు కన్నులున్నను గ్రుడ్డివానితో సముడని భావము సర్వమిత్రుడు బ్రాహ్మణుడు గాన తమ ముగ్గురిలోగల ప్రేమతోనే సైజీవులందు జూచిన అనగా మిత్రులందరిని సర్వము దేవునిగా జూచుచు వాటిసన్నిధిని దేవుని గౌరవించునట్లు గౌరవించుచు నడచినచో కొంతకాలమునకు భగవద్భక్తి తన్మయావేశించి బ్రహ్మర్షులయ్యెదరు.

శ్లో॥ వశ్యశ్చ పుత్రోర్థకరీచవిద్యా అరోగతాసజ్జనసంగతిశ్చ
ఇష్టాచభార్యా వశవర్తినీచదుఃఖానిమూలోద్ధరణానిపంచ.

పుత్రుడు మిత్రుడుగా నుండుట, ధనము నిచ్చు విద్య, రోగములేకుండుట, సజ్జనసహవాసము, తనహితమై స్నేహ

ముగా నడచుట గల్గు భార్యగల్గుట, యీ అయిదు దుఃఖవృక్ష మూలముల హరించును. అనగా యీస్థితి ఎక్కువపుణ్యాత్మునికి గాని లభింపదు.

—: కలియుగ ధర్మములు :—

భారతము, అరణ్యపర్వము, కలియుగధర్మములు 4 ఆ॥

కం॥ సుతుడవమానించు జనకు
పతినవమానించుభార్య పడతులు పతులున్
మతి నొండొరుల మెచ్చక సతతము
చరియింతు రిష్ట సంచారములన్.

తండ్రి పుత్రులకు, భార్యా భర్తలకు పడక దుష్టత్వమున దిరుగుదురు. (305 పద్యము) స్త్రీవ్యభిచారము, మద్యపానము ఎక్కువప్రచారములోనికి వచ్చును. ఇదియే కలియుగ చర్య. అనగా ఆసురీసంపదవారే ఎక్కువ జనింతురని భావము. లేనిచో దైవీసంపదవారు వృద్ధియైననాడు కలియే కృతయుగమగుచుండును.

యజుర్వేదము:— కలిసంతరణోపనిషత్తు:—— 'భగవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూతకలిర్భవతి'ఓం నమోభగవన్ఆదిపురుష నారాయణ అన్నంత మాత్రాన కలి ఆనాడుండదు. ప్రతినాడును వారికి కృతయుగ సుఖము జరుగునని భావము.

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

యీనామములు పదహారున్ను నూటయాభై లక్షల జపముచేయ కలిదోషములు, మహాపాపములు పోవును. దైవీ సంపదవారిమార్గాన భగవంతుని ప్రతినాడు స్మరించి (యితర దేశములకు కలిలేదు. భారత దేశమునకుమాత్రము కలిగలదు) భోగ దేశములనబడు భూలోకమున యితర దేశ మేధావులకన్న కర్మభూమినుండు భారతీయులు దోషముక్తులయి గొప్ప మేధావంతులగుదురు. నల దమయంతి, కర్కోటక ఋతుపర్ణ నామోచ్చారణమున ఆనాటికిమాత్రము కలిదోష విముక్తులగుదురు. ప్రతినాడట్లుచేసినవారికి కలిదోషములంటవు ...

మనుస్మృతి 10 అ॥ 'రాజాహి యుగముచ్యతే'.

దేశము పాలించు రాజే అనగా ప్రస్తుతము పాలించు ప్రజలే యుగమనబడును. సత్య ధర్మాహింసాది మార్గములు వినుట, ఆప్రకారము ఫలము గల్గువరకు చేయుటయే కృత యుగము. 'కలిః ప్రసుప్తో భవతి.' కలి యనగా నిద్ర జెందియుండు కాలము. ఏలోకమునుండియో తానువచ్చిన భూలోకములో నిష్కామ సకామ ధర్మాధర్మములు తెలియకయు, తెలిసిన ఫలము జెందువరకు చరింపక విఘ్నములు జెందించు కాలము కలియుగము లేక నిత్యము నిష్ఫల కార్యాచరణ డగుటయు కలియుగమే. గాన గృహస్థుడగు చిన్నరాజు తనరాజ్యమున కలిని జేరనీయక అనగా వ్యభిచారము, మద్యపానము మొదలైన దుష్క్రియలు చేయుట విడచి కాలము వ్యర్థపరచక దేవుని పూజించుచు సత్య ధర్మమార్గంబుల ఫలము జెందు

వరకు ఆచరింపక తప్పదు. లేనిచో ఆసురీసంపదవారు వృద్ధి యగుదురు. ప్రతియుగముల వ్యభిచారిణులును, వ్యభిచారము అంగీకరింపనివారును ఎప్పుడును ఉందురు. వ్యభిచారిణి నానా బీజముల జెందిన బీడుభూమివలె దుష్టసంతతి నిచ్చును. ఇదియే గృహాశ్రమ కలియుగము. రెండవది వ్యభిచారముచేయునంత నేలాభములేదు. ఇతరబీజములు పడినను వాటిని దున్ని శుభ్ర పరచి ఒకరకపు విత్తనములు జల్లిన పండినట్లు భర్తను దేవు నిగాజూచి సంయోగయజ్ఞ మొనరించు సాధ్వీ సత్సంతానాభి వృద్ధికాలము గృహాశ్రమకృతయుగము.

చరక సంహిత; చికిత్సాకాండ వాజీకరణ ములు :— 'స్త్రీషు ప్రీతివిశేషేణ స్త్రీష్వాపత్యం ప్రతిష్ఠితం ధర్మార్థౌ స్త్రీషు లక్ష్మీశ్చ స్త్రీషు లోకాః ప్రతిష్ఠితాః॥' స్త్రీలు పురుషునికి ప్రీతి గల్గించు రూపధారులు. సంతానముగనుట వారియందు ప్రతిష్టమైనది. ధర్మము, అర్థము, సంపద, లోక ములు, స్త్రీలయందే ప్రతిష్ఠింపబడియున్నవి అని భారతదేశ పూర్వపు డాక్టరు వ్రాసెను. సాధ్వీ యేలోకస్థులైనను వారి నీలోకములో పుట్టింపగలదు. జీవుల నేలోకమువకు జేరవలె నన్న ఆలోకమునకు జేర్చ సహాయపడగలదు. సర్వలోకేశు డగు దేవునైనను అవతారపురుషునిగా యీలోకాన సృష్టింప గలదు. యిక దేవతాదుల సృష్టింప లెక్కయా! పుట్టిన తర్వాత.

మార్కండేయపురాణము:—మదాలస అలర్క

డను పుత్రునికి మంచి బోధించి మంచి లోకములు జేర సహాయముచేసినట్లు చేయగలదు. సాధ్వులు ధర్మమార్గస్థ లగుటచే లక్ష్మివలె ధనసంపదలచే ప్రకాశింతురు.

—: దుష్ట స్త్రీలు :—

నరకాదులనుండి వచ్చు దుష్టజీవసంతతిని వృద్ధిచేయుదురు. తలిదండ్రుల అధర్మమార్గముచూచి పిల్లలు నేర్చుకొని దుష్టదరిద్రములో అనగా కూడు, గుడ్డ, ఇల్లు తక్కువైగాని, ఎక్కువగలిగిగాని సన్మార్గముపొంత బోవక పరులకు తమకు ఇహసుఖములేకుండా జేసి దుష్టలోకము జేరెదరు. యీ దుష్ట స్త్రీలయందు దుష్టలోకప్రతిష్ట అయియున్నది. యితర దేశ వివాహములలో కొంత మంచిగుణము కలిగియున్నను భారత దేశ వివాహసత్ఫలములు లేనివగుట వాని విమర్శింపమాని వీటి ప్రభావము వ్రాసితిని. గాన భారతవివాహధర్మములు పరదేశజులుగాని సుఖపడదగినది.

—: భారతదేశ పూర్వవివాహములు-సంఘములు :—

భూలోకాన పశువులు, దున్నలు, కుక్కలు, పులులు, ఏనుగులు, గుఱ్ఱాలు పక్షులు మొదలగునవి తమతమ సంఘములలో స్త్రీలనుబొంది సంతతి వృద్ధిచేయునట్లందరెరింగినదే. పూర్ణధర్మ, మధ్యమధర్మ, అధమధర్మ, అధమాధమధర్మము లని నాలుగు సంఘములుగా జనులను విడదీసిరి. వానినుండి అనేక సంఘములు గలిగినట్లు గలవు. గాన సంఘము సమమై గుణకర్మానురాగములు తుల్యమైన స్త్రీపురుషవివాహములు

నిర్ణయించి భార్యకు సహధర్మిణియని పేరిడిరి. సంఘము సమమై గుణకర్మానురాగములు తుల్యముగానిచో చిక్కులు గల్గును. గుణకర్మానురాగములు తుల్యమై సంఘము సమముగా నున్నను మంచిదే అగును. ఉ॥ భీముడు, హిడింబి. గుణానురాగములు తుల్యమైన భార్యాభర్తలు సుఖింతురు.

గీత:— 'శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోపి జాయతే। అధవా యోగినామేవ కులేభవతి ధీమతాం॥' శ్రీమంతుడగువాడు రాజ్యమున రాజై యున్నాడు. గతమున బ్రహ్మర్షిత్వసిద్ధి పొందనివాడు రాజ్యమేలు రాజులయిండ్లగాని బీదవారైనను ధనికులై యున్న యోగులయిండ్లగాని పుట్టుదురు. వీరిద్దరు గతమున ఒకసంఘ ఒకమార్గస్థులు. మరలపుట్టి బ్రహ్మర్షులగువారు. రాజర్షుల కూతుండ్రను, ఋషి, మహర్షి, బ్రహ్మర్షి కూతుండ్రను పెండ్లాడినారు. రాజర్షి తక్కువధర్మస్థుడుగాన బ్రహ్మర్షి చెప్పినట్లాచరించువాడు. రాజర్షులు భయభక్తుల వారిని పూజించెడివారు. భక్తిగల గృహస్థులను నిష్కామమార్గాన బ్రహ్మర్షి నడిపించి బ్రహ్మర్షుల చేయగలడు. బ్రహ్మర్షి సర్వలోకాధికుడుగాన బ్రహ్మర్షిత్వసిద్ధికై రాజ్యసిద్ధి విడనాడి భారతదేశాన తొల్లి అనేకులు కృషిచేయువారు. అందరిలోనూ కొందరుమాత్రము జయత్వముచెందెడివారు.

—: వి వా హ ము లు ఎ ని మి ది :—

బ్రాహ్మవివాహము. మనుస్మృతి :— మంచి శీలముగలవాడు ఉపనిషత్తులు వేదాది సద్గ్రంథపఠన సల్పుచు

నిష్కామసన్మార్గుడై సర్వమును బ్రహ్మముగా చూచువానిగని ఉపనిషత్తులు పురాణాది సద్గ్రంథపఠన పిల్లల రక్షించుటకు తగిన వేదాదిమంత్రములు వైద్యశాస్త్రము చదివి నిష్కామ సన్మార్గమున చరించుచు తల్లి తండ్రి గురువు అన్నదమ్ముల బాల్యమున దేవునిగాచూచు దృష్టి స్థిరమైన కూతుని సాలంకృతమైనదానిని సుశీలవతియైనదాని మమ్ముల దైవముగాజూచెడు దానవుగాని నేటినుండి అదివిడచి నీభర్తను దేవునిగాజూచుచు నిన్ను దేవునిగాగాని భగవతిగాగాని చూచుచు మీరిద్దరు సుఖముగా నుండుడని ఆశీర్వదించుచు అల్లుని దేవునిగా మామ అత్తగారు చూచి దానముసేయుట బ్రాహ్మవివాహము అని నా అభిప్రాయము. పరులకు యజ్ఞాదులుసేయు శ్రాద్ధములొనరించు వేదభాగముమాత్రము స్త్రీ చదువరాదు. దాన పరపురుషసంబంధము గల్గునని పూర్వుల అభిప్రాయము.

గాన గార్గి మొదలగు వారివలె ఉపనిషత్తులు, దర్శనాదులు, గీతాది సద్గ్రంథములు, పురాణములు, ఇతిహాసములు, తప్పక చదివినగాని స్త్రీకి సత్యమగు నిష్కామ మార్గమున నడచుట గల్గదు. (ఇవి అర్థముసేయ ప్రస్తుతము తర్కవ్యాకర్ణ మీమాంసాది శాస్త్రజ్ఞులగువారయిన పిదప వేదాంతము చదువవలెనని కొందరందురు. తర్కవ్యాకర్ణ మీమాంసములు చదివినంతనే వేదాదులకు ఆచరించిన ఫలము గల్గు [illegible] చెప్పలేము). గాన వేదాంతశాస్త్రములు. ఉప [illegible] తర్వాత వాటి అర్థమునే ఫలరూపమగు

కథారూపముల వాల్మీకి వ్యాసాదులు ఇతిహాస పురాణాదులు వ్రాసిరి. వాటినన్నీ స్మృతులను స్త్రీలచే చదివించవచ్చును. సంగీతశాస్త్ర వైద్యమంత్ర ధనుర్వేదాది సర్వశాస్త్రములు స్త్రీలు చదువ వచ్చును. చదువు నపుడు ముసలివాడైన పండితునివద్దగాని, అట్టి పండితురాలగు స్త్రీ వద్దగాని చదివిం చదగును. వయోపురుష బాలురగూడి చదువరాదు. ఇది భారత దేశ నిర్ణయము. స్త్రీపురుషుల సంబంధమున కొందరు మంచివారున్ననూ వ్యభిచారమునకు హేతువగునని ఋషుల యభిప్రాయము. పశ్చిమ దేశముల చలి దేశములగుటచే 20 ఏండ్లు వచ్చినగాని వయస్సు కామముగల్గదు. దాన వారు చదివినను, చదువ వచ్చును. వారును రజస్వల తరువాత పురుష సంబంధమున చదువరాదు. వ్యభిచారము మహా దూష్యమై మేధావంతుల నైనను తాను చదివిన చదువనున్న గ్రంథాల సత్యమును గ్రహింపలేకుండా చేయును. బ్రహ్మ చర్యముననే విద్యలు చదువుట అన వివాహమాడకయు, భగ వంతుని ఉపాసించుచు కూడుగుడ్డలు మంచిమార్గమున సంపా దించు మార్గములు, కైవల్యము చెందుమార్గము, రోగాదుల హరించు మార్గములు, ఇహపరసుఖమునకై ప్రతి స్త్రీపురుషు డును చదువదగినది. కౌసల్య రామునికి అడవికి వెళ్ళునపుడు మంత్రాల జపించి విశల్యకరణి రక్షణగా రాక్షససర్పాది దుష్ట భయములేకుండుటకునై కట్టినది. దాన అట్లే జరిగినది. సీత సంధ్యావందనము తటాకపు దరినిచేయునని హనుమంతుడచట

కొలది కాలముండెను. ప్రమీల అర్జునునితో, సీత శతకంఠ రావణునితో యుద్ధముచేసెను. జ్యోతిష్టోమాది యజ్ఞములు శ్రాద్ధములు పెట్టుట పురుషుల సంబంధముండుటచే వేదములో ఆ భాగములు మాత్రము స్త్రీలకు అవసరములేదని స్త్రీలం వేదము చదువరాదనుచోట గ్రహించిన వాక్యార్థమును సహధర్మిణి అను పదమునకు కొంత పుత్రికకు భర్తకు సహాయపడు శాస్త్రములు తండ్రి చదివించుట దివ్యదృష్టి అనగా భగవంతునిగా ప్రతిదానిని చూచుట నేర్పుట మంచిది. భర్త బ్రహ్మర్షియైన భార్యను బ్రాహ్మణినిగా చేసి ఇహపరసుఖము లందించును. తలిదండ్రులవద్ద బాల్యముననే స్త్రీకి కావలసినంత విద్య నేర్చి బ్రాహ్మణియైయున్న ఆకన్యాదానఫలము బ్రహ్మాదులును చెప్పలేరు. గాన బ్రాహ్మవివాహములో పుట్టిన పుత్రుడు.

మనుస్మృతి :— 'దశపూర్వాన్ పరాన్ వంశ్యానాత్మానం చేక వింశతిం' బ్రాహ్మీపుత్ర సుకృతకృన్ మోచయే దేనసః పిత్రూన్' యీ వివాహమునకు చెందినవారు నిష్కామనన్మార్గులు. సర్వమును భగవంతునిగా భర్తయు, భర్తను దేవునిగా భార్యయు చూచువారు ఇతరకాలముల గాక తమకపకారముచేయు శతృవులను స్త్రీ దేవునిగా చూచి వారివల్ల గల్గు కష్టములనుండి విముక్తురాలై యశోవంతురాలగును. అట్టివారికి గల్గిన పుత్రుడు యిరువదొక్క తరములవారిని తన్నుతరింపచేయుచు లోకకల్యాణముచేయు సత్సంతానాభివృద్ధి

చేయును. సర్వమును దేవునిగా ఉభయులు చూచుచు గాని ఒకరైన చూచుచుగాని మంచికాలములో సంయోగ యజ్ఞముచేయువారైన బ్రహ్మజ్ఞాని లేక అవతార పురుషుడు పుట్టును. పురుషునికన్న స్త్రీ పట్టుపట్టిన బ్రహ్మజ్ఞాన యుక్తులగు పుత్రునిగాని, పుత్రికనుగాని కనితీరును.

పంచాగ్నులనగా, ద్యులోకాగ్ని, మేఘాగ్ని, భూమ్యగ్ని, పురుషాగ్ని, స్త్రీయగ్నులు. పైలోకాలనుండి ద్యులోకాగ్నిచే తగులబడి సూర్యునిద్వారా మేఘమునజేరి, భూమినిజేరి, ఆహార రూపమై పురుషునితర్వాత సంయోగ యజ్ఞముద్వారా స్త్రీని జీవులు జెంది, భూలోకానకు వచ్చుచున్నారు గాన చివరఅగ్ని స్త్రీగాన ఆమె జీవుల నెట్లుచేయవలెనన్న అట్లు సృష్టింపగలదు. భర్త సహాయమున పూర్తియగును. యింత శక్తివంతురాలగుట పరుడుజూచిన ఆమెకెట్టి అపకారము చేయునో యని యితరపురుషులు స్త్రీలను చూడరాదనిరి. వ్యభిచారిణి జీవుల దుష్టసృష్టిలో బలవంతుల, బలహీనుల సృష్టింపగలదు. గాని పైసాధ్వివలె సృష్టింపలేదు. స్త్రీ రెండవభర్తను పొందిన మాత్రాన ఆ గొప్పశక్తి నశించును. అహల్య కామముతో యింద్రుని పొందినమాత్రాన దూష్యయై కొన్ని వేల యేండ్లు తపస్సుచేసి భగవద్దర్శనము పొందుటచే ఆదోషము బాపుకొనినది. సాధ్వియైనను గర్భధారణ కాలమున దుష్టవృత్తియైన దుష్టులనే కనును.

ఉదాహరణ:— గాంధారి సుయోధనాదులు—

కశ్యపుడు బ్రహ్మర్షిగాడుకు హిరణ్యకశిపుడు బ్రహ్మజ్ఞానికదా యని మామ లీలావతిని కన్యాదానము చేసెను. లీలావతి మాత్రము భర్తను దేవునిగాజూచు దివ్యదృష్టిగలది. యితర కాలములో భగవద్దృష్టి కలదైననూ భర్తను ప్రేమతో పూజించుగాని సంయోగయజ్ఞమున భగవద్దృష్టిలేనిచో భర్త దుష్టుడైన దుష్టుని, సాధువైన సాధువును స్త్రీ కనగలదు. లీలావతి సంయోగయజ్ఞమున భర్తను దేవునిగా చూచునది— (భర్త యీదృష్టిలేనివాడు) భార్యకొకదానికి యీ దివ్యదృష్టి గలిగినను పుత్రుని కనగలదు.

'యోషారత్నమునాథ దేవత విశాలోద్యోగమాతల్లి'

అని ప్రహ్లాదుడు తనతల్లి భర్తను దేవుడుగా చూచు నది అని చెప్పెను.

—: నారసింహుడు-ప్రహ్లాదుడు, భాగవతము 7 వ స్కంధము :—

మ॥ "నిజభక్తుండవునాకు నిన్నుగనుటన్ నీతండ్రి సప్త పూ
ర్వజులన్గూడి పవిత్రుడై శుభగతిన్ వర్తించు"

ఓ ప్రహ్లాద నిన్నుగనుటచే నీతండ్రి 21 తరములవారితో గూడి సర్వసౌఖ్యము లనుభవించును. యీప్రహ్లాదుడు బ్రహ్మ జ్ఞానసిద్ధుడన అంతయు దేవునిగా చూచినవాడు. గాన యిట్టి సంతతి పై మనుస్మృతిలోచెప్పిన బ్రాహ్మ వివాహ వధూవరులు మాత్రము కనగలరు. ఇతరులు కనలేరు. వివాహమున ఈ శక్తిలేకున్నను తరువాత కొంతకాలమునకు ఈ దివ్యదృష్టి నభ్యసించిన భార్యాభర్తలు కనగలరని నాయభిప్రాయము.

గాన బాలబాలికలకు తల్లిదండ్రులు యీ దివ్యదృష్టిప్రభావము చెప్పుచు వారి ఆయురారోగ్యముకొరకు, సర్వసంపదలకొరకు, మోక్షముకొరకు బాల్యమునుండి అభ్యసింపజేయదగును. పాఠశాలలో గురువుకూడ యీ దివ్యదృష్టిప్రభావము చెప్పి దానియందే ప్రేమగల్గించి అభ్యసింపచేయదగును. లేనినాడు యెన్నిరకాలవిద్యలు పరదేశములకేగి నేర్చిననూ, స్వదేశమున నేర్చిననూ, ధనాదులుగల్గి పరులవలన భయముతో గూడిన సుఖముగల్గునుగాని నిర్భయుడై ప్రహ్లాదునివలె శతృవులను జయించలేడు. ప్రకృతివిద్య నేర్చిన ధనవంతుడొకడు, ప్రకృతి విద్య నేర్చిన స్నేహితులు గలవాడు, భగవంతుని సంబంధము లేనివాడు, యితడు దుష్టులకు విరోధి యయ్యెను. యితడు వారికి భయపడి వారిపక్షమున చేరి దుష్టుడయ్యెను. ప్రకృతి విద్యలు భయముతోగూడిన కూడుగుడ్డల నిచ్చును. వికృతి విద్య అనగా భగవంతునిదయ సంపాదించు విద్య పరభయ రహితుని జేసి యిహాపర సౌఖ్యములనిచ్చును. పశ్చిమ దేశజులు భగవంతునిదయ సంపాదించు విద్య పూర్ణముగా నెరుంగరు. గాని ప్రకృతివిద్యల నేర్చి విశేష ధనమార్జించిరి గాని దానిని తమకు విరోధులగు పరదేశజులవల్ల యెపుడు నష్టముకల్గునో యను భయముతోగూడిన సుఖమునే యనుభవించుచున్నారు. గాని నిర్భయులై ప్రహ్లాదునివలె ఒక్కడునూ సౌఖ్య మనుభవించుటలేనట్లుందరెరింగినదే—

ఉదాహరణః— రష్యా, బ్రిటను, ఫ్రాన్సు, అమెరి

కాలు. వీరికన్న ధనవంతులు యీలోకాన ప్రస్తుతము లేరు. వీరు ప్రకృతివిద్యలలో నుత్తీర్ణులైననూ ఒకరినిజూచి ఒకరు భయముతో గూడిన సుఖము పొందుచున్నారు. గాన యిది యెరింగి భూలోకస్థులందరు భారతదేశమునగల భగవంతుని కృపనిచ్చు శాస్త్రమార్గాల నభ్యసించిన నిర్భయ సుఖముల తాము పొందుచు పరులకట్టి సుఖము నిడగలరు. నాస్తికులగు దుష్టులు వారినిచూచినంత భయముతో నణగియుందురు.

ఉదాహరణ:—మైత్రేయుడను ఋషి ఒక్కడేవచ్చి దుర్యోధనుని యుద్ధము మానుమని బోధించెను. అతడు వినక తొడ చరిచెను. దాన నిర్భయుడగు ఆఋషి అనేక సైన్యములున్నను, రాజైయున్నను, ఆతొడలు యుద్ధమున విరుగునని శపించెను. వానితండ్రి ధృతరాష్ట్రుడు పాదములుబట్టి రక్షింపమని ప్రార్థించెను. దుర్యోధనుడు భయపడి మారుపల్కలేదు. గాన బ్రహ్మవిద్యాసిద్ధుడు, మానవుడయ్యు నిర్భయ సౌఖ్యముల నందును. గాన భూలోక సర్వపాఠశాలల ప్రకృతివిద్యతో బాటు స్త్రీపురుషులకు బ్రహ్మవిద్యచెప్పు గ్రంథముల బోధించి అచరింపచేసిన భూలోకము కైలాసమువలె ప్రకాశించును.

శా. యోషారత్నమునాథ దేవత విశాలోద్యోగ ఘా తల్లి ని
ర్వైషమ్యంబున నాథు రాక మదిలో వాంఛించి నిర్దోషియై
యీషత్ భీతియులేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు
శ్రూషల్ చేయుచునుండె నాతడునకున్ సువ్యక్తశీలంబునన్.

తా. గర్భ పరిభవకాలముతో యింద్రునిచే చెరబట్ట

బడి కష్టములపాలైన నారదుడు విడిపించెను. తక్కిన గర్భ కాలమంతయు నిష్కామ భగద్ధ్యానాదులతో సన్మార్గముగా లీలావతి గడిపెను. దాన బాల్యమున ప్రహ్లాదుడు దుష్టుడగు తండ్రిచే శిక్షింపబడి తల్లి యింద్రునిచే శిక్షింపబడి నారదునిచే విడిపింపబడినట్లు విష్ణువుచే రక్షింపబడి తుదకు విజయముచెంది ముల్లోకము లేలగల్గినాడు. యిటులే బ్రహ్మజ్ఞానులగు వసు దేవదేవకులు చరనున్నను గర్భధారణాదికాలము మొదలు ప్రసవించువరకు నిష్కామ సన్మార్గమున నడచినారు. దాన పుట్టినదాది పరులవలన యేభాదలుపడక నిత్యసంతోషముతో జయత్వముచెందు శ్రీకృష్ణుని గనగల్గినాడు. ఆ మహాత్ముని జీవితమంతయు నిత్యమంగళ నిత్యోత్సవ నిత్యానందముతో బ్రహ్మానందముతో నడచినది. భార్యాభర్తలిద్దరూ పట్టుబట్టి భగవద్ధ్యానపరులై యేకదీక్షతోగనిన సంతానము కృష్ణుని వంటి అవతారమూర్తిగల్గును.

దైవవివాహము:— వేదపండితుడు సత్కామ సన్మార్గుడు (యజ్ఞమునందు దేవతల ప్రత్యక్షముగ చూచు వాడు.) అగువానికి తగిన వేదాద్యుక్తాచారిణియైన దేవతా దృష్టిగలిగి సన్మార్గవర్తినియగు సాత్వికకన్యను దుర్గవలె, లక్ష్మివలె చూచి, శివునిగా, విష్ణువిగా, అల్లునిచూచి కన్యా దానముచేయువాడు సర్వసౌఖ్యముల నందగలడు. యీ దృష్టి తలితండ్రులకు లేనిచో సామాన్యఫలముగల్గును. అల్లుడు వివాహకాలముతో విష్ణుసదృశుడగుగలడు. గాన విష్ణువన శివు

నికి కృష్ణునికి అర్ధము. రెంటిలో ఒకనివలెచూచుచు కూతుని భగవతిగా చూచుచు దానముచేసి అల్లుని పాదములాదృష్టి చూచి కడిగి నెత్తినిజల్లుకొనిన సర్వసౌఖ్యమిదును. యిది అంతయు లాభములేదని నాస్తికులందురు. వారి కాఫలము నాస్తికమగునుగదా. చేసినవారికే ఆదివ్యఫలముగల్గును. దేవుని పూజింపనివారెక్కుడు వృద్ధియైన అధర్మమార్గములెక్కుడై భయముతో కష్టములతో రోగములతోగూడిన సుఖము గల్గును. దేవునిపూజించు వారెక్కుడు వృద్ధియైన ధర్మ మార్గము లెక్కుడై భయకష్టరోగాలు లేక ఒకరికొకరు సహాయపరులై సర్వసౌఖ్యము లనుభవింపగలరు. గాన ప్రప్రధ మము భూలోక ప్రీతిరాజ్యస్తులు సత్సంతానముగనుట వృద్ధి చేయునది. వారికి సాధువిద్యలు సాధుసహవాసము, బ్రహ్మ విద్య నేర్పదగినది. యీ రెంటివల్ల భూలోకము సర్వసుఖా స్పదమగును. భూభూతమంచిదే. అది దుష్టులగూడిన దుష్ట ఫలము, మంచివారువృద్ధియైన వారికి మంచిఫలము నిచ్చుచునే యుండు నట్లందరెరింగినదే. అది మానవులబట్టియుండును. మానవుడు చెడ్డవాడయ్యి అతనినిమోయు భూమియు చెడ్డ దగును. నీళ్లు, అగ్ని, వాయువు, ధ్వనులు చెడ్డవైన అతనికి చెడు ఫలములనిచ్చును. లేనిచో మంచిఫలముల నిచ్చును. సూర్యుడు, చంద్రాది నక్షత్రకాంతులు అటులే ఫలమిడును. కాన మానవుడు నిష్కామ సన్మార్గుడు. సకామసన్మార్గుడై చరించుట శుభముగాని దుర్మార్గుడైన అతని సంకల్పములు

నెరవేరకుండా లేక నడవకుండా భూమియు; చెడురక్తవృద్ధి, జలము; తిన్నదానిని జీర్ణించక కష్టముగల్గించుట అగ్నియు; ప్రాణసుఖములులేకుండ బాధలుపెట్టుట వాయువును; పరులచే చెడ్డమాటలతో అవమానబడుట ఆకాశభూతము చేయుచుండును. కుంతి బాల్యమున దుర్వాసుడురాగా ఆయన సేవకిగా తండ్రి నియోగించెను. దూర్వాసుడు దయతో దేవతనైన స్మరించినంతమాత్రాన వచ్చెడి మంత్రమును నేర్పెను. బాల్యమున సూర్యుని పరీక్షనేసినది. తరువాత పాండురాజుకు రాణియైనది, భర్త సంతానములేదని విచారింప నాదగ్గిర యీ దేవతా దృష్టిగలశక్తి గలదని చెప్పెను. అతడంగీకరింపగా యిందాద్రిదులబొంది సంతతిగనినది. లేక పాండురాజును యింద్రాదులుగా సంయోగ యజ్ఞమునచూచి ధర్మరాజాదుల గనినది అనిచెప్పిననూ చెప్పవచ్చునని నాయభిప్రాయము. మాద్రి యిదేరీతిగా నకులసహదేవుల బడసినది. మాద్రి మామూలు పాండురాజు దృష్టినుండగా ఆమెపైబడి క్రీడించి పాండుడు స్వర్గస్థుడయ్యెను. గాన యీదివ్యదృష్టిమహిమ చెప్పనలవిగాకున్నది. మాద్రి దివ్యదృష్టినుండ సంతానముగనిన పాండురాజు చావలేదు. దీన శాపము జరుగదని పొరపాటుపడి పాండుడు దివ్యదృష్టిలేని మాద్రినిబొంది శాపప్రకారము చచ్చెనని నాయూహ. యిది పాండురాజునే యింద్రాదులుగా చూచి సంయోగయజ్ఞము చేసినారనునపుడు చెప్పదగినఅర్థము. అట్లుగాక యిందాద్రిదులనే పొందినారన యీ అర్థము పనికి

రాదు. ఏల యీదుష్టసంతానమును బలహీన సన్మార్గులగని బాధపడెదరు? బలవంతులగు సత్సంతానముగని గృహస్థ గృహిణులారా యిహపరసౌఖ్యము లందుడు.

—: ఆర్ష వివాహము :—

యాగాది సిద్ధికిగాని, తిరిగి కన్యకిచ్చుటకుగాని, రెండు ఆవులను వృషభములను వరుల కడనుండి పుచ్చుకొని ఋషి ధర్మమార్గాల నేర్పి ఆచరణలోనున్న సుశీల కన్యను, ఋషి ధర్మమార్గస్థునకు దానము చేయుట. యీ దంపతులు తమ తమ హితమగు బ్రహ్మర్షి మయముగా జూచుచు సంయోగ యజ్ఞము చేయుటచే బ్రహ్మజ్ఞానులగు సత్సంతానవృద్ధిగల్గును. దాన ఋషి, మహర్షి, బ్రహ్మర్షులు వృద్ధియగుదురు.

—: ప్రాజాపత్య వివాహము :—

మీరిరువురు ధర్మమున చరింపుడని తల్లిదండ్రులు ధర్మజ్ఞుడగు వరునికి ధర్మజ్ఞురాలగు సుశీలకన్యను దానమిచ్చుట, దాన దక్షప్రజాపతులవంటి మహాత్ములగాని, రాజ్యమేలు రాజర్షులుగా పుట్టుదురు. ప్రజాపతి మయముగాలేక రాజర్షి మయముగా సంయోగ యజ్ఞమున యీ భార్యాభర్తలు చూడగలవారు. యీ వివాహసంతతి 12 తరములవారిని, దైవవివాహసంతతి 14 తరములవారిని, ఆర్ష వివాహసంతతి 6 తరములవారిని తరింపజేయును.

మనుస్మృతి:— 'బ్రహ్మాదిషు వివాహేషు చతుర్ష్వే వానుపూర్వశః । బ్రహ్మవర్చస్వినః పుత్రాః జాయంతే శిష్ట

సమ్మతాం.' యీ నాల్గు వివాహముల పుట్టిన పిల్లలు పరిశుద్ధ ధర్మవర్తనులై పరులకు, తమకు, సర్వలోకస్థులకు, కళ్యాణము చేతురు. మరియు రూపము, సత్వగుణము, ధనవంతము, యశస్సు (జీవించియుండ గల్గుపేరు) గల్గి పూర్ణాయుష్కులు పూర్ణారోగ్యులైన పుత్రులు పుట్టుదురు. యీ నాల్గువివాహముల భార్యభర్తలు, ఋతుకాలమగు రజస్వలయిన 16 దినములలో 8 - 10 - 12 - 14 - 16 - 5 - 9 - 15 రాత్రుల ఆ యోదృష్టితో సంయోగ యజ్ఞమున గర్భధారణమైన అట్టి వారు పుట్టుదురు. వీరు స్వచ్ఛమైన దైవీసంపదగలవారు. జరగనిచో లోపము కనిపెట్టి మరల పరీక్షించుటెగాని గ్రంధాలు తప్పనరాదు. కారణము ఆవు గుఱ్ఱము వ్యభిచార స్త్రీ దృష్టిలో చూచినటువంటి వానిరూపధారుల కనుటలేదా! కననిచో భర్తయందో, భార్యయందో లోటువర్తనగలదని నాయూహ. యిద్దరిలో భార్యలోచే ఎక్కువ యని నా అభిప్రాయము. భార్య వ్యభిచారిణి కాక పైదృష్టులు పట్టుపట్టి అభ్యసించి చేసిన తప్పక కనగలదు. పురుషుడేకమైన పూర్ణమగును. పురుషుడొకడే దృష్టిగలవాడై భార్య వ్యభిచారిణియైన మంచి ఫలముగల్గదు. పురుషుడు దుష్టుడైనను లీలావతివలె భార్య యోగ్యురాలైన ప్రహ్లాదుడువంటి మహాత్ముల గనగలదు. ఓ పురుషుడా నీవు నాల్గవఅగ్నివై యున్నావు. స్త్రీ 5 వ అగ్ని అయివున్నది. సూర్యునినుండువచ్చు జీవులు ఆమెవల్ల భూమిని బడుచున్నవి. గాన స్త్రీ యందెక్కుడు

శక్తి సంతానము గనుటలో గలదు. ఆమె వ్యభిచారిణియైన, నీవు మంచివాడవైననూ పాడు సంతతిగల్గును. ఆమె, నీవు వ్యభిచారులు గాకున్నను ఆదృష్టి లేనిచో బలహీన సన్మార్గు లుదయింతురు.

గాన మన భారతర్షులు చెప్పిన దివ్యదృష్టి అభ్యసించు నందున సత్సంతతిచే నీకును పరులకును సుఖముగల్గును. నీ యంతట నీవును ఆ దివ్యదృష్టిని అభ్యసించిన సర్వసౌఖ్యములు కలహరోగ కష్టములు లేక యిహాపరసుఖముల నొందగలవు. గాన యీనిష్కామ సత్కామమార్గముల విడచిన నిన్ను నీవే పాడుచేసికొనుచున్నావు. విడువకున్న నిన్నునీవే బాగుచేసి కొనుచున్నావు. గాని నిన్ను వర్తకము, వ్యవసాయము, రాజ్యము, బాగుచేయునన కూడుగుడ్డ గల్గుట దానిని పరులు అపహరించకుండ రాజ్యమేలువారు చేతురుగాని అంతకు మిక్కిలి సాయముచేయలేరు. ఆ సాయముపొందుచు నీవు రాజ్యము, వర్తకము, వ్యవసాయాది కర్మములు ధర్మమార్గమున నడచుటకు బలవంతులగు సన్మార్గుల గని వారికి తిరిగి సాయముచేయుము.

నీవు ధృతరాష్ట్రునివలె దుష్టులగని అన్యాయముగా రాజ్యము నంపాదించినను సత్సంతానము గని పాండురాజు దగ్గర లేక స్వర్గము చెందినను పాండవులు తల్లి సాయముచే తాత సాయముచే గొప్ప విద్వాంసులై ధర్మమార్గమున నడచుచు ధర్మముగా రాజ్యమేలుచు ధర్మపక్షమగు తమపక్షమున

భగవంతుడగు కృష్ణుడు 7 అక్షౌహిణీలు రాజులు నిల్చి ఓటు తక్కువైనను అధర్మస్థులగు సుయోధనుని పక్షము 11 అక్షౌహిణీలు అనగా 4 అక్షౌహిణీలు ఓటు లెక్కువైనా అధర్మస్థులగు దుర్యోధనాదులు యుద్ధమున నశించిరి. తక్కువ ఓట్లుగల ధర్మపక్షమును జయించినది. దాన భూలోక ప్రతిరాజ్యమున రాజకీయశిక్షితులు దొంగలు హీనులు తాగుబోతులు విషము పెట్టువారు, కొంపలు గాల్చువారు, అధర్మములు బోధించి వృద్ధిచేయువారు మొదలగు దుష్టులకు గృహస్థులు ఓటివ్వరాదు. సన్మార్గులకే ఓటిచ్చునది. రెండుకల్పి అందరికి ఓటిచ్చిన కొంపలు కాల్చవచ్చునా? కాల్చగూడదా? అని ఓటుకు పెట్టిన కొంపలుకాల్చవచ్చననువారెక్కుడై ఓటునెగ్గిన అందరి కొంపలు కాల్చవలసివచ్చును గదా! దాన గృహాశ్రమధర్మము నిలువదుగదా! దుష్టకర్మములపై ఓటు పెట్టరాదు. గాన సర్వసమత్వము దివ్యదృష్టి గల మహానుభావులుగల రాజ్యములో ఓటు చెల్లునుగాని దుష్టులు సన్మార్గులున్న రాజ్యములో దుష్టులకు ఓటిచ్చిన రాజ్యధర్మములు సాగకకుంటుపడును. వారు దుష్టకర్మములకై ఓటుచేయుదురు. గాన ఏయే రాజ్యమున యేపట్టణమున, యేగ్రామమున, యేయింట, మొదట ఓ గృహస్థుడా-నీవు సత్ప్రజాభివృద్ధి చేయుదువో అంతవరకే బాగుపడును. అదిలేనిచో ఆరాజ్య పట్టణాదులు పాడగును. ఈ జగము బాగుచేయువాడవు నీవే, పాడుచేయువాడవునీవే.అయియున్నావని తెలిసికొనుము. గాన ఓగృహస్థుడా,

దుస్సంతతిగనుట నీ నాశనము, పరనాశనము, చేయునుగాన దుష్టసంతతిగను మార్గముచు నీవు మానుము. యింతకన్న మార్గములేదు. యీ దివ్యదృష్టులతో ఋతుకాలమున మంచి దినములు గానిదినములను 16 దినములు దాటినతరువాత సంయోగము ఋషులు కూడదనిరి. అనగా దుష్టులు పుట్టుదు రని తెలపవలసియున్నది. ఆసదృతుకాలముననూ దుష్టసమయ ముల సంయోగయజ్ఞమున గర్భధారణమైన గొప్పవారిని కన్నను కొంత దోషకముండవూనదు.

ఉ దా:—అత్రి, చంద్రుని పుత్రునిగాకనెను. పూర్ణు డగు చంద్రుని చూచుచుగాని పూర్ణచంద్రుడని భర్తను చూచుచుగాని అత్రి అనసూయలు సంయోగయజ్ఞము చేసి యుందురు.

యజుర్వేదము:—పున్నమి, అమావాస్యల సంయో గయజ్ఞము క్షయరోగకారణమగును. పర్వదిన సంయోగము దోషముతోగూడిన పుత్రు నిడును. అట్లేచంద్రుడు వంశంకరు డయిననూ మితిమీరి సంయోగము చేయుటయును గురుదారా గమనమునను చాల బాధపడి తండ్రిచే కొంత బాగుపడినాడు. క్షత్రియుడై భూలోకము చాలకాలమేలి గొప్ప తపస్వియై తుదకు ఆకాశమున వెలుగుచున్నాడు. అత్రి అనసూయలు బ్రహ్మర్షి బ్రాహ్మణులగుటచే ఆ సంయోగదోషము వారి వంటక చంద్రునంటినదని నాయూహ. ప్రస్తుతము పశ్చిమ దేశీయులు ఖనిజ రసాయనశాస్త్రముల మిగుల పరీక్షించి

నటుల కృతయుగాది త్రియుగాలభారతీయులు చేసిన సర్వశాస్త్ర పరీక్షాఫలములు వాల్మీకి వ్యాసాదిఋషులు గ్రంథాలవ్రాసిరి. కలియుగాన ఆ అనుభవమునుబట్టిపోయిన యిహపరనిత్య సుఖముల పొందవలసినదిపోయి ఆ మార్గములవిడిచి గ్రంథాలు తప్పులని ధర్మమార్గమునువిడిచి ధనసంపాదనలో వృద్ధియైన పశ్చిమదేశజనుల మార్గాలలో బడుటయు వారిచే గౌరవింపబడిన భారతీయుడే గొప్పవాడనియు, అక్కడ వారివిద్యలు నేర్చినవాడే అధికధర్మాత్ముడనియు వ్యాప్తిచెందుట కలియుగాధిక్యత అనవచ్చును. పశ్చిమదేశజనులకు మన భారత సత్సంతానము గృహస్థ గృహిణీ ధర్మరక్షత వారికి తెలియచెప్పనిచో నిత్యము దుష్టయుద్ధమునకు దారితీయు దుష్టసంతతిని వృద్ధిచేసి జగన్నాశనమునను కారకులగుదురు. వారీ మార్గాల చక్కగావినియున్నచో దుష్టయుద్ధములకు కలహములకు దారితీయు దుష్టసంతతి గనుటమాని సత్సంతతి వృద్ధిచేసి జగత్కల్యాణమునకు కారకులగుదురు. వారు శ్రద్ధతో వినిన పూర్ణ ఫలము చెందువరకు చేయగలరు. భారతదేశజులు వినినను ఆచరింపరు. కారణము భారతదేశమునకు మాత్రము కలిదోషముండుటచే. ప్రతిదినము భగవంతుని స్మరించిన కలిదోషముపోయి కృతయుగ మానవులవలె మేధావంతులై త్వరలో సత్సంతతి వృద్ధిచేయు బుద్ధిగలిగి ఆచరింపగలరు. లేనిచో ఆదివ్యదృష్టి సత్సంతతిగల్గుటకు అరుదగును. బలహీన సన్మార్గులు పుట్టినను జగమున సుఖముగలుగదు. దుష్టులకు

కన్యను వివాహముచేయరాదు. దుష్టకన్యల పెండ్లాడరాదని మనువు ఋషుల సిద్ధాంతము. పై దివ్యదృష్టి గల్గనివారును, నమ్మని నాస్తికజనులు, ప్రత్యక్షముగాగన్పడు సూర్యునిగాను, పూర్ణచంద్రునిగాను భర్తను చూడనేర్వవలెను. అదియు చేత కానివారు సూర్యునితోగాని చంద్రునితోగాని కలిసియున్నట్లు భర్తను చూడవలెను. దాన సూర్యునివంటి, చంద్రునివంటి ప్రకాశవంతులగు సత్సంతతిగల్గును. అదియు చేతగానివారు భర్తను యే యితరతలంపులులేక చూడవలయును. భర్తవంటి సాధువైనను పుట్టును. గాన పుట్టినవానికి యీ సత్సంతతిగను మార్గమును తెలియజెప్పవలెను. పూర్వులు గంగను భూమికి తేలేకపోయినను తపస్సుచేసి తమ అనుభవములను పుత్రునికి చెప్పెడివారు. యిట్లు అయిదారుగురు గతించినతరువాత వారి అనుభవములబట్టి భగీరథుడు గంగను భూలోకానికి తెచ్చెను. అట్లే యీదివ్యదృష్టి తామభ్యసింపలేకున్నను పిల్లలకుచెప్పుచు వచ్చిన భగీరథుడు గంగనువలె గొప్పసంతానమును గన గల్గుదురు. దాన 21 తరములవారు తరింతురు.

—: అసుర, గాంధర్వ రాక్షస పైశాచిక వివాహములు నాలుగు :—

అ అసురాదులవలె భార్యా భర్తలు తమ్ముగ్మచూచు కొనుచు సంయోగముచేసిన అట్టివారు పుట్టుదురు. లేక జ్ఞాతులకు కన్యకకు ధనమిచ్చి లేక కన్యను కొని పెండ్లా డుట ఆసురము. యిందు భార్యయందు గౌరవముండక అవ మానకరముగ భార్య నడచుటచే అట్టి అవమానము పొంది యున్న స్త్రీని పొందిన దుష్టసంతతి గల్గును.

గాంధర్వము:— స్త్రీపురుషులిరువురు ప్రేమించుకొని కలయుట గాంధర్వము. యీవివాహము దుష్యంతుడు శకుంతల చేసికొనిరి. దుష్యంతుని దరికి కొడుకుతో శకుంతల వెళ్ళగా సాక్షులు లేకుండుటచే భార్యగా దుష్యంతుడంగీకరించలేదు. ఆమె పతివ్రత యగుటచే ఆకాశవాణి యీకుర్రవాడు నీపుత్రుడు, యీమె నీభార్య యని చెప్పినది. అది నిజమేనని అంగీకరించెను. సాక్షులులేని వివాహము వివాహముగాదని నిర్ణయమైనది. భర్తను తాను స్వయంవరమున జెంది తండ్రి అన్న మొదలగువారితో బంధువులమధ్య కన్యాదానము చేయబడిన మరల రెండవభర్త రాదు.

ఉదాహరణ:—రాముడు సీత. గాన యీగాంధర్వ వివాహము పశ్చిమదేశ గృహస్థులలో ఎక్కువగుటచే గృహాశ్రమము స్థిరములేక ఆశ్రమసుఖముబడయలేక విడాకులచట్టమున బడుచున్నారు. వారికి భారతదేశ స్థిర గృహాశ్రమధర్మబోధన భారతీయులు చేసిన స్థిరగృహాశ్రమమున వారును సౌఖ్యపడుదురు. వారినిచూచి భారతీయులు గాంధర్వ వివాహము మొదలుపెట్టిన ఫలమింతియేగదా. భారత వివాహము జీవితాంతమువరకు భార్యాభర్తలు మిత్రతతో మెలంగుటయు అంతమున యితరలోకాల కలసి సుఖించుటయు గలదు. స్వర్గము మొదలు కైలాసమువరకు వారిద్దరు కలసి మెలగుట గలదు.

—: రాక్షస వివాహము :—

కన్యబంధువుల సమ్మతి లేకున్న, వారిని చంపగా చీల్చగా కన్య యేడ్చుచున్నను బలాత్కారముగా తెచ్చి పెండ్లాడుట రాక్షసము. గాంధర్వ రాక్షసములు రాజులకుప యోగమనిరి గాని అవతారపురుషుడు తనపై అనురాగముగల రుక్మిణిని రాక్షసవివాహమాడి సుఖించెను. అత్తవారింటికి కృష్ణుడు మరల పోలేదు. భీష్ముడు తనకనురాగములేని కన్యల దెచ్చి తమ్ములకు వివాహముచేసి సౌఖ్యపడలేదు. తుదకు భీష్ముని ప్రాణము హరింప సాయపడెను. యీ గాంధర్వ రాక్షసములు రాజులకూ లాభము గాన్పింపదు, యిక సామాన్యులకు నెట్టిలాభము నుండదని మనువు మొదటనే గ్రహించినాడు—

పి శా చ వి వా హ ము:— నిద్రించుదానిని, కైపులో నున్నదానిని, యేమరపాటు నున్నదానిని బలాత్కారముగా క్రీడించుట పైశాచిక వివాహము. యీవివాహము మహా రాజులకుగూడా లాభముండదు. యీ దుష్టవివాహముల పుట్టిన సంతానము క్రూరులు, అసత్యవాదులు, ధర్మమార్గ విరోధులు నగుదురు. అనిందిత వివాహముల సత్సంతాన మును, నిందిత వివాహముల నిందాయుక్తసంతానము గల్గును. పాణిగ్రహణము భార్యాభర్తలకు పడమరదేశీయులు మిత్రత యని దెల్పు "షేక్ హేండు" వంటిది. కౌగిలి పూర్ణస్నేహము చూపునది. నిషేకములో కౌగిలి యుండుటచే పూర్ణస్నేహ

మగును. పై రాక్షసాది వివాహములు భారతమున జరుగుట అరుదుగానున్నవి. వివాహముల విశేష ధనవ్యయము చేయు చున్నారు గాని నేనుచెప్పిన దివ్యదృష్టి పుత్రపుత్రికలచే అభ్యా సము చేయించి బ్రహ్మాది వివాహముల చేయుటలేదు. యీ దృష్టివలన భార్యాభర్తలొకరికొకరు వశ్యులగుదురు. మరియు పుణ్యావృద్ధియగును. గాని సినీమాలు చూచినందున గల్లు నేత్ర రోగాలు యీ దివ్యదృష్టి చూచువారికి రావు. వ్యభిచారిణి యగు స్త్రీ దేవుని, యింద్రాది దేవతలపై ప్రేమగలదిగాక పరమనుష్యులపై యెక్కువ ప్రేమగల్గిన కాలాన గర్భధారిణి యైన అట్టిరూపముగల పుత్రుని, కూడకయే గనుచున్నది. దాని వ్యభిచారము అందరికి తెలియునటుల చేసికొనుచున్నది. దాన దుష్టస్త్రీ యనబడుచున్నది. స్త్రీలకు భర్త దేవుడని ఋషులునిర్ణయించుట జూడ ఋతుకాలాన యెక్కువకామము గల రాత్రులందు భర్తను దేవునిగాగాని యింద్రాది దేవత లలో నొకనినిగాగాని, కశ్యపాది ప్రజాపతిగగాని, బ్రహ్మర్షిగ గాని యెక్కువ ప్రేమతోచూచుచు సంయోగముచేసిన దాన గర్భధారణయైనవారు చూచిన వారివంటి పురుషుని గనును. పుట్టనిచో వారిదృష్టి అభ్యాసము సిద్ధిగాలేదని గ్రహింపదగునే గాని పై వ్యభిచారిణి గుఱ్ఱములు, ఆవులు తమదృష్టిలో గల వాటి రూపధారుల గనుచుండ యీదృష్టిఫలము జరుగదనుట అసత్యమనదగును.

ఉ దా హ ర ణ ము:—భాగవతము—10 వ స్కంధం.

ఉ॥ ఆవసుదేవుడంత తనయం దక్షరాత్మక మాత్మభూతమున్
భావనరేఖమున్ భువన భద్రమునై వెలుగొందుచున్న ఆ
శ్రీ విభు తేజ మచ్చుపడజేర్చిన దాల్చిన లీల కాంతితో
దేవకియొప్పె పూర్వయగుదిక్సతి చంద్రునిదాల్చ్యకై వడిన్.

వసుదేవుడు తనయందు విష్ణువుచేర్చి సంయోగయజ్ఞము నేయ తన్ను భర్తను విష్ణువుగాజూచుచు దేవకి ఆ తేజస్సును గర్భముదాల్చి అవతారపురుషుడగు కృష్ణుని గనెను.

మ. ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై
కంటిమందురుగాని నిక్కము గానరీ భవదాకృతిన్
కంటిభద్రముకంటి మాంసపుకన్నులన్ గనబోలదీ
తొంటిరూపు తొలంగబెట్టుము తోయజేక్షణ మ్రొక్కెదన్.

యోగీశ్వరులుచూచు దివ్యదృష్టి నిజమగునా నేను నిన్ను సంయోగయజ్ఞమున చూచినదృష్టి సత్యమగును. అంతయు చూచిన విష్ణ్వాకారముశక్తితోగూడ మాంసపు కన్నులతో చూడరానిది. అయిననూ కష్టపడి అభ్యసించి నిన్ను పుత్ర రూపమునగంటిని. శుభములందితినని దేవకి పుత్రునిచూచి సంతోషించెను.

వామనావతారము:—భాగవతము.

క. నీ రమణుని సేవింపుచు
నారూపము మానసించి నళినీ గర్భా
గారంబువచ్చి జొచ్చెద
గారాబున పెంపవమ్మ కరుణన్ నన్నున్.

నేను విష్ణుఅండములోనుందును. అదితీ, నీవు నీభర్తను నావలెచూచి పొందిన బ్రహ్మాండమునకువచ్చి నీకుపుత్రుడనగు దును అని విష్ణువుచెప్పినట్లుచేయ వామనుడుపుట్టెను. వేదముల లోవివరముగలేని యీఅనుభవము వ్యాసుడు భూలోకగృహస్థు లకు తెలియపరచుట భారతభూమికిగాని భూలోకమునకుగాని అతడుచేసిన జగత్కల్యాణము మరువరానిది. నోటచెప్ప నలవి గాని ఫలముగలది. యేకాలమున ఆసురీసంపద వృద్ధియైన ఆకాలసద్గృహస్థులు అవతారమూర్తిని రప్పించుమార్గము వ్యాసులుచెప్పిన శ్లోకవియు యేభాషను యిప్పటికి 4000 ఏండ్ల నుండి యిట్టి మహాత్తర సృష్టిమార్గము వెల్లడించి యుండలేదు. దేవునికృపచే నాకు మహాత్తరసృష్టిమార్గము తెలిసినదంతయూ నేను పొందకున్ననూ కుంచెడుబియ్యము సంపాదించు పిల్లల గృహస్థుడు పోలడే తనకుదక్కనట్లు ఆడపిల్లలు నాకు గల్గుచు మగపిల్లలు నాకు పుట్టని కాలాన మగపిల్లలు పుట్టు శాస్త్రీయ మార్గము నభ్యసించి మగపిల్లల గనగల్గితిని. యీకొద్ది అను భవము నేనుపొంది గొప్పసంతతికై ప్రయత్నించిన సంతానము గనుట ఆగిపోయెను. చావ అర్థమైన సృష్టిమార్గములన్నిటిని లోకకల్యాణమునకు పశులకుదెల్పిన వారివల్లనైనా గొప్ప ఘనపతివృద్ధియై జగత్కల్యాణమగునను తలంపుతోనే బాల్యము నుండితము వేమ కవినియమునటచే పద్యరూపమునవ్రాసిన ప్రస్తు తము వాడు విపరీతార్థములు దీతురని వచనరూపముగా తేలిక భాషలో గ్రంథముగావ్రాసి భూలోకగృహస్థుల కందజేసితిని.

దీని సత్యము పరీక్షజేసి తత్ఫలము భూలోక గృహస్థులందరు పొందుదురుగాక.

మ ను స్మృ తి:— 10 అధ్యాయము. "కలిః ప్రసుప్తో భవతి" అనగా సత్యధర్మమార్గములు భగవద్దృష్టివిడిచి పరాప కారముచేయుచు పశుపక్షి జంతు దుష్టమనుష్యుల ప్రేమించుచు అన్యాయమార్గమున ధనార్జనచేయుచు జీవించుకాలమే కలి యుగము. దీన ఆసురీసంపద వృద్ధియగుటకు కారణమైనది. కృతయుగమన సత్యధర్మమార్గములు యితరులు నడచు చున్నారా లేదా అని విచారణవిడిచి తానుమాత్రము నడ చుచు ప్రతివస్తువును భగవద్దృష్టితో మెలగుటమరియుసంయోగ యజ్ఞమున భగవంతుని యింద్రాదిదేవతల ప్రజాపతుల ఋషుల, దుర్గ, లక్ష్మి, సరస్వతి, అరుంధతి, మొదలగువారల చూచుచు వారివంటి సత్సంతతిగల్గుకాలము కృతయుగ మన బడును. భూలోకమున పైనాల్గు వివాహముల కృష్ణార్జునుల కశ్యప విశ్వామిత్రులవంటి మహాత్ములు వృద్ధియైన భూలోక వైకుంఠమగును. యిట్టివారు జగన్నాశముచేయు చక్రా ద్యాయుధములున్నను అవి దుష్టులయందే ఉపయోగింతురు. సాధువులకు సాయముచేతురు. మహర్షులుశక్తి తమయం దున్నను సాధువులగు రాజులకు అట్టి యితఋలకు సత్యధర్మ వేదాంతాది మార్గములు బోధించుచు బలీయమగు సత్సంతతి గనుసృష్టిమార్గము వెల్లడించి వారిచే అట్టిమహాత్ములగు రాజాధి రాజుల గనిపించుచు అతిదుష్టుల శపించుచు కాలముగడిపి యిహాపరముల సుఖపడిరి.

—: గొప్ప స్త్రీలను పురుషులను గనుట :—

శోణితము వృద్ధిగాయున్న భార్యయందు ఆహారము తక్కువతిని శుక్రము తక్కువగల భర్త ఋతుకాలమున లక్ష్మి దుర్గ సరస్వతి సావిత్రి మొదలగు మహాత్మురాండ్రను పురాణాదులలో ఋషులచే వర్ణింపబడిన ఒకరూపమునే తప్ప ఇతర రూపముల చూడక తలంపక అతికాలముగల్గినపుడు సంయోగ యజ్ఞముచేయ గర్భధారణమైనచో దుర్గాదులువంటి సాధ్వీ జనవృద్ధియై భూలోకము వైకుంఠకైలాస బ్రహ్మలోకములవలె ప్రకాశించును. శుక్రాభివృద్ధి గల పురుషుడు ఆహారము తక్కువతిని శోణితము తక్కువగు భార్యను భగపం కుని, యిందాదులను ఋతుకాలాన భార్యకు అతికామము గల్గు సమయాన యితరము తలంపక చూడక సంయోగ యజ్ఞముచేయ గర్భధారణమైనచో రామాద్యవతార పురుషులు యింద్రాదులు జన్మింతురు.

దేవతలజూచినచో దేవతలు మానవులుగా జనింతురు. వారినే భూదేవతలందురు. వీరు శృతిస్మృతి పురాణాది సత్య ధర్మమార్గముల సత్కామములతో చరించి యితరులకు బోధించుచు ఎపుడు వర్షముకోరితె అపుడు వర్షముకురిపించుచు ఉల్కాపాతాది దోషనివారణచేయుచు రాజ్యమేలు సాధురాజులకు సహకారిగా నుందురు.

భారతము — అరణ్యపర్వము:— మద్రదేశపురాజు సావిత్రీదేవిని 18 యేండ్లు అర్చించగా ప్రత్యక్షమైన, పుత్రుని

గోరెను. దాన ఆమె నీకు స్త్రీ పుట్టును. ఆమె తర్వాతనూర్గురు పుత్రులు పుట్టుదురు అని చెప్పిపోయెను. ఆ రాజును భర్త చెప్పుటచే భార్యయు సావిత్రి యందెక్కుడు ప్రేమగలవారగుటచే ఆమెను నిరతము సర్వత్రజూచు శక్తిగలవారై యుండిరి. ఆదృష్టియే సంయోగయజ్ఞమున గల్గియుండవచ్చును. దాన గర్భధారణమై పరమేశ్వరివంటి సావిత్రిపుట్టి అకాలమృత్యువుగల భర్తకు యముని కృపపొంది పూర్ణాయువు, రాజ్యము, అత్తమామలకు కండ్లు (నేత్రదృష్టి), తండ్రికి నూర్గురు పుత్రులు గల్గునట్లు చేయగల్గినది. గాన దుష్టులు బలహీనులగు కన్యల గని కన్యాదానముచేయు ఫలముచే తండ్రి అల్లుండ్ర కుటుంబములకు నష్టముగల్గించునట్లుండ రెరింగినదే గదా! ఓ గృహస్థులారా! యేల యీదుష్టులు బలహీనులునన్మార్గులగు స్త్రీపురుషుల గనుట. వారివలన నానాబాధలుపడుట, దాన యీ దుష్టస్త్రీపురుషుల యీ లోకానకు సృష్టిలోనే రాకుండా చేయుచు సత్య ధర్మమార్గములపై నడువ ఆరంభింపుడు. గొప్ప పతివ్రతలయినను దుష్టకాల సంయోగమునను, గర్భధారణకాలమునను అసూయాది దుర్గుణములు గల్గియున్న బలవంతులగు దుష్టులుపుట్టుదురు. కైకేసి, రావణ, కుంభకర్ణుల, గాంధారి, సుయోధనాదుల గనిరి. సృష్టి స్థితిలయములలో సృష్టి చాలబవత్తరమైనది. స్వల్పకాలములో మంచిమార్గము తప్పినచో తత్ఫలము వెంటనే గల్గును. స్థితిలో [illegible] గల్గక ఆలస్యమున ఫలించును. లయమున,

యీ జన్మాంతమున ఫలించును. అది గోచరముగాదు. సృష్టి స్థితులు రెండును యీ జన్మమున ప్రత్యక్షఫలమిడును.

—: జా త క ము :—

జీవుని ప్రారబ్ధఫలము చెప్పు గొప్పదియగు జ్యోతిశ్శాస్త్రభాగము. దీనిని అల్పులు, మందబుద్ధులగు హీనులు చదివి దీని గొప్పతనము చెడగొట్టుచున్నారు. జ్యోతిస్సన, వెలుతురు. గాన యీశాస్త్రఫలము ప్రత్యక్షమగు చుండును. యిది చీకటి శాస్త్రముగాదు. ప్రత్యక్షముగానిచో చెప్పువానిది తప్పనదగుగాని, శాస్త్రము తప్పనరాదు. ఎపుడును హీనులు, అల్పులు, మందబుద్ధులు, దుష్టులు అగువారు సత్యధర్మములనున్నను త్వరలో మంచిఫలము గల్గదు. వీరందరు యోగభంగ జాతకులై యుందురు. దాన చెడుఫలము లెక్కుడు గల్గుచుండును. అయినను వాటిని లెక్కచేయక సత్య ధర్మములనున్న కొలది శాంతి యీ సత్యధర్మములవలన గల్గును. ప్రారబ్ధము తమది బలహీనమగుటయు, పురుష ప్రయత్నము దానివి గెంటునంత పూర్ణధర్మమార్గము నడువకయే యీ శాస్త్రఫలము సత్య ధర్మమార్గములు సరియైనవి గావని చాటుదురు. దాన వారును, వారు బోధించినవారును సత్య ధర్మమార్గముల విడుతురు.

ఉదాహరణ:— దుర్యోధనుడు సృష్టిలో పూర్ణ దుష్టుడు. యితడు గురువు తల్లిదండ్రులమాట వినక నిత్య భయము, మోహము, దుఃఖావమానముల బొందుచు సాధ్యపకా

రము నిహేతుకముగ చేయుచు తుదకు తనతో అనేకులను నశింపజేసెను. గాన యిట్టి దుష్టుల సృష్టించరాదని జూపుటకే రామాయణ, భారతములు వ్రాయబడినవి. రాజ్యములేని వాడును, మహాపాతకములు చేసినవాడును అగు వాల్మీకి గృహస్థుడు నారదునిముందర యితరసహాయము దుర్యోధనుని వలె లేనివాడగుట ఆపాపమునకు భయపడి నారదుడు చెప్పి నట్లుచేసి బ్రహ్మర్షియయ్యె. పూర్ణదుష్టుడు మహాపాతకముల చేయుచుండును. మధ్యముడు- ఉపపాపములన, గోవధాదులు చేయును. అధముడు- సంకరీకరణపాపములన, మేకలు మొదలగువానిని జంపుట చేయును. అధమాధమపాపియన- మలినీకరణపాపములన, చెట్లనుగొట్టుట మొదలగునవి చేయును. మధ్యమాదిపాపులు- గురు జననీజనక సద్బోధలచే మంచివారై అంటుమామిడిచెట్లవలె కొంతకాలము ప్రకాశించి పోవుదురు. మధ్యమాదిపాపులు- పుణ్యులజేరిన పుణ్యులును, పాపులజేరిన పాపులును అగుదురు. మహాపాపులును భగవంతునిగాని, నారదాది బ్రహ్మర్షులగాని పూజించిన తరింపగలరు. పూర్ణ పాపులకీబుద్ధి గల్గుటరుదు.

ఉ దా హ ర ణ :— సుయోధనాదులు— పూర్ణ సత్కామ కర్మిష్టులు, పూర్ణపుణ్యులు. పై రీతి వీరికి తగ్గిన వారు మధ్యమపుణ్యులు. అట్లే అధమ అధమాధమపుణ్యులని గ్రహించునది. యీ పుణ్యామార్గములోని మధ్యమాదులు పుణ్యులజేరిన పుణ్యులు, పాపులనుచేరిన పాపులును అగుదురు.

దేవతలకుగాని, దేవునికిగాని నివేదింపబడని అన్నము నీళ్ళు త్రాగుట, పాపక్షేత్రసంచారము పాపమిడును. అట్లే దేవత లకుగాని, దేవునికిగాని నివేదించు అన్నము నీళ్ళు త్రాగుట పుణ్యక్షేత్రసంచారము పుణ్యమిడును. సంధ్యావందనాది జప ములచే పాపములుపోయి పుణ్యముమాత్రము గల్గును. యివి నరక స్వర్గ మార్గములు. మహాపాపాదిపాపములు చేయుట మాని పుణ్యపుకర్మములు చేయుచు తత్ఫలము బాల్యమున పుత్రుడు సంపాదించు ధనమును తండ్రికిచ్చునటుల సర్వాజనకు డగు యీశ్వరార్పణ చేయుచున్న కొంతకాలమునకు పుత్రుడు తండ్రిఆస్తిపై పెత్తనము చేయునట్లు యీశ్వరశక్తి గలిగి కొంతకాలమునకు మానవుడు భగవంతునివలె సృష్టిస్థితిలయ ములచేయు శక్తిగల బ్రహ్మర్షి యగును.

అన్నము నీళ్ళు లేనిచో శరీరముండదని, పరిశుద్ధక్షేత్ర మున పండిన కూరగాయలు, ధాన్యాదులను తినుచు, సూర్యు డుండగా కురిసిన వర్షజలము, అగస్త్య దుదయించిన తర్వాత కురిసిన వర్షోదకము, గంగోదకము, పాతాళగంగ, బట్టీపట్టిన నీరు యివి పరిశుద్ధజలములు. వీటిని త్రాగుచు ఆహారజలముల భగవన్నివేదనముజేసి ఋషిగృహస్థులు ధీరోగులై బ్రహ్మర్షి త్వము చెందిరి.

రెండవరకము :— వదులు మొదలగువాటి నీళ్ళు, మంచిచోటపండిన ఆహారమును భగవన్నివేదనము చేసి ఋషిగృహస్థులపై వారికన్న యెక్కువకాలము తపస్సు

చేసి బ్రహ్మర్షిత్వము గాంచిరి. పరిశుద్ధాహారమున భూభాగ మగు దేహము, జలముచే రక్తము పరిశుద్ధమై స్థూలశరీరము నీరోగమగును. దీన సూక్ష్మశరీరమందున్న మనస్సు కొంత శుద్ధమగును. సూక్ష్మదేహము కొంత మంచిదగును. దాన జీవునికి ఆనందదాయకమగును. గాన మానవుడు పరిశుభ్ర మగు ఆహారజలములు దేవునికి నివేదించి త్రాగుచు ఋషి మార్గముననున్న తప్పక బ్రహ్మర్షి కాగలడు. తొందరలో బ్రహ్మర్షిత్వముజెంద కొందరు పండ్లు, ఆకులను, కొందరు నీళ్ళను భక్షించిరిగాని సత్సంతానముగను కాలమున అన్నము నీళ్ళతోనే చాలమంది గృహస్థులు శరీరమును పోషించిరి. జలవాయుభక్షకులకు శుక్రాభివృద్ధి యెక్కువగల్గదు. దాన వారికి సంతానాభివృద్ధి యెక్కువ గలుగదని నాయూహ. అన్నము పండ్లు తినువారికి శుక్రాభివృద్ధి కలిగి సత్సంతతి వృద్ధియగును. మొత్తమున భూలోకమున మానవసృష్టి బల వత్తరమయినది. యిందు జీవుడు, తలిదండ్రులుచేయు నిష్కామ కర్మములు, సత్కామకర్మములు, దుష్కామకర్మములే ప్రార బ్ధము లనబడును. ప్రారబ్ధము అగోచరముగానుండి ప్రతి దేహధారిని శుభాశుభము లనుభవింపజేయునది. అనగా మానవునికి తెలియకుండా పైబడునది. యిది జ్యోతిశ్శాస్త్ర మున బలీయమగు జాతకభాగపండితులచే (అనుభవజ్ఞులదరి చదివినవారుగాని, అనుభవము చెందినవారుగాని దీని ఫలా ఫలములు చెప్పగలరు.) మాత్రము తెలియును. చెడుప్రార

బ్దము ననుభవింపదగునేగాని సాధారణముగా తక్కువజాత కుని రాజయోగజాతకునిగా మార్చుట చాలాకష్టము. భగవ జ్జపాదులచే చెడు ప్రారబ్దము శాంతిచెందునుగాని రాజయోగ ఫలమివ్వదు. జాతకమున యెంతెంత యోగములు గలవో అంతంతయే ఫలమిడును.

భగవజ్జపాదులచే మంచికాలము మరింతయోగముగ నడచును. చెడుకాలమున అపకారములు, అవమానములు, రాకుండ రాజుమొదలు హీనునివరకు, తమతమస్థితులలో జరుగుచుండును. బలహీనజాతకుడు రాజర్షి, ఋషి, మహర్షి, యైనచో వాని సంకల్పములన్నియు నెరవేరుచుండును. రాజా దులు పూజించుచుందురు. అతడూరుకొని కూర్చున్నను మామూలు జాతకఫలములుగల్గుచు అందు చెడుమాత్రమివ్వక నిత్యానందముతో బ్రహ్మానందముగ కాలము గడుపుచుండు. ఉ॥ ఋషులు చాలమంది బలహీనజాతకులు. ఆకుటిండ్లకాపురము. జలాన్నాదుల భక్షణలతో నిత్యానందముతో నుండువారు. కావలెనన్న సంకల్పసిద్ధులై రాజపూజ్యులుగ నుండెడివారు, బ్రహ్మర్షి, రాజఋష్యాదులకన్న చాల బలవంతుడు, భగవత్స ముడు. యితనికి ధనదరిద్రములు రెండు నిత్యానందముగ జరుగుచుండును. బలహీనజాతకులు యీరాజఋష్యాది సిద్ధు లగుట చాలకష్టముగాన ఋతుకాలాన తలిదండ్రులును గర్భ ధారణ కాలమంతయు తల్లి ప్రహ్లాదునితల్లి లీలావతివలె ఋషి మార్గమున నిష్కామ సన్మార్గముననడిచిన మహాపుణ్యమూర్తు

లగు బాలబాలికలుం వృద్ధిచెందుదురు. కనుటలో తలిదండ్రులు హీనులుగాగని పిల్లలను మీరు గొప్పవారుకండని విద్యాదులు చెప్పించినను రాక రాజపుత్రులయ్యినను హీనులగుదురు. గాని గొప్పవారుగారు. దీనికిమించినమార్గము గానరాదు. అందువనే మనుస్మృతిః—

2 అధ్యాయం:—'ఆచార్యాణాంశతంపితా,సహస్రంతు పితౄన్మాత గౌరవేణాతిరిచ్యతే' నూర్గురు గురువులకన్న తండ్రి అధికుడు, వెయ్యితండ్రులకన్న తల్లి గొప్పది. డిటో॥ "ఇమంలోకం మాతృభక్త్యా పితృభక్త్యాతుమధ్యమం గురు శుశ్రూషణా త్వేవ బ్రహ్మలోకం సమస్నుతే" భూలోకసుఖము తల్లివలన, స్వర్గసుఖము తండ్రివలన, బ్రహ్మర్షిసిద్ధి గురుని వలననుగల్గును. దుష్టులగు తలిదండ్రి గురువులచే మూడును చెడును. సాధ్వియగుతల్లి గర్భధారణకాలమంతయు నిష్కామ సన్మార్గమున భగవజ్జపాదులచే నడచుటచే పుట్టుకతోనే గొప్ప రాజయోగముగలవాడై ప్రహ్లాదునివలె సౌఖ్యపడును. సాధు మార్గ జనకునిచే స్వర్గప్రాప్తి యిద్దరివలన యీలోక ఆలోక సుఖములు గలవాడగును. నిష్కామసన్మార్గ వర్తనుడగు గురుని దయచే అతను చెప్పినట్లునడచిన బలహీనుడయినను కొంత ఆలస్యముగాను, సాధువయిన తొందరలోనూ బ్రహ్మర్షిత్వము చెంది నిత్యానందుడై సర్వలోక సుఖములగాంచి తుదకు కైవల్యముచెందును. సామాన్యముగా గనబడిన పుత్రునికి తల్లితండ్రి భక్తిగలిగియున్న ఆతనివలన తలిదండ్రులకు వారి

వలన పుత్రునకు సామాన్యసుఖము ఇహపరమున గల్గును. గాని ఎక్కువగల్గదు. ఆ తలిదండ్రులే నిష్కామసన్మార్గస్థులై పై రీతి గొప్పకాల సంయోగయజ్ఞమున సృష్టించిన పుత్రునకు తామే గురువులై లేక నిష్కామ సన్మార్గవర్తియగు ఋషిగురువై యితరవిద్యలు నేర్పి బ్రహ్మవిద్యాభ్యాసము చేయించిన తొందరగా బ్రహ్మర్షిగామారి తలిదండ్రులకు పితరులకు, స్నేహితులకు, గురువులకు, జగమునకు సర్వసుఖము ఇడువాడగును. తలిదండ్రులు సామాన్యధర్ములైకన్నను నిష్కామ సన్మార్గుడగు గురుదయచే మానవుడు స్వర్గముగాని బ్రహ్మత్వముగాని చెందగలడు.

గాన వీరిముగ్గురిని దేవునిగాజూచి పూజించుట మహాతపమనియు, అతడేతపస్వి, ఋషియగుననియు, అతడే సర్వసౌఖ్యములు బడయుననియు పూర్వము సర్వర్షులు తమతమ గ్రంథాలవ్రాసిరి. యిపుడువ్రాయువారున్న అంతే వ్రాయుదురుగాని యెక్కువ వ్రాయలేరు. మానవుని ఆధిక్యతఅంతయు వీరి ముగ్గురిలోనేయున్నది. వారిదయచే పుత్రపుత్రికా రూపముల పుట్టినవారిది భాగ్యరేఖయే. వారి అధర్మమార్గముల పుట్టిన పుత్రపుత్రికలదే అభాగ్యరేఖయగును. యింతకన్న రెండవమార్గములేదు. యింతకన్న రెండవమార్గములేదు.

—: రాజ్యాధికారులవల్ల, బ్రాహ్మణులవల్ల జగన్నాశనమగునా :—

కలియుగాన బ్రహ్మర్షిత్వసిద్ధిచెందిన పురుషులు అక్కడక్కడ నుండగలరు. కాశీ, హరిద్వారాది పుణ్యక్షేత్రముల

యందును, దుష్టులు బ్రహ్మర్షులవలె నటించుచు గృహస్థులగు స్త్రీపురుషుల ద్రవ్యాదులు సంపాదించుచు లేక సన్యాసి వేష ధారులై సకలభోగభాగ్యము లనుభవించుచు నుండువారెక్కు డగుటయే కలియుగము. ఋషులు దుష్టులశాపవాక్యములచే నశింపజేసి సన్మార్గులకు సహాయముచేతురు. గాని సన్మార్గుల నశింపచేయరు. పూర్వము భారతయుద్ధవీరులు ఒకానొక చోట జేరి (అనగా పట్టణముల పల్లెలవారికెట్టి అపకారము చేయలేదు), ఒకరినొకరు దేవునిగా జూచుచు ప్రాణములు వీడి స్వర్గాదులందిరి. జయించినవారికి రాజ్యము గల్గెడిది.

గీత 8 అధ్యాయంలో 'శ్లో:- దేనిని స్మరించుచుచూచుచు ప్రాణముల మానవుడు విడుచునో అట్టి రూపము చెందును'. 7 శ్లో. 'తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మరయుద్ధ్యచ మయ్యర్పిత మనోబుద్ధిర్మామే వైష్య స్యసంశయః.' గాన అన్ని కాల ములందు నన్నుస్మరించుచు చూచుచు యుద్ధముచేయదగును. నాయందే స్మరణదృష్టి కుదిరిన నన్నే చెందెదవు. గాన యుద్ధములందున యీ దివ్యదృష్టి వుపయోగించి యుద్ధము జేసిరి. దాన జయమున యిహపరసుఖములు ఓటమిని పర సుఖమును చెందిరి. యీ దివ్యదృష్టి లేని యుద్ధములు మహా పాపకరములై ఆ యుద్ధముచేయు దేశజులకు నానావిధదుఃఖ ములు నిత్యమిడుచుండును. దివ్యదృష్టి కలవారైనను సామ ముగా కలహములు పరిష్కరించుకొనునది. యిది సాధుజనుల లక్షణము. యీ సామము యిద్దరు సాధులైన యేదో రీతిగా అంగీకరించి యుద్ధములు మానుదురు.

దానము:— ఒకరు దుష్టులు ఒకరు సాధువులైన సామము కుదురదు. అపుడు దుష్టునకు ఆస్తిలో యెక్కువ భాగమొసగి సాధువగువాడు యుద్ధము మానదగినది. దానను కుదరకున్న అతనికి అతని స్నేహితులకు భేదముచేసి యుద్ధము మానదగినది. దానను లాభములేకున్న తన ప్రాణములు దీయ నుద్యమించియున్న దుష్టులతో మాత్రము భగవంతుని స్మరించుచు చూచుచు రాజు యుద్ధముచేయదగు నదిగాని, పట్టణముల పల్లెలవాసుల కెట్టి అపకారము చేయరాదు.

ఉదా:— భారతమను గ్రంథము—యుద్ధనీతి, గృహస్థ నీతి, రాజనీతి, మొదలగు నీతులతో నిండించి అనుభవముగా వ్రాసినది. నేడట్లాచరించిన ఆ ఫలమేగల్గును.

యిందు పాండవులు సాధువులు. దుర్యోధనాదులు దుష్టులు. వీరికి యుద్ధము గల్గుతరి మొదట సామముగా రాయబారి సంజయుని పంపిరి. మారాజ్యము మా కివ్వుమ నిరి. యివ్వనిచో 5 వూళ్లు యిచ్చి మారాజ్యము తీసికొమ్మ నిరి.

కారణము:— పాండవులు జీవించియున్న రాజ్య ముకన్నా బ్రహ్మర్షిత్వము గొప్పది. రాజులచే పూజింప బడునది. దానిని సాధించుట గొప్పది. యీ బంధువుల జ్ఞాతుల, పరుల చంపుట మంచిదిగాదని యుద్ధమునకు భయప డియే అట్లు చేసిరి. అనగా సామదానములు చేసిరి. దానిని దుర్యోధనుడంగీకరించలేదు. అతని వుద్దేశ్యము, యుద్ధములో

వీరిని చంపిన నిత్యసుఖము గల్గునని వూహించెను. మరల పాండవులు దేవుడగు కృష్ణుని రాయబారిగా పంపిరి. అతను చెప్పినను దుర్యోధనుడు వినలేదు. అపుడు కృష్ణుడు పాండవులకు రాజ్య భ్రాంతిలేదని యెరింగినవాడగుట, దుర్యోధనుని స్నేహితుడగు కర్ణునికి రాజ్యమిచ్చి, తాను పాండవులు, వారి పక్షస్థులు కర్ణునిచే అవమానము గల్గినను క్రోధము మాని సాధ్వియగు ద్రౌపదియు ఇతరులగు అంతఃపుర రాజకాంతలు రాజకన్యలు ఉదయము మొదలు 6 వ ముహూర్తమగునదియు శుభమిడునదియు నగు 'జలముహూర్త' కాలమున పట్టాభిషేకము చేతుమని కృష్ణుడు చెప్పి భేదించెను. దానికి కర్ణుడంగీకరించలేదు. అపుడు వీరు సంపూర్ణ దుష్టులని నిర్ణయించి యితర పట్టణ గ్రామవాసుల కెట్టి అపకారము రాకుండా కురుక్షేత్రమను భూమిని యుద్ధమున ఆ దుష్టుల బరిమార్చి పాండవులు ఇహాపరసుఖముల బడసిరి. భారతయుద్ధమునందెన్నో ధర్మ నిర్ణయములు గలవు. భారతీయులకు పూర్వమునుండియు సామదానములతో కలహములు బాపుకొని యుద్ధములు రాజులు మానిరి. గాని నిష్కారణముగా అధర్మముగా తమ్ము జంపి రాజ్యము హరింపజూచు దుష్టులతో మాత్రము పై రీతి ధర్మముగా యుద్ధమున జయమొ అపజయమొ పొందెడివారు. పరుల కెట్టి బాధలులేవు. అన్యాతమ్ము జంపనిశ్చయించిన రాజులతో యుద్ధము తప్పెడిదిగాదు. దీనినే భారతముగా వ్యాసుడు రచించెను.

—: పశ్చిమదేశీయ యుద్ధములు :—

ఇందు సామదాన భేదదండోపాయములలో సామదానములులేవు. భేదము, దండము జరుగుచుండును. దివ్యదృష్టి లేదు. భగవస్మరణలేదు. సాధు, అసాధువులచే గూడియున్న పట్టణగ్రామాదుల తమ్మేమియు అనని రాజ్యస్థులందరిని బాధించుట స్త్రీల పశుధనము లపహరించుట గలవి. దుష్టుల నైనను పాండవులవలె విచారణ చేసిచేసి తుదకు దుష్టులని నిర్ణయించినతరువాత వారినిమాత్రమే దండింపజేయదగును. రాజ్యస్థుల నేమియు ననరాదు. రాజు పరులతో యుద్ధము చేయనని కూర్చున్న దుష్టులు దండయాత్రచేసి ఆరాజ్యము హరింతురు. గాన రాజ్యమేలువానికి సాధువులందు క్షమయు, దుష్టులయందు తేజమును వుండదగును. పశ్చిమదేశ యుద్ధములు సాధు అసాధువుల నశింపజేయునవిగాన మహాపాపకరములు. వానిని ధర్మాఽధర్మములు బోధించి సాధువులగు జనులు మాన్పింపదగును. యీయుద్ధముల ప్రత్యేక దుష్టనాశనములేదు. సాధు సాధ్వీనాశనము గలదు. దాన జయించినవారు కొలదికాలములోనే గొప్ప నష్టములుగాంచి నశింతురు. యుద్ధములు దుష్టులువలన వృద్ధియగును. గాన వీరిని సృష్టించుటలోనే రానీయకుండా ప్రతిరాజ్యస్థులు కాపాడుకొన్న లోకములో యుద్ధములురావని నా దృఢాభిప్రాయము. ప్రస్తుతము గృహస్థులగు అమెరికావారివద్ద జగన్నాశనకరములగు ఆయుధములు గలవు. వారు వాటిని నిష్కామ సన్మా

ష్ఠులై దుష్టనాశనము చేయుచు సాధుసాయము చేసినచో రామకృష్ణులవలె ప్రఖ్యాతి నొందగలరు. యిహాపరసుఖములు గాంతురు. పరలోకభయము లేక హిట్లరువలె జగమంతయు నేలవలెనని సాధు అసాధు గృహస్థులనందరిని నాశనముచేయ మొదలిడిన వారిలో వారికి భేదము గలిగి అతిత్వొందరలో వినాశనమిడకమానదు. సర్వలోకపాలకుడగు భగవంతుడు గలడు. ఆతడు సర్వప్రభువు. యెట్టి ఆయుధములున్నను సర్వ మానవజాతిని నశింపచేయు మానవుడు పూర్వము పుట్టలేదు. నేడునూ పుట్టియుండడు. ముందు పుట్టడు. దుష్టయుద్ధములచే కొందరు నశించినను శేషమానవులచే వృద్ధిగాంచుచుండును. పరశురామునికన్న నశింపచేయుటలో మిన్నలగువారును, రావణునికన్న అధికులు పుట్టరు. వారే భూలోకజనులందరిని నశింపచేయలేకపోయిరి. అనగా కొందరినిమాత్రము బాధింప గల్గిరి. గాన దుష్టులు దుష్కర్మములుచేసి పరమున యిచ్చట బాధలు నొందకమానరు. గాన సర్వరాజ్యస్థులును యుద్ధము చేయక "మన్మథ యుద్ధములోనే" అనగా సృష్టిలోనే దుష్టుల రానీయకుండుటయే లోకకల్యాణదాయకము.

ప రా శ ర స్మృ తి:—

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ।
పరివ్రాట్ యోగయుక్తశ్చ రణే చాభిముఖోహతః॥

యిద్దరు పురుషులుమాత్రమే సూర్యమండలమునుండి స్వర్గవైకుంఠాదులంబోదరు. అందు ప్రాణము విడుచునప్పుడు,

సర్వమును దేవునిగాజూడగల యోగియు రాజ్యరక్షణకై దుష్టుల హరింప వారిని దేవుడుగాజూచి యుద్ధమున ప్రాణములు బాసినవాడును దేవుని చేరగలగని భావము. దుష్టులును చేరిరి.

ఉదాహరణ:— 'రామాయణము' మారీచుడు. రావణుడు చంపెదనని భయమిడ భయపడి చచ్చునపుడు దుష్టుడగు రావణుడు కన్పడిన రావణుని చేరవలయునని విధిలేక భయముతో రాముని చూచుచు రామునితో దెబ్బ తిని ప్రాణములుబాయ అతని తేజము రామునిలో చేరెను. యిట్లే శిశుపాలుడు కృష్ణునిలో చేరెను. యిట్లు దుష్టులు యుద్ధములందు కొందరు చచ్చి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుద్య పదవులలో నొకటియగు వైకుంఠలోకము జేరిరి. రావణుడంతె పొందెను. వైకుంఠలోకస్థుడైన రావణుడు మరల శిశుపాలుడై పుట్టెను. దుష్టుల వైకుంఠవాసము దుష్ట జన్మ మిడకమానదు. సాధువులకు సాధుజన్మము గల్గును. మానవుడు సాయుజ్యపదవిని జెందినచో అనగా బ్రహ్మర్షి యైనచో భగవంతుడుగా మారును. యితడొకడే మరల పుట్టినను కృష్ణునివలె నిష్కామ సన్మార్గుడై లోకకళ్యాణము చేయు ఆయాలోకముల భూలోకముల ధర్మము స్థాపించి అధర్మము నశింపజేయుచు నిత్యానందుడు, నిత్యవిజయుడు అగుచు కాలముగడుపును. గాన యుద్ధముల లాభములేదని, అవి మానవజన్మమును దరింపజేయులేవని మన గ్రంథములు

చాటుచున్నవి. గాన భూలోక ప్రతి గృహస్థుడు, ప్రతి గృహిణి బ్రహ్మర్షిత్వసిద్ధికై గొప్ప తపస్సుజేసి చెందదగునని గ్రహింపనగును.

—: మానవజన్మ లాభమేమి :—

మానవజన్మమెత్తుట యీ లోకములో సౌఖ్యముగా తినుటకుగాదు. తిని బలవంతుడై పరస్త్రీల భోగించుటకు కాదు. రాజ్యము సంపాదింపగాదు. యేవృత్తిలోనున్ననూ నిష్కామ సన్మార్గమున నడిచి బ్రహ్మత్వము చెందనైయున్నది. గాన మానవుడు రాజైననూ, సేవకుడైనను, బిచ్చగాడైనను, విచారింపక పరోపకారియై నిష్కామ సన్మార్గమున భగవజ్జపాదులు చేయుచు సర్వమును భగవద్దృష్టిచే నడచిన బ్రహ్మర్షికాగలడు. యిదియే మానవజన్మాధిక్యత.

మానవశరీరముదాల్చిన లాభము:— దుష్ట యుద్ధములలో పాల్గొనినచో బ్రహ్మరిత్వమునకై పాటుబడిన సిద్ధినిచ్చు శరీరము తృణములో నశించును. దాన లాభమేమి. ఒకవేళ ధర్మముగాజయించి చచ్చినను పాండవులవలె స్వర్గముమాత్రము చెందును. గాన ప్రతివాడు ధర్మమార్గస్థుడై సత్యాహింసాదులతో పరోపకారముచేయుచు ఆయుర్వృద్ధికరముల భుజించుచు రాజర్షి— ఋషి— మహర్షి— బ్రహ్మర్షిత్వ సిద్ధికై పాటుపడుట మేలు. దుష్టులు కొందరు పూర్వపుణ్యమున రాజ్యాధికారులై అధర్మమార్గము స్థాపింప యత్నించి నెరవేరక దుర్యోధనునివలె తొందరలో నశింతురు.

మానవుడు దుష్టసంకల్పములచే నానాకష్టములపాలై త్వరలో నశించును. మానవుడు ధర్మసంకల్పములచే నానావిధ సుఖముల యిహపరముల పొందును. యిది పరీక్షించిన వారికి త్వరగా తెలియును. గాన ప్రస్తుతము గృహస్థులే రాజులుగా పాలించుచున్నారు గాన వీరికి సత్యాహింసాది మార్గములు నడచుటే ప్రధానము. దుష్టసంతతిని గనకుండుటయు ముఖ్యమే గాన దుష్టయుద్ధములు విడిచి సన్మార్గమున శరీరమును పోషించుకొనుచు బ్రహ్మర్షిత్వము సంపాదింపదగు కాలమై యున్నది. అదివిడిచి కూడుగుడ్డలకే కాలమువినియోగించువారు ధనవంతులు, దరిద్రులు యిహ[illegible]సుఖముల కొద్దికొద్దిగా గాంచగలరు. గాన సర్వలోకపాలకుడగు భగవంతుడు మాత్రము సర్వసృష్టి, సర్వపోషణ, సర్వనాశనముచేయ శక్తిమంతుడు. తత్సమానుడు బ్రహ్మర్షిదక్క భూలోకములో మరియొకడుండడు. భగవంతుడు, ధర్మరక్షకుడు, అధర్మశిక్షకుడు. అట్లే బ్రహ్మర్షియు మెలంగును. బ్రహ్మర్షివలన అధర్మమే నశించును గాని ధర్మనాశనము గల్గదు. దాన జగత్కల్యాణమేగాని నాశనముకాదు. బ్రహ్మర్షి సత్యధర్మాహింసామార్గముల నడిచి వాటి ఫలముల జనులకు జూప శక్తిమంతుడు. అట్టి మహాపురుషుల గనుటకు గృహస్థులు పాటుపడుట పరమోత్తమ మార్గము. ఈఋషులు సత్సంతతి వృద్ధి చేయ బోధింతురు.

ఉదాహరణము:— విదర్భరాజు సంతానము లేని

వాడై దమనుడను బ్రహ్మర్షినాశ్రయించి అతని వాక్యానుసార మునడిచి దమయంతి అను పుత్రికను రాజర్షులగు పుత్రుల సృష్టించి సత్సంతతిని వృద్ధిచేసెను.

ఉ దా హ ర ణ ము:— ఋష్యశృంగుడను బ్రహ్మర్షి దశరథాదులచే రామ లక్ష్మణాది పుత్రుల సృష్టింపచేసి లోక కల్యాణము చేసెను. గాన యీ బ్రహ్మర్షులు సర్వలోక వాసులు ధర్మమార్గమున నడచుటకును యీలోకస్థులాలోకము నకు ఆలోకస్థు లీలోకమునకు రాదగిన ధర్మమార్గమును తెలు పుచు భూలోకమున రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులగు మార్గములు అన్ని జాతులవారికి తెల్పి ఆమార్గమున నడువ అంద రికి ఆజ్ఞాపించి సర్వమానవకల్యాణము చేయుదురు. అంతేగాని గర్భపాతముచేయుట పోషించలేమను భయముచేగాని ఆస్తులు తక్కువగునను భయముచేగాని సత్సంతతిగను భార్యలకు ఔష ధములిడి సంతానము లేకుండాచేయుట లేక ఆమార్గము వికటిం చిన చచ్చుట మొదలగు అధర్మమార్గములు బోధింపరు. ఆయా లోకములనుండి బ్రహ్మర్షిత్వము చెందుటకు అనేకులు యీ లోకమునకు వచ్చుచున్నట్లు గీతాదిగ్రంథములు చెప్పుచున్నవి. అట్టివారిని రాకుండాచేయుట అధర్మముగాదా? దుష్టసంతతిని రాకుండాచేయుట ధర్మము. అట్లు చేయలేక స్వలాభమునకై మంచివారిని రానీయక దుష్టసంతతిని మాత్రము వృద్ధిచేయు గృహస్థుడు గృహస్థుడేనా?

—: వివాహమైనతర్వాత నిషేకము చేతురు :—

"ని షే క మ హి మ:— అన లోకకల్యాణ కర్మమగు మన్మథయుద్ధ ప్రారంభకర్మ మహిమ. జననాశన కరమగు దుష్టయుద్ధములు, దుష్టసంతతి వృద్ధికై దుష్కాల మన్మథ యుద్ధము చేయరాదు. యింద్రియ విజయ యుద్ధమనగా తన యింద్రియములచే పరులకెట్టిబాధల నిడక తనరక్షణకు భగవ ధ్యానమునకు పనిచేయించుట. లోక కల్యాణదాయక మగు మన్మథయుద్ధము యిందిృయవిజయ యుద్ధము ప్రతి గృహ స్థుడు, ప్రతిగృహిణి చేయదగనది. దాన సర్వసుఖాస్పదము లును అగును. వివాహ ముహూర్తమున భార్యాభర్తలకు స్నేహము గలుజేయవచ్చుననియు జాతకమువలె దీనియందు కొంత ఫలముగలదని వశిష్ఠ సంహిత అను గ్రంథాన వశిష్ఠుడు వ్రాసెను. నిషేకములో పూర్ణస్నేహము తెలుపు కౌగిలి భార్యాభర్తలకు గల్గును. గాన వివాహముకన్న నిషేకము బలమైనది. నిషేకమన్న పృథమ గర్భాదానము.

శి వ పు రా ణ ము:— దుర్గాయీశ్వర వివాహము-

శ్లో. నిషేకం సర్వసాధ్యంచ। నిషేకో బలవాన్ విధా। నిషే
కోబలవాన్ వైసః। నిషేకః కేనవార్యతే॥

ప్రథమగర్భాధానము చాలగొప్ప ఫలమిడునది. అది వరకు స్త్రీ వ్యభిచారిణికాక యున్నచో పూర్ణఫలమిడునని నా యభిప్రాయము. పృథమ గర్భాదాన లగ్నబలముచే సర్వము సాధ్యమగును. లగ్న రాజయోగ బలముచే ప్రారబ్దకర్మఫలమును

దాటవచ్చును. యిట్టి బలముగల నిషేక కర్మము మహ త్తరఫలమిచ్చును. చెడుగల్న నిషేకకర్మము దుష్టఫలము నిచ్చును. అది దేనిచేతను త్రిప్పబడదు. నిషేకముచేయు నపుడు కొందరా ముహూర్తమున శరీరమంటుకొనుట ప్రధాన మనుచు దాని గొప్పఫలమును చెడగొట్టుచున్నారు. గాన ఆ రాజయోగలగ్నమునకు శుభాంశకాలమున భార్యను భర్త సంయోగ యజ్ఞము చేయుట ప్రారంభించుటచే దాని సుఖ ఫలమిచ్చును. నెలనెలకు జరుగునది ఋతుకాల గర్భాదా నము. యీ రెండింట భార్యాభర్తలు దక్క యితరులుం డరు. వారికి సహాయము 'గ్రహరూపీ జనార్దనః' గ్రహరూప మును పొందియుండి ముహూర్తరూపముననున్న విష్ణువు దక్క రెండవవాడు సహాయపడడు. అందు నిషేకకాలమున బల మగు రాజయోగ లగ్నమున భార్యనుపొందిన విష్ణు సహాయు డగును. చెడుయోగమున పొందిన అతడే నానాకష్టముల పాలుచేయును.

లగ్న బలము:— నిషేకము, ఉపనయన వివాహ కర్మలకన్న చాల బలమయినది. ఉపనయనమున విద్యా భివృద్ధిచేయు రాజయోగ దశలుంచిన లగ్నమున ప్రారంభించిన విశేషవిద్య వచ్చును. ప్రస్తుత ముహూర్తజ్ఞులు తారాచంద్ర బలములు పంచకరహితము (యీరహితము 7, 8 విధములు గలది). యే రీతినో యెపుడు పంచక రహితమగుచుండునో అపుడు కుదిరినది చాలబాగున్నదని సంతోషించి తమబాలుర

కా ముహూర్తమున ప్రారంభించి విద్యానాశనము చేయుచున్నారు. యిక పరులకుచేయుట లెక్కయా? వివాహమున భార్యాభర్తలు స్నేహసంపదలకు లగ్నముంచుట, నిషేకమున, సర్వలోకస్థులు, యీ లోకమునకు వచ్చుటకు తగుమార్గము చేయుట. అందు లోకకల్యాణకారులగు బాలబాలికలను గనుటచే తాను భార్య పితరులు తరించుటకునూ, దేవతలు, సాధురాక్షసులు, ఋషులు, అతిథులు, సాధుమానవులు సౌఖ్యమునందుటకున్ను గర్భస్థ శిశువుల పరమేశ్వర పరమేశ్వరిగా మార్చుటకు భర్త తన జన్మము మారి పుత్రరూపజన్మమెత్తుటకు హేతువయినది. అందుచే గ్రహరూపీ జనార్దనుని ఫలముగల్గునట్లు లగ్నముంచి ఆకాలమునకు రాజయోగదశలు వచ్చునట్లుచేసి ఆ లగ్నమున నిషేకముచేయుచు వచ్చిరి.

నిషేకము ప్రారబ్ధమును మించి గొప్ప ఫలమిడునని వ్యాసుడు వ్రాయుటచూడ భార్యాభర్తలు యిక్కడనుంచి దేవాదిసాధు తత్తుల్యులకు మహోపకారము చేయుదగిన కాలమైయున్నదని తోచెడిని. అందుకు సహాయము గ్రహరూపీ జనార్దనుని కోరినారు. అతని ధర్మమార్గమున కోరిన సహాయముచేయును. లేనిచో దుష్టుడగు దుర్యోధనుడు చక్రాయుధము లేనంతమాత్రాన కృష్ణుని విడిచి తక్కిన యాదవుల కోరి వళించినట్లు దుష్టముహూర్త నిషేకము భార్యాభర్తల నానాకష్టముల పాలుచేయును.

వశిష్ఠసంహితా— 'తస్మాత్ వివాహే యాత్రా

యాం ఆధానే జాతకోపివా గ్రహయోగాత్ ఫలంవాచ్యం శేషమన్యద్ధి నిష్ఫలం'. యాత్రా, వివాహముల, నిషేకమున, జాతకమున, గ్రిహయోగములబట్టి ఫలము చెప్పనది. మిగిలి నది నిష్ఫలమైనదని యున్నది. అనగా తారచంద్రి, బల, పంచకరహితములవల్ల, స్వల్పఫలమే కలదని తెలియుచున్నది. ఆ ఫలము లభించునో లభించదో అన్నట్లున్నది. అతని మునిమనుమడగు వ్యాసుడు "శివపురాణములో" నిషేకల్న గ్రిహఫలములు, ప్రారబ్ధమును తెల్పుజాతక ఫలములును గూడా మార్చునని చెప్పెను. దీనినిబట్టిచూడ చెడుజాతకునికి బలహీన జాతకునికి వాని జాతకముకన్న సంపూర్ణబలము గల్గిన గ్రహములతో రాజయోగము గలిగియుండ దశలు జాతకమువలె నిషేకలగ్న కాలమునకు కల్పించి ఆ రాజయోగ దశలు ఆభార్యాభర్తల జీవితకాలమున త్వరలోనే వచ్చునట్లే ర్పరచి అట్టినిషేకలగ్నకాలాన భార్యతో ప్రిథమ సంయోగ యజ్ఞము చేయునది యని జెప్పనగును. యిటులయినచో జాతకము చెడుఫలములు హరించి మంచి ఫలమిడునని భావము. జాతకము మంచిదయిన అది యిదికలసి మరింత రాజయోగదాయకమగునను టకేసందియమునూ లేదు. ఋషి వాక్యముల సత్యములు గావుగాని, అల్పజ్ఞులగు వారు తెలియక బలహీన లగ్నములుంచిన చెడుఫలమిడగలదు. మరియు, మామూలు ముహూర్తము లుంచువారికి రాజ యోగ ముహూర్తము లుంచుట చేతకాదు. నేను చాల

మందిని చూచితిని. ఓ మనుష్యులారా! మీ క్షేమమునకే అని వూహించుడు. జాతకముహూర్త గ్రంథములు అనుభవజ్ఞుడగు గురువువద్ద చదివిన వానిచే యీ వివాహ, ఉపనయన నిషేకాది ముహూర్తముల పెట్టింపవలయును. దానఫలదాయకములగును. దుష్టముహూర్తములుంచు వానికి బ్రహ్మహత్యాదోష సమఫలముగల్గునని వశిష్ఠ సంహితలో గలదు. ఫలమిడకయున్న ముహూర్తముంచినవానిదో సంయోగయజ్ఞ చేయువానిదో దోషమైయుండును గాని, ఋషివాక్యము లనృతములుగావు. జాతకములేనివానికి మంచిచెడుగులు తెలియవు గాన యీ నిషేకముహూర్తమున గొప్పరాజయోగముంచి ఆ రాజయోగ దశలు త్వరలో వచ్చునట్లుచేయ మానవుడు పుట్టినకాలాన వేయుగ్రహదశలవలెనే యోగఫలమిచ్చును. యింతకన్న రెండవమార్గములేదు. యింతకన్న రెండవమార్గములేదు. తల్లి కూతురికి తండ్రి కుమారునికి ఆ రాజయోగనిషేక లగ్నమున శుభనవాంశకాలమున అథవా "కాలమేవ, ఈశ్వరః" అన కాలమే యీశ్వరుడుగాన ఆ శుభలగ్నములోనయ్యినా యీ ప్రథమ సంయోగయజ్ఞము జరిపితీరదగుననియు, ఆకాలము ఈశ్వర విష్ణువుల సహాయము గలదనియు కడుంగడు జాగ్రత్తగా కాలము చూచుచు యీప్రథమసంయోగయజ్ఞము ఆచరింపుడని ఆజ్ఞాపించునది. ఆపుణ్యకాలముదాటినచో, మనుష్యుడా! నీ జీవితములో చెడు ప్రారబ్ధమును దాటుమార్గములేదు. గాని బ్రహ్మర్షిగామారినవాడుమాత్రము ప్రారబ్ధము తన్ను బాధించకుండా

నడచుచునేయుండి నిత్యానందముతో త్రిప్పుచుండును. గాని భోగభాగ్యములు మామూలు జాతకమునకువలెనే జరుగుచుండును. ఆతడు గాఢముగా భోగభాగ్యములు కావలెనని సంకల్పించిననాడు గల్గుచు పోవుచునుండును. స్త్రీయను ఆలయమున పురుషుడను లింగప్రతిష్ఠ చేయుటయే నిషేకమని నా అభిప్రాయము. ఇది దేవాలయప్రతిష్ఠ అంతటి గొప్పది.

—: ఫలమిడు సర్వవిధ శాస్త్రములు :—

హీనులగు పండితులచేతిలోబడి హీనశాస్త్రములగుచున్నవి. ఆ శాస్త్రములే గొప్ప పండితులచే గొప్పఫలముల చూపబడుచున్నవి. వేదపురుషునకు జ్యోతిశ్శాస్త్రము నేత్రములు. కన్నులులేకున్న వేదాది సత్కర్మమార్గము లెట్లు నడచును? జ్యోతిశ్శాస్త్రాధికత్వ నేడిక్కడవ్రాసిన పెద్ద పొత్తమగును. మరియు నిషేకలగ్నమున రాజయోగ గ్రహములున్నవా లేవాయని ముహూర్తముంచినవాడు అల్పజ్ఞుడైనచో శాస్త్రమునందు చూపుమని తాను చూచునది లేనిచో మరియొక గొప్పపండితునకు జూపదగినది. జ్యోతిశ్శాస్త్రవిరుద్ధముగాక రాజయోగ దశలుంచువాడే గొప్పపండితుడు గాన యింక ధనవ్యయములేదు. బంధువులకు భోజనాది తృప్తిచేయ నవసరములేదు. కనుక ప్రతిగృహస్థుడు నిషేకకర్మము రాజయోగమిడు గ్రహదశలు త్వరలో భార్యాభర్తల జీవితకాలములో వచ్చునట్లుంచి ప్రారంభింపదగినది. యిట్లు భూలోకగృహస్థులందరు సౌఖ్యము చెందవచ్చును. ఇట్లు శాస్త్రజ్ఞులుగా

గాక ముహూర్తముపెట్టినను, ముహూర్తములేకుండా తనకు తోచినకాలాన నిషేకముచేసిననూ వాని పూర్వపుణ్యావశమున అట్టి లగ్నములభించిన మంచి ఫలమిడునేగాని చెడుఫల ముండదు. గాని కాలప్రభావమెరింగినచో శాస్త్రప్రకారము కర్మమొనరించిన నిత్యము శుభలములేగల్గును. యిదియే శాస్త్రజ్ఞతచే గల్గులాభము.

—: కృష్ణయజుర్వేదము :—

దేవనక్షత్రములు, యమనక్షత్రములని రెండు తెరం గులుగలవు-కృత్తిక మొదలు అనూరాధవరకు దేవనక్షత్ర ములు. మిగిలినవి యమనక్షత్రములు, కృత్తిక, రోహిణి, మృగశిరకార్తులలో కొద్దిగనో గొప్పగనో వర్షముకురియును. ఆర్ద్రనుండి విశాఖవరకు సూర్యుడున్నపుడు ఎక్కువవర్షములు కురియును. అట్లే గొప్పసంతతి వృద్ధికై యీనక్షత్రాలలో ప్రతి మంచి మాసాలయందు నిషేకమన ప్రథమగర్భాదానము చేసిన భార్యాభర్త లెక్కుడు సఖ్యతగల్గునని కాలామృతమను గ్రంథానగలదు. యమనక్షత్రము లల్పఫల మిడునని భావము. యీ నక్షత్రాలలో నిషేకము బీదవారికి ధనవంతులకు మంచి లగ్నాన చేయించితిని. దానవారు కలహములు లేక సౌఖ్య ముగా నున్నామనిచెప్పిరి. గాన ఆర్ద్రమొదలు విశాఖవరకు గల నక్షత్రములుంచి రాజయోగలగ్నమున ఆ రాజయోగ దశలు భార్యాభర్తలకాలములలో వచ్చునట్లుంచి నిషేకము చేసిన సఖ్యత శుభప్రదమైనదమట కేవిధమయిన సందియము

లేదు. తక్కిన నక్షత్రములలోను రాజయోగములున్న నిషేక ఫలమిడునని పై వశిష్ఠసంహితలో జూపినాను. ఆర్ద్రాది విశాఖ కార్తులలో వర్షముద్వారా జీవులువత్తురు. కాన యీ నక్షత్రాల సంయోగము సత్సంతతి గల్గించుననదగును. దేవనక్షత్రములు స్నేహావృద్ధినిచేయునవి. యమనక్షత్రములంత స్నేహవృద్ధి భార్యాభర్తలకు చేయలేవు.

జాతకముకన్న మించిన రాజయోగదశలు గల నిషేక లగ్నమున నిషేక కర్మము చేయునది. దాన భార్యాభర్తలు యెక్కుడు మిత్రత, సర్వసంపదలు గలిగి తల్లి కనుకాలమున బట్టి వేయు జాతకము యోగించకున్నను యీ నిషేకలగ్న బలముచే సర్వదా సౌఖ్యములందుదురని చెప్పు వశిష్ఠ వ్యాస ర్షుల అభిప్రాయములు సత్యమనదగును. వశిష్ఠుడు "ఆధానే జాతకోపివా" అని గలదు. వ్యాసుడు నిషేకము గొప్పదనెను. దీనినిబట్టి ప్రథమగర్భాదానమే సత్పుత్రుల నిడుననియు అది యెక్కువ రాజయోగము కలిగియుండదగునని నాయభిప్రాయము. ఋతుకాలమున ప్రతిగర్భాదానమున రాజయోగ లగ్నాన స్త్రీనిబొందిన సత్సంతతి వృద్ధియగునని చాలగ్రంథాల గలదు. పరీక్షింపుడు. దీనిని పూర్ణముగ పరీక్షించుటకు నాకు సంతానము గల్గుట ఆగినది. దాన వీలు కలుగలేదు. గాని రాజయోగలగ్నాన సంయోగ యజ్ఞము మంచిదనియే నా యభిప్రాయము. యీ సృష్టిమార్గము తెలిసినవారు మొదటనుంచి చాల జాగ్రత్తగానున్నగాని సత్సంతతిని గన

జాలరు. యేమాత్రము మరచినను సామాన్యులు జన్మింతురు. యీయజ్ఞము చేయునపుడు కడుంగడు జాగ్రత్త గొనవదగును. యజ్ఞపురుషుడు భగవంతుడుగాన అన్నియజ్ఞములకన్న గొప్ప యజ్ఞమగు యీయజ్ఞమున భగవంతునిచూచుచు చేయుటయే పరమోత్తమము. అతనియందే ఐక్యపరచి చేయుట మరింత బలవత్తరము. యిదియు యుద్ధముగాన యెక్కువ జ్ఞానమున గాని జయము గలుగదు.

—: అనేకసాక్షులుయెదుట భార్యగాగొన్న స్త్రీని
సత్సంతతికై బొందుట దోషముగాదు :—

భగవద్గీత:— 'ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ'

ధర్మమునకు విరుద్ధముగాని కామము భగవంతుడేగాన తనభార్యను ఋతుకాలాన అతికామియై యున్న దానినిబొందుట సత్సంతతివృద్ధికే యై యున్నది. దాన దోషములేదు. ఋతుకాలములో 11, 13 మొదటి 4 దినములును, 16 దినము దాటినతరువాతను మరల రజస్వలయగువరకు గల కాలమును విడువదగినది.

ఈకాలము అధర్మకాలము. ఈ కాలములో దుష్ట సంతతియే వృద్ధియగును గాన యిందుకల్గిన కామము దుష్కామము గాన యీకాలము భగవంతుడు గాదు. కావన రాక్షస కాలమనదగును. కాన అధర్మకాలమున నెంత కామము గల్గిననూ భార్యాభర్తలు సంయోగయజ్ఞము చేయరాదు. చేసినచో పాపముగల్గునన దుర్బలత్వము, రోగము గల్గును. గర్భ

కారణమైన తమకు పితరులకు కష్టమిడు దుష్టులగు పుత్ర పుత్రికలు గల్గుదురు. వీరికి వివాహమున కన్యాదానఫలము, తలిదండ్రులకు అత్తమామలకు గలుగదుగదా! పైగా రెండు కొంపలకు చెడుకీర్తి గల్గును. పరసుఖము లేకుండాచేయును. నిషేక కర్మముతో భార్యాభర్త లెక్కువ స్నేహము గలవారగుదురు.

"మనుస్మృతి" 3 అధ్యాయము:—

'సంతుష్టో భార్యయా భర్తా భర్త్రాభార్యా తథైవచ।
తస్మిన్ యేవ కులేనిత్యం కల్యాణం తత్రవై ధ్రువం॥

భర్తచే భార్యయు, భార్యచే భర్తయు యేయింట తృప్తిచెందుదురో ఆయింట నిత్యకల్యాణముగా యుండును.

"బృహత్పరాశరస్మృతి":—

'భోజ్యాలంకారవాసాభిః। పూజ్యాస్యుః సర్వదాస్త్రియః।
స్త్రియో యత్రతు పూజ్యంతే సర్వదా భూషణాదిభిః॥
పితృదేవమనుష్యాశ్చ। మోదంతే తత్ర వేశ్మని।
వర్ధయంతి కులంతుష్టా నాశయం త్యవమానితా॥

స్త్రీల భోజ్యముల భూషణముల వస్త్రములచే గౌరవింపదగినది. అచ్చోటనే పితరులు, దేవతలు, మనుష్యులు, సంతోషముతో నుందురు. స్త్రీలు సంతుష్టిచెందిన ధర్మ ధన కులవృద్ధి చేతురు. అవమానింపబడిన ధర్మ ధన కులములనశింపచేతురు.

సంతుష్ట తుష్ట పదప్రయోగములు గొప్ప అర్థములు గలవి. భర్త తనకు తెలిసియున్నంతలో ఆ మెను ధర్మకార్య

మున నడిపించి దానిసుఖ మామెను బొందచేయుట ధర్మ తృప్తి. తనకున్నంతలో ధనాదులిచ్చుట, భూషణవస్త్రాదు లిచ్చుటతో అర్థతృప్తి. కామతృప్తియన ఋతుకాలాన ధర్మ కామ మామెకెక్కువ గల్గిననాడు (ఆబోతు ఆవునకు కామము గల్గించుటలేదు. ఆవుకు కామముగలిగినపుడు ఆబోతునుపొంది సత్సంతతిని గనుచున్నది. అంతవరకు ఆబోతు తన శుక్రమును తనయందేనిల్పి కాపాడుచున్నది. తనకు కామముగల్గిననూ ఆవులపై బడుటలేదు) అట్లే సంయోగయజ్ఞమున ధర్మకామ తృప్తి మొదట భార్యకు గల్గునట్లుచేసి తరువాత భర్త ధర్మ కామతృప్తి చెందిననూ లేక యిద్దరూ సమముగా తృప్తిచెంది ననూ ధర్మార్థకామములలో భార్య సంపూర్ణసంతుష్టయగుట కేసందియములేదు. అట్లు భార్య యుండుటచే భర్త సంతుష్టు డగును. దాన యెట్టి కలహాములు లేక గృహాశ్రమము నిత్య కల్యాణప్రదమగును. ఋషులు రాక్షసస్త్రీల పెండ్లాడినను ధర్మార్థములిచ్చి పూర్ణమైన కామతృప్తిచేసి సుఖములందిరి. ధర్మార్థము లెంతయున్నను సంయోగయజ్ఞములో భర్తయే కామతృప్తి చెందినచో భార్య కామతృప్తిచెందక శోణితము శరీరమున కదిలి ఉన్మాద, అపస్మారాదిరోగములు కలహా ములు గల్గును. దుష్టస్త్రీయైన వ్యభిచారిణి యగును. సాధ్వి యైన ధర్మార్థములతో తృప్తిపడుచు పరపురుషసంబంధము విడిచి భర్తకు సహాయముచేయుచు కాలము గడుపుచుండును. అట్టి అవస్థగల పురుషుడు మొదటనే మేల్కొని భారతదేశ

పురాతనవైద్యులు చరకసుశ్రుతులు చాల గొప్పవారు. భూలోక ప్రస్తుతవైద్యులుకన్న యెక్కువరెట్లు గొప్పవారు. వారు రచించిన "చరకసుశ్రుతసంహిత" గ్రంధాలలో చెప్పిన "వాజీకరణమనగా" శుక్రవృద్ధి శుక్రబలము గల్గు ఔషధము లందిన తప్పక భార్యను భర్త ధర్మకామతృప్తి చెందించగలడు. దాన వంశవృద్ధియగును. దుష్టభార్యయైనను మొదటనుండి భర్త కామతృప్తిచేసిన వ్యభిచరించక సౌఖ్యమిడును. అటు లామెను తృప్తిచేయనిచో "నాశయంత్యవమానిత" దుష్ట భార్యయైన ధర్మార్థకామములు మూడును నశింపచేయును. సాధ్వియైన ధర్మార్థములు వృద్ధియగును. సాధారణముగా సంతానవృద్ధి గానేరదు. పేదవాడు భర్తయైననూ అర్థము లేకున్ననూ ధర్మకామతృప్తి చెందినచో భార్య సంతుష్టియై సద్వంశము సత్సంతానవృద్ధి చేయును. యిటులైన రాజ్యమేలు రాజర్షులకు, పేదవారగు మహర్షులకు, ధనవంతులు దరిద్రు లగు గృహస్థులకు గృహాశ్రమమను రాజ్యము సౌఖ్యముగా నడచినది, నడచుచున్నది, నడవబోవునది యీ ఒకమార్గమే గాని రెండవమార్గములేదు, రెండవమార్గములేదు. మితిమీరి ధర్మాధర్మకాలాన భార్యనుగూడిన బలహీనులై అపస్మారాది రోగాలు క్షయాదిరోగాలు గల్గును. యీ యజ్ఞము పరస్త్రీయందు చేయువారు అధర్మమార్గమగుటచే యెక్కువ పాపము జెందుచుందురు. అనగా రోగాదులచే, కలహములచే బాధలుపడుట ప్రత్యక్షఫలము. తరువాత నరకము

సంభవించును. కుక్కలు, నక్కలు, గోవులు, పులులు మొదలగు జంతువులు, చెట్లు పూవులు ఋతుకాలానతప్ప యితర కాలాన స్త్రీలు బొందుటలేదు. యిది అంతయు తెలిసియు చూచుచు అనేక గ్రంథాలలో రజో దర్శనాదికాలము మొదలు 16 రాత్రులు మాత్రము స్త్రీకి ఋతుకాలము. అందు మొదట 4 దినములు, 11, 13 దినములు దక్క తక్కిన 10 రాత్రుల స్త్రీలను బొందుట ధర్మము. దాన సత్సంతతి వృద్ధియగుననియు, 17 వ రాత్రి మొదలు మరల రజస్వలగువరకు గల మధ్యకాలమంతయు దుష్టసంతతినిచ్చుననియు యెరింగియు రాత్రులు పగళ్ళు నియమములేక మితిమీరి సంయోగముచేయు భార్యాభర్తలు అధర్ములగుటచే పాపముగాంతురు. నానావిధరోగాలతో బాధలుపడుదురు. యింతకన్న ఫలమేమికావలయును.

—: స్త్రీకి స్వాతంత్ర్యము లేదా :—

గృహరాజ్యమున రాణి స్త్రీ కదా – స్త్రీ మహిమ.

మనుస్మృతిః—9 అధ్యాయం – 'పితారక్షతికౌమారే। భర్తా రక్షతియౌవనే।రక్షంతిస్థావిరేపుత్రాః।న స్త్రీస్వాతంత్రమర్హతి॥' అనగా ఆడది బాల్యమున తండ్రి, యౌవనమున భర్త, వార్ధక్యమున పుత్రులచేతనురక్షింపబడును. అనగా సామాన్యముగా తనంతటతాను స్త్రీ దుష్టుల బారినుండి తప్పించుకొనలేదు. దుష్టుబారిబడిన తప్పించుకొనుటకై మరియొక పురుషుని సహాయము కావలయును అందుకే కనినవాడు తండ్రి, దానము

బొందినవాడు భర్త, ఆమెయందున్న కొన్ని అంగదానములు పొందినవాడు పుత్రుడు తప్పక రక్షింతురని భావము. ఆమెకు రెట్టి రక్షణలేనిచో బలహీనురాలుగాన ఆమె ధనాదుల హరించి, ఆమెయందు కామతృప్తి చెందవచ్చునని దుష్టు లీమార్గమంగీకరింపక హేళనజేతురుగాని ఆమనువే 9 అధ్యాయం. 12 శ్లో. 'అరక్షితాగృహేరుద్ధాః। పురుషైరాప్తకారభిః। ఆత్మానమాత్మనాయస్తు రక్షేయుస్సాసురక్షితాః'. కావలివాండ్రతో నిర్బంధముతో రక్షింపబడు భార్య లెపుడును రక్షితలుగారు. యే స్త్రీలు తమ్ముతాము కాపాడుకొందురో ఆ స్త్రీలే చక్కగా కాపాడబడువారు. బ్రహ్మర్షిత్వసిద్ధి, బ్రహ్మజ్ఞానసిద్ధి మార్గముల నొకటి తండ్రివద్దనో భర్తవద్దనో పుత్రునిదగ్గరనో నేర్చి సిద్ధిచెందిన పరమపతివ్రత మాత్రము తన్నుతాను పరపురుషుల నుండి రక్షించుకొనగలదు. ఆ శక్తి లేక వ్యభిచారముచేయని పతివ్రతయైనచో పరులనుండి రక్షించుకొనలేదు. ఈ రక్షణలు దుష్టస్త్రీలను బాల్యమునుండి చివరవరకు పరపురుష సంబంధము లేక రక్షింపబడి కొందరయిననూ సాధ్వులగుదురు. అందుకు స్త్రీరక్షణ ముఖ్యమనిరి. పరమసాధ్వియగు ద్రౌపది దుశ్శాసనుడు బట్టలు విప్పుచుండగా భీష్మద్రోణాది మహావీర సభామధ్యమున రక్షింపకున్న భగవంతుడగు కృష్ణుని హృదయమున నిల్పి స్మరించుచు ఆ భగవంతుని రూపము దుశ్శాసనునిపై చూచినది. కనుకనే (భాగవతమున భరతుడు తన్ను చంపుటకు సిద్ధముగానున్న కాళికాదుల విష్ణువుగా చూచుచు

అతనిని తన హృదయమున నిల్పి నిలచిన అతనిని చంపలేక పారిపోయిరి. పైగా కాళి వారి నందరను చంపెను). దుశ్శాసనునినుండి విడువబడినది. దుశ్శాసనుడు అవమానము పాలయ్యెను. యిట్టి సిద్ధి (బ్రహ్మజ్ఞాన సిద్ధులకు కలిగితీరును. సభవారందరును ధృతరాష్ట్రుడు మొదలగువారు సాధ్వీసాధ్వీ యని కొనియాడిరి. దమయంతి ఎరుకలవానినుండి యిటులే తప్పించుకొనినది. యిటు లనేక పతివ్రతలుచేసిరి. నేడీ బ్రహ్మవిద్య వివరముగా చెప్పు పండితులరుదుగా నుండుటచేతను ఒకానొకరు చెప్పిన అభ్యసించువారు లేకుంటను నష్టమైనట్లున్నది. మరియు స్త్రీయందు దేవదేవాది మహాపురుషులు పుట్టుటకు తగినయోని,భగ యను పేర్లుగల గొప్ప అవయవము గలదు. దానిని అగ్నియు పెద్దలు మొదలగువారెదుట వివాహము గొన్నభర్త తప్ప యితరులు పొందరాదు. ఇతరుడొకడు పొందిన మాత్రాన ఆ గొప్పశక్తి అంతయు నశించి స్త్రీ రాక్షసిగా మారును. దానినంటిన భర్తకును పాపము గల్గును. ఆ స్త్రీవ్యభిచారిణి యగును. కనుక అనేక దుస్సంకల్పములుకలదై దుస్సంతతిని కలిగించును. పతివ్రతయైన తన భర్తతోనే తృప్తిపడి ఆయనయందు ప్రేమగల్గి భగవంతునిగా సేవించునది. యితర దుస్సంకల్పములు లేనిది. యిట్టి దానిని సంయోగయజ్ఞమున బొందిన భర్త ఆకాలమున మాత్రము భగవంతుడగుచున్నాడు. గాన ఆ కాలమున ఎట్టి వారిని సృష్టింపవలెనన్న అట్టి రూపమునుధరించి అట్టి వారిని

భార్యసహాయమున సృష్టింపగలడు. ఆ కాలము దాటిన మానవుడే అగుచుండును. స్థితిలో తనయందు భగవంతుని జేర్చి భగవంతుని శక్తి తనకుగల్గువరకు జపాదియజ్ఞములు. సత్యాది వ్రతములతో ఆచరించుచు దేనికీ అపకారములు చేయక నడుచువాడు బ్రహ్మర్షి యగును. అనగా భగవంతుడుగా మారును. యీ గృహస్థుడు నిత్యము బ్రహ్మజ్ఞానులగు స్త్రీ పురుషుల సృష్టింపగలడు. లయమున భగవంతుని చూచి ప్రాణము విడుచువాడు అతనిని చేరును. దీనికి భార్యా సహాయము కొంత సహాయమగుటచే పురుషులు స్త్రీలు గృహాశ్రమమున నాశ్రయించిరి. బలాత్కారముగా స్త్రీకి యిష్టము లేక పొందిన నేరము పూర్వమునూ రాజు శిక్షించుచున్నాడు. అట్టి స్త్రీకి ఋషులు ప్రాయశ్చిత్తములచే దోషవిహీనురాలుగ చేసిరి. ప్రాయశ్చిత్తములేకుండా మొదటినుంచీ స్త్రీనికాపాడుట ఉత్తమధర్మముగదా! దానింబట్టి స్త్రీకి గృహాశ్రమమున ధనాదుల సర్వశుభ కర్మముల సర్వస్వతంత్రము కలిగిన దేగాని యోనియందు మాత్రము స్త్రీకి స్వతంత్రములేదనిరి. తండ్రి ఆ కంటకము పరుడంటకుండా రక్షించి. భర్తకు దానముచేసెను. గాన ఆయోనిపై భర్తకు స్వాతంత్రముగాని స్త్రీకి గాదు. కొందరు స్త్రీపై పురుషునకే స్వతంత్రముగలదందురు. మొత్తముయొక్క భర్తపెత్తనము యెక్కువగానూ స్త్రీ పెత్తనము తక్కువగానూ జరుగుచున్ననూ స్త్రీపురుషులంగీకరింతురుగాని భార్యయోనిపై స్వాతంత్రము భర్తకేగాని స్త్రీకి గాదని

కూఢ్యర్థము. సాధ్వియైన స్త్రీ దీని కంగీకరించినది. స్త్రీయో నిని తన యిష్టప్రకారము పరుని బొందజేసినచో పాడయి దుష్ట స్త్రీఅగును. అన్నిట స్త్రీకి స్వాతంత్రము గలదుగాని యోనిపై స్వాతంత్రములేదు. వార్థిక్యమున వ్యభిచారము చేయుట గొప్పదోషము. శూర్పణఖ భర్తలేనిదగుటచే రహస్య వ్యభిచారిణియై యుండును. దాన రామునితో వ్యభిచారము చేయ కోరగా రాముడు శిక్షించెను. ఆమె పుట్టింటివారి నందరిని నశింపజేసినది. ఆ కాలరక్షణ పుత్రునిపై నుంచిరి.

భా ర త ము:— ఆదిపర్వము 5 అ॥ 84 వచనము. మొదటికాలాన స్త్రీలు రక్షణలేక ఋతుకాలాన తమ తమ వర్ణంబుల స్వేచ్ఛగా పరపురుషుల బొందుచుండిరి. ఆకాలమున ఉద్దాలకుడను ముని భార్య అతిసాధ్వి. తపోనిధియైన శ్వేత కేతుని తల్లి ఋతుమతియైన యొక వృద్ధవిప్రుడు పుత్రార్థము కామించిన శ్వేత కేతుండలిగి యిది ధర్మవిరుద్ధమనియు స్త్రీ లకు పరపురుషసంయోగము మహాపాపమిందునుగాన కూడదని ధర్మస్థాపన చేసెను. దాన స్త్రీలు పరపురుష వ్యభిచారము మాని ఋతుకాలాన బ్రిహ్మనముడగు శ్వేత కేతుని వాక్యము పాలించిరి. తిర్యగ్యోనులందును, ఉత్తరకురు దేశములను మొద లింటి ధర్మముమాత్రము విడువబడలేదు. భారతభూమిని మాత్రము యీ ధర్మాచరణ చేయబడినదని భావము. గాన వ్యభిచారము చేయుదగిన యోనియందు మాత్రము స్త్రీకి స్వతంత్రము లేదనియు, తండ్రాజ్ఞ, భర్త్రాజ్ఞ, పుత్రాజ్ఞ ముఖ్య

మనియు, యితర గృహాకర్మముల సాధారణముగా వారి ఆజ్ఞ యుండుటయే మేలనియు ఒకవేళ తప్పినను అంత బాధ కరముగాదు వ్యభిచారముమాత్రము అట్టిదిగాదనియు పర పురుషుడు పొందినమాత్రాన స్త్రీ గొప్పశక్తిని బాయుననియు ఋషులు గ్రహించి వ్రాసిరి. దేవాలయములో ఒక పానవట్ట మునకు ఒకలింగమునే ప్రతిష్ఠించియుండ దానినిజూడ భార్యా భర్తలు దర్శించుట భగవద్భక్తి వృద్ధికిని, భర్తకు ఒకటే యోనియనియు భార్యకు ఒకేలింగము ధరింపదగునని ధర్మము నేర్పుటకు ఒకే పానవట్టమునకు రెండులింగములు లేవని అనగా పరపురుషుని గూడరాదని చెప్పుటకే అయియున్నది. భగవంతుని శంకరునిమాత్రము పరమేశ్వరి యగు దుర్గ పొందుచున్నట్లు దేవాలయములో భార్యాభర్తలు జూచి నపుడు మీరు మావలెనే పరపురుష, పరస్త్రీల విడచి సంయోగయజ్ఞము చేయదగునని ఆశంకరుడు పార్వతియు నీతిబోధించు నట్లున్నది. దేవాలయము అనేకనీతులు నేర్పుటకు దగిన ప్రదర్శనశాల యనదగును. ఒకసారి పరపురుషుని యిష్టముతో భర్తలేక పొందినది, సంతానముగలది భార్యయు నగు రేణుకను జమదగ్ని నరికించినాడు. నరికిన పరశురాముడు కోరగా మరల బ్రతికించినాడు దాన దోషముపోయినదని మరల పాలించినాడు. యిట్లెవరును చేయరాదు.

జమదగ్నివలె బ్రతికించు శక్తివంతుడు చేయదగును. ఒకసారికే ప్రాణముదీయుట ప్రాయశ్చిత్తమైన ఎక్కువ

వ్యభిచారముచేయుదాని కెంతపాపమున్నదో చెప్పవీలుగాదు. యింద్రుని అహల్యా కామముతో బొందుటెరిగి రామరూప భగవద్దర్శనమగువరకు కొన్నివందలయేండ్లు తపస్సే ప్రాయశ్చిత్తమనిచెప్ప ఆమెజేసి మరల భర్తను పొందెనుగాన అహల్యవలె భగవంతునిగూర్చి మరల వ్యభిచారముచేయక పతివ్రతలగు సావిత్రి, దమయంతులవంటి బ్రహ్మర్షిత్వశక్తి గల్గువరకును సత్యధర్మాహింసాదివ్రతములతో జపాదియజ్ఞము లొనరించునదిగాని మానవజన్మము మరల గల్గుట కష్టము గాన భర్త చంపుటగాని, భార్య అవమానమునకై చచ్చుట గాని సేయరాదు. భగవధ్యానముచే ఎట్టి మహాపాపులయిన పవిత్రులుగాగలరు. బృహత్ పరాశర స్మృతి: "భార్యాధీనం సుఖం పుంసాం । భార్యాధీనం గృహాంధనం । భార్యాధీనం సుతోత్పత్తి । భార్యాధీనం శుభోదయః॥" పురుషునిగల్గు సౌఖ్యము, గృహము, ధనము, సత్సంతతి వృద్ధి మరి యితరము లగు శుభకర్మములు భార్యాధీనమైయున్నది. భార్యా స్నేహము గల్గినగాని యివి లభ్యముగావు.

డిటో:—'నగృహేన గృహస్థస్యాత్ । భార్యాయా కథ్యతేగృహి।
యత్ర భార్యాగృహం తత్ర। భార్యాహీనం గృహం వనం।

గృహమున్నంతనే గృహస్థుడుకాడు. భార్యయుండిననే గృహి అనబడును. ఎక్కడ భార్యకలదో అదియే యిల్లు. భార్యలేని యిల్లు అడవి అనబడును.

మను స్మృతి:— 9 అ॥ 'ఉత్పాదన మపత్యస్య ।

జాతస్య పరిపాలనం। ప్రత్యహం లోకయాత్రాయా। ప్రత్యక్షం స్త్రీ నిబంధనం॥' పిల్లలను గనుట, వారిని పోషించుట, యిహ పరలోకస్థులగు దేవ, ముని, స్వర్గరాక్షసాదుల, అతిథి, మిత్రాదుల, అన్నాదుల తృప్తిచేయ సహాయపడుట మొదలగు పనులకు భార్య ముఖ్యముగదా! యీమె లేనిచో యీ సత్కార్మకాండ గృహస్థుడుచేయ ధర్మముగాదు. భారతము ఆదిపర్వము 4 అ॥

సీ॥ ధర్మార్థ కామసాధన కుపకరణంబు। గృహనీతి విద్యకు
గృహము విమల। చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ స్థితికి
మూలంబు సద్గతికినూత। గౌరవంబునకే కారణం బున్నత।
స్థిరగుణమణులకాకరము హృదయ। సంతోషమునకు
సంజనకంబు భార్యయె। చూవె భర్తకు నొండ్లు గావు
ప్రియము

ఆ॥ యెట్టి ఘట్టములను యెట్టి యాపదలను। నెట్టిరీతులను
ముట్టబడిన। వంతలెల్లబాయు నింతుల ప్రజలను। నొనర
జూడగనిన జనులకెందు.

వీటింబట్టి ధనాదులు, గృహాదులు, పుత్రాదులపై పెత్తనము అంతయు భార్యకేగాని పురుషునకులేదు. గొప్ప సంతతిని గల్గించు యోనిపై మాత్రము స్త్రీకి పెత్తనము లేదు.

క॥ సతియును గుణవతియు ప్రజా। వతియు ననువ్రతయు
నయిన వనిత నవజ్ఞా। న్వితదృష్టి జూచు నతిదు। ర్మతి
కిహమున్ బరముగలదె మతి బరికింపన్॥

సాధ్వి స్త్రీని భర్త ఎట్టిఅవమానము సేయరాదనియు కలదు. భార్య యన యిట్టిది. గృహాశ్రమమున యీమెకు సత్ఫలమున జెప్పబడినది. భార్య వ్యభిచారిణి దుష్టస్త్రీ గాదవి భర్త గ్రహించిననాడు అట్టిభార్యకు యింటియందు స్వతంత్రములేదనిన చీమలుగూడా నవ్వునుగదా! భర్త ధనాది సర్వము ఆమెపై పెట్టియే తిరుగుచుండును. గృహసర్వస్వము భార్యదే భర్తదేనను భేదముండదు. యిద్దరిలో నెవరెట్లు యేమిచేసినను చెప్పుకొని సంతసించుచుందురు. యిక దేనిపై ఆమెకు స్వాతంత్ర్యములేదనిన తన వంశవృద్ధి చేయుటకు మూలమైన యోనిపై మాత్రము స్వతంత్రములేదనియు దానిని భర్తతప్ప యితరులు బొందరాదని భావము. భర్త్రాజ్ఞ కలిగినను కలియుగమున పరమానవుల భార్య పొందరాదని పరాశరర్షి చెప్పెను. స్త్రీ తండ్రిచే దానముచేయబడుటచే సత్సంతతి వృద్ధియైన తండ్రియు భర్తయు తరింతురుగదా. యని యెట్టిస్త్రీలను యెట్టిపురుషులు పెండ్లాడిన గలుగునో దేవుని, యింద్రాదుల గనుటయెట్లో పూర్వర్షులు ప్రస్తుతము పడమటి దేశీయులు ఖనిజరసాయనశాస్త్రములు పరిశోధించి నట్లు పరీక్షించి తమతమ స్వానుభవములనే గ్రంథముల వ్రాసిరి. ప్రస్తుతము పడమటి దేశ ధనాభివృద్ధిజూచి "ఆటం" మొదలగు ఆయుధసృష్టిచూచి భారత దేశీయులు వారి భాషా మోహితులై M. A. లు సైంటిష్టులు, యింజనీర్లు, బారిష్టర్లు, ఐ. సి. యస్. ఆఫీసర్లు, రాజకీయతంత్రజ్ఞులుగా

మూరుచు వారి ననుసరించుచు వారి దేశాల కేగినవారే గొప్పవారని తలచుచున్నారుగాని మనదేశపు పూర్వము M. A. ద్రోణాచార్యులు, భీష్మాచార్యులు, కృపాచార్యుల వంటి మొనగాడీలోకాన గలడా? పడమటిదేశీయులలో "ఆటం" వగైరాలు గలిగినవిగాన ఎక్కువ మేధావంతుల గనిన వారికన్నా యెక్కుడు శక్తినంతులగుదురుగదా! గాన సృష్టిలోనే ఆశక్తిగలదుగాని బలహీను లెంతచదివినను లాభములేదు. మనదేశపు యుద్ధనీతి, రాజనీతి, గృహస్థధర్మములు, యింజనీయర్లు అనగా బ్రాహ్మణ సంఘమువారు యెపుడు వర్షముగావలెనన్న అపుడు కురిపించెడివారు. కుష్ఠాది రోగహరము తెల్పు "ఆయుర్వేదము" సర్వమహిమాన్వితమగు "సంగీతము" "కవిత్వము" మొదలయినవాటిని భారతీయుడు విడిచి పడమటదేశ విద్యలుచూచి ధనమునకు మోహితులై ఆదేశమునకేగి ఆధర్మమార్గములనిట స్థాపించుచున్నారు. గాని యిదంతయు మేధావంతులగు సత్సంతతి వృద్ధియైన మరల భారతదేశము పూర్వమువలె ప్రకాశించునని తలుచుటలేదు. అట్టిశక్తి భార్యాభర్తలు మనదేశ గృహాశ్రమమున సత్సంతతిగనుటచేతను గల్గునని నొక్కి వక్కాణించుచు భారతీయులు భూలోకప్రజలు సర్వసౌఖ్యముల నొందుట గల్గుననెడి సదుద్దేశముతో యీపుస్తకమును వ్రాసితిని. సామాన్యులగు గ్రంథములమ్మువారివలె ధనము నపేక్షించి యీగ్రంథము వ్రాయలేదు. యీగ్రంథమును అచ్చొ

త్తించిన లాభమైనను రానీ లేక ఎవరునూ కొనక దండుగ గలుగనీ యీ అభిప్రాయములు లోకమునకు వెల్లడియగుటకు నిష్కామవృత్తితో వ్రాసితిని. ప్రతి దేశము, ప్రతిరాష్ట్రము, ప్రతిగ్రామము, ప్రతిగృహమున మొదట మహాత్ములు, సాధువులు, సాధ్వీలగు స్త్రీపురుష సృష్టి వృద్ధియైన బాగుపడును. లేనిచో హైన్యులగుదురు. మన దేశజులకన్నా పడమట దేశజులు శాస్త్రాధికులుగను, ధనాధికులుగను, వారికి తెలియకున్నను దైవయోగమున కొందరు ప్రకృతివిద్యా మేధావులు సృష్టింపబడుటచే వారినిజూచి ధర్మముగాని అధర్మముగాని నేర్వగా యితర దేశీయులు మోహితులై యున్నారు. వారికన్న బలవంతులీ భారతమ్మున సృష్టింపబడినచో వీరినిచూచి వారు భ్రాంతిచెందుట సహజముగాన భూలోకస్తులందరు సత్సంతతి వృద్ధిచేసిన యిట్టి మోహము నశించి అందరూ ధర్మజ్ఞులై యిహపరసుఖము గాంతురు. దీనిచే యుద్ధములు రావు. ధర్మమార్గస్థులగుటచే అతివర్షములు, క్షామములు గాలివానలు, రోగాలబాధలు తగ్గును. సాధువులగు పాండవులు యెచటనున్న ఆ దేశము సౌఖ్యాలయముగా నుండునని దుర్యోధనుని ప్రశ్నకు ఉత్తరము భీష్ముడు చెప్పెను. దేశములో బలవంతులగు సాధువులు వృద్ధియైన వారినిజూచి మధ్యమాధమ దుష్టులు మంచిమార్గమున బడుదురు. పూర్ణ దుష్టులలో కొందరు మంచిమార్గమున బడుదురు.

అయోధ్యాపట్టణమున 'మందర' యను దాసి దశర

అందరూ సాధువులుగా యుండుటచే దీని దుష్టత నేర్చువారు లేక యిదియు సాత్వికముగా చాలాకాలము గడిపినది. తుదకు విధిబలవత్తరమున యీమొవున్న యింటియందు మాత్రము కలహాముగల్గి రామాదులరణ్యాము చెందిరి. దాన దుష్టులం దరు నశించిరి. యెక్కువ సాధువులు, తక్కువ దుష్టులు దేశాన గల్గిన వారిదుష్టత కొద్దిసాగినను దానినుంచియు జగము నకు మంచియే గల్గుచుండును. సాధువులగు రాజ్యమేలు పత్ని స్థుల సృష్టియందీ సత్సంతతి వృద్ధియైనచో వారితోబాటు ఆ రాజ్యప్రజలును వారినిచూచి సాధుసాధ్వీల వృద్ధిచేతురు. గాన ఆదేశము ,సర్వవిధ సౌఖ్యాలనొందుట కేసందేహముండదు గదా? గాన భూలోకము బాగుపడుటకు మన భారతర్షులు పరీక్షించిన మానవ సృష్టిమార్గములే గొప్ప ఆధారములు. తండ్రి ధనవంతులుగా పుత్రుల సృష్టించిన వారే ధనవంతు లగుదురు. దరిద్రులుగా సృష్టించిన తండ్రి సంపాదించిన ధన మంతయు నాశనము చేయుదురు. దాన తండ్రి పుత్రులును కష్టములు చెందుదురు. దాన భోగభాగ్యములు మానవసృష్టి లోనే యున్నవి. మానవుడు ధనము సంపాదించి జీవితము గడుపుకొనుచు లోకకల్యాణమునకై కొంత వ్యయము చేయు చున్న తాను కొంత బాగుపడును. గాని లేనిచో పరులపాలై తనకెట్టిలాభము నిడదు. తాను దరిద్రుడయ్యినను గొప్పపుత్రుని కన్నచో అతనిసాయమున తానును సౌఖ్యముజెంద వీలగును. పాండవులు దరిద్రులయినకాలము పాండవులవలె గొప్పతపస్సు

భగవంతునిగూర్చి చేయుచు ధర్మమార్గముననున్న కొంతకాల మునకు సర్వసంపదలు పాండవులకువలె గలుగక మానవు. తండ్రి కూతురుని పొంద రాక్షసులు, సర్పములు, ఛండాలురు పుట్ట వారివలన జగత్కల్యాణము గాలేదు. మనువు మానవుల బ్రాహ్మణాది 4 జాతులుగా విభజించెను. ఛండాలజాతి యొకటి భారతదేశమునగాని భూలోకమునగాని లేదు. తండ్రి కూతురిని, అన్న చెల్లెలిని శూద్రుడన అజ్ఞాని బలాత్కారముగా బ్రాహ్మణిని బొంద పుట్టినవాడు ఛండాలు డనబడును. బ్రహ్మజ్ఞాని జన్మము మానవులలో శ్రేష్ఠమైనది. ప్రథమమైనదిగాను ఛండాలజన్మము తుదిజన్మముగానూ ఋషులు వ్రాసిరి.

భూలోకములో అట్టిరీతిపుట్టుక చెందినవాడెవడో ఆ మానవుడు మాత్రము ఛండాలుడనబడును. ఛండాలురవలన పుట్టినవారును ఛండాలురనబడుదురు. సర్పః - కోపః. పాములయందెక్కుడు కోపముండునని రామాయణమునగలదు. గాన ఛండాలురనబడు రాక్షస, సర్ప, ఛండాలురయందు కోపమెక్కువ యుండును. 'కామాత్ క్రోధః క్రోధాన్ మృత్యుః॥' దుష్కామమున క్రోధము, క్రోధమున మృత్యువుగల్గుచుండును. గాన వీరు జనాపకారముగల్గు మృత్యువునిచ్చు కర్మముల చేయుచుందురు. ఛండాలుడు వధాదికర్మములు చేయ రాజుచే నియమింపబడువాడు. ఎపుడూ వీరిండ్ల స్థిరనివాసములేక దేశముల తిరుగుచుందురని మనువు వ్రాసెను. యీ ఛండాల

జన్మనికి కోపమెక్కుడగుటచే దుష్కర్మము లెక్కుడు చేయుచుండును.

గీత॥ 9 అధ్యాయం:—

'మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః॥'

పాపయోనిజాతులగు రాక్షస, సర్ప, ఛండాలురు యితరులు నన్ను పూజించి కైవల్యము చెందగలరు. అని కృష్ణుడనెను. దీనింబట్టి సత్కర్మములు వీరు చేయకున్నను దుష్కర్మములు మాని నిష్కామకర్మమున భగవంతుని పూజించిన వీరును కైవల్యము చెందగలరు.

ఉ దా హ ర ణ:— కశ్యపుడు, కద్రువ— వీరియందు బుట్టిన శేషాహివాసుకులు మొదలగువారు భగవంతునిగూర్చి నిష్కామతపస్సుచేసి భగవంతుని చేరిరి. వీరు పుట్టుక ఛండాలురు. నరునకు చెప్పిన సత్కర్మము లాచరింపక, దుష్కర్మములు చేయువారు. కర్మ ఛండాలు రనబడుదురు. అనగా వీరు రాక్షస, సర్పములవలె జనుల కపకారము చేయువారు. గాన రాజుచే, యమునిచే శిక్షల జెందక మానరు. వీరును నిష్కామమార్గమున భగవంతుని పూజించి కైవల్యము చెందగలరు— బ్రహ్మ సృష్టించిన సరస్వతినిబొంద అతని పుత్రులు మరీచ్యాది ఋషులాక్షేపింప ఆదేహత్యాగముచేసెను. మానవుడు కూతుని, తల్లిని, సోదరిని పొందినవానికి శిశ్నము కోసికొనుట ప్రాయశ్చిత్తమని పరాశర మహర్షి వ్రాసెను.— మరియు మానవుడు యేస్త్రీని బొందవచ్చును, యేస్త్రీని

బొందరాదని పరీక్షించియే వావి వరుసలు వివాహయోగ్య కన్యకల నిర్ణయించిరి. ఋషులు వ్రాసిన స్మృతులన్నియు గృహాశ్రమ ధర్మములు. భగవంతుని పూజించు మార్గము లతో నిండించిరి. యితరధర్మములు స్వల్పము గలవు.

అట్టిఋషుల మార్గము విడుచుటచే యిహపరము లుండవని తండ్రి కూతురుని, అన్న చెల్లెండ్రను, అప్పలను బొందుటమాని వారిని బాల్యరక్షణచేయుట అనగా సాధు పురుషునకు కన్యాదానముచేయువరకు కూతురు అప్పచెల్లెండ్ర యోనులతానును పరపురుషుడును ముట్టకుండాకాపాడిరి. తల్లిని పెండ్లాడు కొడుకున్నట్లు గ్రంథాలగానరాదు. తల్లియందు సంతతికన్నట్టయినను కృతాదియుగములనుండి నేటివరకుగల జనులలోలేరు.

యజుర్వేదమునః— సోముడు గంధర్వుడు; అగ్ని పొందుదురనియు యీ దేవసంగమము దోషముగాదని తర్వాత అగ్నిసాక్షిగ స్త్రీని పెండ్లాడినభర్త పొందదగుననియు గలదు. యిట్లు దేవతలుదక్క మానవులు పొందకుండాఉన్న స్త్రీకి రజస్వలయిన తరువాత ప్రథమగర్భాదానముహూర్తము యెంత గొప్పరాజయోగముంచిన అంత మంచిఫలము హీన జాతకులుగాపుట్టిన వారికయినను జరిగితీరును. అందునసే తండ్రి వివాహము అగువరకు పరపురుషుడు తనకూతునిబొందిన యీ నిషేకలగ్నరాజయోగ మంతఫలమివ్వదు. గాన కడుంగడు జాగ్రత్తగా కాపాడదగును. అట్టి సుకన్యను దానముచేసిన

తండ్రికిమాత్రమే సత్ఫలముగల్గును. తాను రక్షణచేయక వ్యభిచారిణియైన తన కూతురునినమ్మి నిషేకలగ్న రాజయోగము ఫలమీయనిచో జ్యోతిశ్శాస్త్రము తప్పినదని తండ్రి చెప్పును. గాని ఆకూతునిది తప్పనడు. తనది తప్పనడు. పూర్వము వివాహము చేసినవెంటనే భర్తవెంట పంపెడివారు. దాని రక్షణయంతయు భర్తపైనే యుండెడిది. బాల్యవివాహములగుట కిదియే కారణముగ గన్పడుచున్నది. గాని ప్రస్తుతము రజస్వలయిన తరువాత వివాహములు జరుగుచున్నవి. గాన తండ్రిపై రక్షణగలదు. ఉదా॥ సీతకు ఆరవయేటను రామునికి 13 యేటను వివాహమయ్యెను. తర్వాత రామునిదగ్గరనే సీత కలదు. రజస్వలా వివాహములు, పూర్వముననుకలవు. ఎట్లయిననూ రక్షణ ప్రధానమైనది. సంవర్తకస్మృతి:—

శ్లో. రోమకాలేతుసంప్రాప్తే సోమోభుంక్తేథ కన్యకాం
రజోదృష్ట్వాతుగంధర్వా కుచౌ దృష్ట్వాతు పావకః॥

అధోరోమములు మొలచుకాలాన సోముడును, కుచవృద్ధికాలాన అగ్నియు, లోనరజస్సు అగుకాలాన గంధర్వుడు పవిత్రస్త్రీని పొందును. అట్టిస్త్రీని పరమానవుడుపొందక యీదేవతలుపొందిన పవిత్రయగుననియు అట్టి పవిత్రస్త్రీని గొప్ప రాజయోగనిషేకలగ్నమునపొందిన జ్యోతిశ్శాస్త్రమున చెప్పిన రాజయోగమంతయూ జరుగును. దేవతలు పొందనిది మహాచక్షమ్మయగు దానికి సంతతివృద్ధిగాదు.

పరాశరస్మృతి:— 'అష్టవర్షా భవేత్ గౌరీ నవ

వర్షాతురోహిణీ, దశవర్షా భవేత్కన్యా అథ ఊర్ధ్వ రజస్వలా, రజసా శుధ్యతేనారీ పికలంయానగచ్ఛతి'. పరునియందు మనో దుష్టయైపొందని స్త్రీరజస్సుచే శుద్ధియగును.

మ ను స్మృ తిః—5 అ. 'నదీవేగేనశుద్ధ్యతి-రజసాస్త్రీ మనోదుష్ట'-పరునియందు మోహముచెంది కలియకయున్న స్త్రీరజస్సుచే శుద్ధియగును.

భా ర త ముః— మాండవ్యుడు మానవుడు బాల్య మున పదునాలుగేండ్లు దాటువరకూ చేసినపుణ్యాపాపములం తలిదండ్రుల చెందుననియె-స్త్రీకిని అంతెఫలముండునుగాని బాల్యమున 10 యేండ్లువరకు స్త్రీకి కామము మోహము గలుగదు. ఇట్టితరి బాలురుగాని, బలాత్కారముగ పెద్దలు గాని బొందిన తలిదండ్రుల కాదోషముచెందును. మరియు 11 వ యేటనుంచి లోనరజస్వల లేక బయటరజస్వల యగునను పరాశర వాక్యమునుబట్టి అట్టి దోషములుపోయి శుద్ధి స్త్రీ యగును. యీకాలమునుండి కొద్దికామము మోహముగలది యగును. గాన యీకాలాన బాలునిగాని పెద్దవానినిగాని పొందిన దోషయుక్తయగును అని తెలియుచున్నది. 11యేట నుండి స్త్రీ దోషములు స్త్రీకేగాని తలిదండ్రులకు చెందవని తెలియుచున్నది. బాల్యమునుండి పరునిబొందనిది నిర్దోషి యగును, రెండవది 11 యేటనుండి పరునిబొందనిదియు నిర్దోషి యగుననియు ఋషిమతము-గాన వీరిద్దరి నిషేకము రాజయోగ లగ్నమున చేయించిన సత్ఫలమే యిడుననదగును. వ్యభి

చారమువిడిచి బాల్యమున స్త్రీ లెంతవిద్యనేర్చిననూ శుభ ప్రదమేగాని వ్యభిచారిణియై విద్వాంసురాలైనను గౌరవము బాసి పరులను తన్నునశింపచేయును. సాధ్వియైన స్త్రీ నేడు పూర్వము యింట స్వతంత్రముగా విహరింపగలదు. వ్యభిచారిణి పూర్వము నేడును యింట నానాకష్టముల కలహాములు పడుచుండును. దుఃఖముతో కొంత కాలము కాపురముచేశినను తుదకు భర్తనువదలి పరభర్తలచేరుచున్నది. సాధ్వియైనను భర్త దుష్టుడై అన్యాయముగ భార్యనువిడుచుటయు జరుగుచుండునుగాని వ్యభిచారవృత్తి లేని దగుటచే భగవధ్యానము జపాదులుచేయుచు తలిదండ్రులకు అన్నదమ్ములకు, అప్పచెల్లెండ్రకు తాను చేయదగుపనులలో సహాయపడుచు కాలము గడుపును. పురుషులు చదువుపాఠశాలలగాక స్త్రీలు చదువుపాఠశాలల స్త్రీలు చదువుట మంచిది. భూలోకమున భారత దేశ స్త్రీస్వాతంత్రము శ్రేష్ఠమైనదిగాన యీ ధర్మములు పరదేశస్త్రీలకు భోధించుట సర్వోత్తమము.

—: వ్యభిచారమెపుడుపోవును? ప్రేమహిమ :—

యేదేశ, యేపట్టణ, యేగ్రామమున వ్యభిచారము స్త్రీలు మానుదురో అచ్చటనుండి వ్యభిచారరాక్షసి దుఃఖంచుచు వెడలిపోవును. ఆబోతుపై ప్రేమగల్గు ఆవు ఆబోతు వంటి సంతతిని గనుచున్నది. భర్తపై ప్రేమగల్గు స్త్రీలు వ్యభిచారములేనివారగుటచే భర్తవంటి సంతానమును గందురు. అపుడుమాత్రము "ఆత్మవై పుత్రనామాసి" అను వేదవా

క్యము సత్యము, ప్రత్యక్షమగును. సంకరముగాని సంతతి గల్గు టచే, ఆదేశ ఆపట్టణ ఆగ్రామ ఆగృహావాసులందరు సౌఖ్యము లందుచుందురు. స్త్రీ సంఘము దృఢసంకల్పముతో వ్యభిచారము మాన నిర్ణయించుకొని మానినచో వ్యభిచారరాక్షసి యేడ్చుచు భూలోకమునుండి పరలోకముచెందును. వ్యభిచార కారకురాండ్రు ఆసురీసంపద స్త్రీలేగాని, పురుషులుగారు. ఆవులు అతికామమునచేరిన ఆబోతు పొందునుగాని, ఆబోతుచేరినంత కామములేని ఆవులు పొందుటలేదు. ఆబోతులు బలాత్కారము చేసినను లాభముండదు. దాన ఆబోతు బలముగలదై రోగ రహితముగా సంచరించును. అట్లు పురుషుడు స్త్రీని బలాత్కారముచేయుట చాలకష్టతరము. స్త్రీ అంగీకారములేనిదే సంయోగముజరుగదు. గాన స్త్రీలే సంకరజన వృద్ధి చేయు చున్నారు. సాధ్వులు మంచివారిని గనుచున్నారు. సంకరుల గనుట మానిన జగమంతయు ధర్మమార్గమున నడువగలదు. గాన స్త్రీరక్షణ సత్సంతతివృద్ధియగునని తలంచి సంతానము గనుకాలమున ఎక్కువరక్షణమున తత్ఫలమునొందిరి. మహాత్మ్రాండ్రగు సాధ్వీస్త్రీలదయచేతను దుష్టస్త్రీరక్షణచేతను సత్సంతతి వృద్ధియై జగము బాగుపడగలదు. వారికిష్టములేనిచో జగన్నాశన కారకులగు హీనులను సృష్టింతురు. పురుష సహాయముచే జగము బాగుసేయుట నాశముసేయుట స్త్రీలచేతిలో యున్నది. గాన వారిని ధర్మార్థకామ తృప్తులచేసిన జగమును మూడు నిమిషములలో బాగుచేయగలరు.

—: స్త్రీకి భర్తఒకడా యిద్దరా? పురుషునికిభార్య ఒకతెయా యిద్దరా? :—

పరాశరస్మృతి:—'నష్టేమృతే ప్రవ్రజతే 'క్లీబేచ పతతేపతౌ, పంచస్వా పత్సునారీణాం' పతిరన్యో విధీయతే.' కన్యనిచ్చెదనని నిర్ణయమైనతర్వాత వివాహము కాకున్నచో ఆపురుషుడుచచ్చిన, నష్టుడయిన, సన్యసించిన, నపుంసకుడయిన జాతిభ్రష్టుడయిన అప్పుడు తండ్రి యీ 5 ఆపదలను ఆకన్యను మరియొకనికిచ్చి వివాహము చేయదగును. వాగ్దానము అన్ని దానములకన్న గొప్పది. దానిని తప్పరాదని భారతముగాని యిచ్చట యీ స్థితి స్త్రీకి వివాహముచేసిన దోషములేదని పరాశరమతము.

బృహత్పరాశరస్మృతి:— 'జీవన్వాపి మృతోవాపి, పతిరేవ స్త్రియ ప్రభుః'. భర్తచచ్చినను బ్రతికియున్నను అతడేప్రభువు అనగా మరల రెండవభర్తను పొందరాదని భావము.

రామాయణము:— విరాధుడు, ఒకస్త్రీకి యిద్దరు భర్తలు కలరాయని రామలక్ష్మణసీతలజూచి ఆక్షేపించెను, విధవయగు శూర్పణఖ ఖరునితో వ్యభిచారిణికిగలశిక్ష రాముడు తనకుచేసెనని చెప్పెను. బ్రహ్మర్షులు మొదలు రాక్షసులవరకు వ్యభిచారము, విధవావివాహము నిషేధముగా నున్నవి. స్త్రీకి భర్తవకడేనని వేదాదు లంగీకరించినవి. దైవీసంపదగల సాధ్వీలగు స్త్రీలు నేటికిని నడుచుచున్నారు. ఆసురీసంపద స్త్రీలు రహస్యముగాను బైటను ధర్మనును పాడు

చేయుచుందురు. గాన బాల్యమున సర్వస్త్రీ రక్షణయున్న కొంతధర్మ మీా ఆసురీసంపదస్త్రీలకుగల్గును. దాన భర్తను జేరిన కొందరైనను సాధ్వీలుగా మారగలరు.

—: పురుషునకు ఒకే పత్ని :—

భా ర త ము:— ఆదిపర్వము: 4 అ॥ ప్రతీపుడను రాజు గంగయొడ్డున తపముచేయ గంగ స్త్రీరూపధారియై కుడి తొడపై కూర్చుని నిన్ను పెండ్లాడవచ్చితినని అనగా

చం. అనిన ప్రతీపుడిట్లనియె నంబురుహాననయగ్నిసాక్షికం
బున పరిణీతయైనసతి బొల్పుగనొక్క తెగాని యన్యలన్
మనమున నేమియున్ దలప—

అని మదీయపుత్రుని పెండ్లాడమనియె. గాన ధర్మపత్ని ఒకటేయగును. రెండవది రతివర్ధనిగాని ధర్మపత్ని గాదు.

—"గౌతమధర్మసూత్రములు – వాత్స్యాయన సూత్రములు" :—

పురుషుడు ఒకభార్యను అనేకులను గాని పెండ్లాడదగునని గలదు. యెందరు భార్యలున్నను ప్రతిస్త్రీకి ఒకడేభర్త అయ్యెను. యిందు ధర్మపత్ని మొదటిది. తక్కినవారు రతివర్ధనులు. అనసంతతివృద్ధికై చేసుకొనువారు. రాజునకు సంతానమెక్కువగానున్న పరరాజుల భయములేక రాజ్యము గాపాడుదురని కొందరు రాజులట్లు చేసిరి. రాముడేకపత్ని గలవాడు. కృష్ణుడనేక పత్నులు గలవాడు.

ద క్ష స్మృ తి:— 'ప్రథమాధర్మపత్నీతు, ద్వితీయా రతివర్ధనీ" అనికలదు. రెండవభార్య ధర్మకార్యముల భర్తతో

కూర్చొనుటకు హక్కు లేదు. కొందరు రాజులు ఒకభార్య తోనే బలవంతులగు సత్పుత్రుల గని సౌఖ్యముచెందిరి.

ఉ దా హ ర ణ:— నలుడు, దమయంతి...

రా మా య ణ ము-యుద్ధకాండ:— 6 సర్గ—'సత్య కర్మాభి రక్తానాం నాస్తి మృత్యుకృతం భయం' అన సత్య ధర్మ మార్గస్థులకు అకాలమృత్యువు రాదు. దైవీసంపదల సాధువు లగు భార్యాభర్తలు అకాల మృత్యుభయములేక దీర్ఘాయు వుతో యిహపర సౌఖ్యములందెదరు. అసురీసంపద భార్యా భర్తలు త్వరలో నశించుటగాని దీర్ఘాయువున్ననూ భోజనము జరుగుట కష్టముగలవారై నానావిధములైన దుష్టమార్గము లాచరించి యిహపర కష్టముల గాంతురు.

మా ర్కం డే య పు రా ణ ము:— గయ్యాళి ప్రతి కూలభార్యయైనను, అందము లేనిదైనను వ్యభిచారిణికాకున్న భర్త విడువరాదు.

ఉ దా హ ర ణ:— ఉత్తమ మనువు కథ—బ్రాహ్మ ణుడు అతనిభార్య చదువుము. మనుస్మృతి:— 9 అ. భార్య కల్లుత్రాగునది, అధర్మచారిణి, ప్రతికూల నిత్యరోగిణి, సేవ కుల, భర్తను, బంధువుల హింసించునది, ధనము నాశనము చేయునది భార్యయైన మరియొకదానిని పెండ్లాడదగును. మొదటిభార్య రజస్వలయిన 8 యేండ్లలో సంతతి లేకున్నను, మృతవంధ్య యైనను, ఆడపిల్లల గనునదైనను, యెదురుతిరిగి కలహములాడునదైనను విడిచి యింకొకదానిని పెండ్లాడదగును.

దీనింబట్టి స్మృతికారుడు సత్పురుషవృద్ధికే రెండవ వివాహము నిర్ణయించునట్లు తెలియుచున్నది. దుష్టసంతతిని గనుటకు కాదని గ్రహింపదగును.

82 శ్లో. ఏది రోగియయ్యు భర్తకిష్టమైనదో పతివ్రతయో అట్టి ఆమె ఆజ్ఞబొంది వేరొక వివాహము చేసికొనవచ్చును. ఆమెను యెపుడును అవమానించరాదు. వ్యభిచారిణి ప్రతికూలయగు దుష్టభార్య ఆజ్ఞమాత్రము అవసరములేదని తెలియుచున్నది. బహుభార్యలుండుట రాజులకేగాని గృహస్థులకు గాదని తెలియుచున్నది. శంకరుడు భూతేశ్వరుడు గాన జలభూతపతి యగుటచే గంగకు భర్తఅయ్యేనేగాని పార్వతిని పెండ్లాడినట్లు పెండ్లాడలేదు.

— "పరపురుష సంయోగము దోషముగాదా" —

మనుస్మృతి:—5 అ. 'ఉపచర్యః స్త్రియాసాధ్వీసతతం దేవవత్ పతిః'. భర్తను సాధ్వులగు భార్యలు దేవుని వలె ఎప్పుడు చూచుచు గౌరవింపదగును. ఆ దివ్యదృష్టిచే భర్త దుర్గుణములు బాసి సుగుణవంతుడై భార్యయందు ప్రేమ గలవాడగును. ఇందు ఆదివ్యదృష్టి విడిచి భర్తను పొందమని లేదు. ఆ దివ్యదృష్టిగలదై భర్తను పొందమని భావము. అవతారపురుషునిగాని బ్రహ్మర్షినిగాని అనగా దేవుడుగామారిన మానవపుంగవుని పిత్రాజ్ఞ, భర్త్రాజ్ఞ ఉన్నను లేక పొందినను దోషములేదు. అవతారపురుషునిగాని, దేవునిగా జూడబడు భర్తనుగాని బ్రహ్మర్షినిగాని పొందుట సమఫలమనియు, దోషము లేదని పూర్వర్షులనుభవమును వ్రాసిరి.

ఉదాహరణః— మత్స్యగంధి, పరాశరుడు, బ్రహ్మర్షిగాన ఆమెకు సంయోగయజ్ఞమునగల సర్వదోషములు హరించి జగత్కల్యాణదాయకుడగు వ్యాసుని పుత్రునిగా గనినాడు. వ్యాసుని మహోపకారము జగమందందరెరింగినదే గదా. ఒకసారియే ఆమెను పొందెను. మరల సత్యవతి మొగమైన ఆయన చూడలేదు. యిందు తండ్రిఆజ్ఞ లేదు.

వశిష్ఠుడు- బ్రహ్మర్షిః— సూర్యవంశము కల్మాషపాదునితో నశింపనున్న కాలాన అతడు భార్యయైన మదయంతిని వసిష్ఠునికిడ సూర్యవంశవృద్ధికై ఒక పుత్రుని గనెను. యిందు భర్త్రాజ్ఞగలదు. మరల ఆమె మొగము జూడలేదు.

వ్యాసుడు బ్రహ్మర్షి—చంద్రవంశముః— అంబ అంబాలికలయందు ధృతరాష్ట్ర పాండురాజులగాంచెను. మరల ఆ స్త్రీల మొగముజూడలేదు. యిందు పితృభర్త్రాజ్ఞలులేవు. గాని మాత్రాజ్ఞ, బావగారగు భీష్మాజ్ఞగలదు.

సూర్యుడు — కుంతిః— 'అసావాదిత్యో బ్రహ్మ' ఆసూర్యుడే బ్రహ్మము. యితనిని పిత్రాజ్ఞలేకయే బాల్యమున మంత్ర పరీక్షచేసిబొంద కర్ణుడుదయించెను. దానగల్గు సర్వదోషములు సూర్యుడు హరించెను. మరలామెను సూర్యుడు చూడలేదు. పాండవులు కర్ణవధానంతరము తమ తల్లిచేసినది తప్పని భావించిరి. ఆశ్రమవాసపర్వమున వ్యాసునితో కర్ణజననము కుంతిజెప్ప ఆ బ్రహ్మర్షిదోషము లేదనియు నీవు సాధ్వివనియు జెప్పెను. తల్లిచేసినది దోష

మన్న ధర్మరాజు స్వర్గమునకు వెళ్ళినపుడు పాండురాజువద్ద దోషములేని సాధ్వులగుటనే కుంతిమాద్రులు సుఖముగా నుండుట జూచినాడు. గాన కుంతి నిర్దోషి, సాధ్వియనుట కే సందియములేదు. చచ్చిన తరువాత సాధ్విగానిది భర్తను బొందలేదు. స్త్రీలు సురోత్తముడగు సూర్యుని బొందినదోషులుగారు.

శ్రీకృష్ణుడవతారపురుషుడు:— భర్త్రాజ్ఞపిత్రాజ్ఞలు విడిచి యితని సంయోగము జెందిన స్త్రీలు, దోషులని నిర్ణయింపబడలేదు.

భారతము — ఆదిపర్వము:— యుచంధ్యుండను ముని అతని భార్య మమత గర్భిణిని బృహస్పతిబొంద గర్భస్థ శిశువు ఆ శుక్రము క్రిందికి త్రోసెను. దాన అంధునిగా బృహస్పతి శపించెను. అంధుడుగా పుట్టి దీర్ఘతముడను పేరు బొందెను. దేవగణములలో సోమగంధర్వాదుల వలెనే దేవ గురుడు స్త్రీ, భర్తను బొందిన తర్వాత బొందిననే పరిశుద్ధ సంతతి గల్గుననియు, అతడు పొందనిచో గొన్ని అవయవములు దోషమగునని తెలియుచున్నది.

అత్రిస్మృతి:—'సోమశ్శౌచః దదౌ తాసాం గంధ ర్వాశ్చ తథాంగిరాః। పావకస్సర్వమేధ్యత్వం। మేధ్యత్వం యోషి తాంసదా'. సోమగంధర్వ బృహస్పతి అగ్నులు స్త్రీలపొందిన పూర్ణశుద్ధులగుదురు. యీ దేవగణము స్త్రీలనుబొందిన దోష ముగాదు. యీ దేవతలు పొందనిది స్త్రీకి సుకన్యాత్వ సిద్ధి

సత్సంతతి గల్గదని భావము. దీనిని వ్యభిచారము క్రింద యేఋషియు వ్రాయలేదు.

బ్రహ్మర్షి సంగమము భారతము, ఆదిపర్వము:— పరశురామునిచే చచ్చిన క్షత్రియుల భార్యలు బ్రహ్మర్షుల సంతతి వృద్ధిచేసిరి. వారును ధర్మమార్గస్థులై ప్రజారక్షణ చేయుటవలన అనవరతయాగముల పర్జన్య ప్రసాదనముగోరి నపుడు వర్షము కురియుటచే సకలసస్యవృద్ధి ప్రజావృద్ధియైనది. గాన బ్రహ్మర్షిచే సంతతివృద్ధికి భర్త్రాజ్ఞలేకున్నను దోషము గాదు. వీరు సృష్టిలోనే రాజర్షుల బ్రహ్మజ్ఞానుల సృష్టించ గలరు. పడమట దేశీయులు ఖనిజరసాయన శాస్త్రములు విమర్శించినట్లు పూర్వర్షులు స్త్రీపురుష సంగమమువల్లగల్గు దోషాదోషములు సత్సంతతి దుస్సంతతిని విమర్శించియే వ్రాసిరన దగును. బ్రహ్మర్షులు యోని యెద్దియైనను బ్రహ్మ జ్ఞానులనే గందురని భారతమున గలదు.

తర్వాత కొంతకాలమునకు యీ క్షత్రియవంశములు అధర్మమునబడుటచే రాక్షసాంశజులగు శిశుపాల జరాసంధా దు లుదయించిన, కృష్ణుడు పుట్టి వారినందరి ఖండించి ధర్మము స్థాపించె. భూలోకమున ప్రస్తుతము రహస్యముగా మహాపాప ములెక్కువగా చేయువారుండి బయటికి ధర్మస్థులయినట్లు గన్ప డుచు తమ మార్గము యితరులకు తెలియకుండ రహస్యముగ నుంచి జీవించుచున్నారు. ఒకవంక ప్రత్యక్షపాపములో ఆకా శమువంక చూచుచు (అనగా మారుమాటాడకుండుట) సర్వ

శుష్కవేదాంతులు మాత్రము భగవద్గీతాదులు చదివి ఉప న్యాసాలు చెప్పుటేగాని ఆ మార్గము అర్థముగాక, నడచుట మాని తత్ఫలముగల్గుట వ్యర్థమని పరపురుషులకు స్త్రీలకు బోధించి అధర్మముచేయుచు ధర్మజ్ఞులచే అవమానముపడుచు తుదకు నరకము గాంతురు. వీరే సామాన్యరాక్షసాంశజులు. వీరికై విష్ణువు పుట్టడు. (పద్మపురాణము — కంసునితల్లితో ఆమెను పొందిన రాక్షసుడు వేదాది గ్రంథములు చదివి అట్లా చరింపక స్త్రీలను బాధించుట మొదలగు దుష్టకార్యముల నుండునట్లు బ్రహ్మసృష్టినుండి రాక్షసజాతివారి కర్మములని చెప్పెను. గాన శుష్కవేదాంతులు దుష్టపండితులగువారిని గుణకర్మములను బట్టి తెలిసికొనుడు).

—: ఇంద్రాదిదేవతల బొంద భర్త్రాజ్ఞ గావలెను :—

అహల్య భర్త్రాజ్ఞ లేక కామముచే యింద్రుని బొంద గౌతమునిచే శపింపబడినది. యింద్రుడును శపింపబడి యింద్రు డంతనే బోవక ఆపాపమునకు రావణునికొడుకు యింద్రజిత్తుచే బంధింపబడగా బ్రహ్మ విడిపించినట్లు రామాయణమున ప్రథమ ఉత్తరకాండలగలదు. అహల్య నానాకష్టములపాలై తుదకు రామదర్శనమున పవిత్రురాలై భర్తనందెను. యిందుభయులు కష్టములందిరి. భర్త్రాజ్ఞచే యింద్రాదుల బొందిన కుంతి నిర్దోషిరాలై యిహపరములందెను. భర్త్రాజ్ఞ గల్గిగాని లేకగాని బ్రహ్మర్షుల అవతార పురుషుల సూర్యుని భర్త్రాజ్ఞచే యింద్రాది దేవతలదక్క స్త్రీలు భూలోకాన భర్తలదక్క బ్రాహ్మణాదిజాతు

లలో నే మానవుని బొందినను మహాపాపులగుదురు. భర్త వంశాంత మొనరించు పాపము నొందుదురు. వేదాది సద్గ్రంథపఠనము. సత్యధర్మాది న్యాయమార్గస్థులు తమజాతి లేక సంఘమునకు జెప్పు సద్గుణకర్మములుగల బ్రాహ్మణాది నాల్గు సంఘములవారు యింద్రాది దేవతల భర్తలవంటి సంతతిని గనగలరు.

మనుస్మృతి:—9 అ॥ 64 "శ్లో॥ నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యాద్ద్విజాతిభిః" పూర్వమందు ద్విజాతులన బ్రాహ్మణ క్షత్రియవైశ్య వృత్తులుగలవారు. వారిలో విధవకు నియోగములేదు. సచ్ఛూద్రులకు పంచయజ్ఞములు గలవారు గాన వారును ద్విజులవంటివారే. ఆసంఘమున విధవకు నియోగములేదు. (రాజవంశములు నశించుతరి బ్రహ్మర్షులవల్ల సంతతి గాంచిరిగాని పైనాల్గు జాతులవారియందు నియోగములేదు. ప్రతిరాజ్యమేలు రాజు వ్యభిచారము లేకుండచేయుట ప్రథమ కర్మము. తర్వాత తస్కరాదిదుష్టవృత్తులు లేకుండాచేయుట గల్గిన అతనికిమాత్రము స్వర్గముగల్గునని మనువు వ్రాసెను. పూర్వమునుండి నేటివరకు భూలోకమున ఆసురీసంపద జనులు మాత్రము బ్రహ్మర్షులవలె చరించుచు, కొందరు సజ్జనులవలె గన్పడుచు, కొందరు సాధువులగు యోగులువలె సన్యాస రూపమునచరించుచు పరస్త్రీల వ్యభిచారమొనరించి దుష్ట సంతతిని వృద్ధిచేతురు. (యీ రాక్షసజాతిసంఘము బ్రాహ్మ ణులుగారు బ్రహ్మర్షులుగారు బ్రాహ్మణసంఘము వర్ణము

గురిపించువారు. క్షత్రియులన సైనికాదియుద్ధవృత్తులుగలవారు. వైశ్యులన వర్తకాదులుగలవారు. శూద్రులన వ్యవసాయాదులుచేయువారు. వీరందరు రాజ్యసహాయముచేయువారు. యీసంఘములోనివారుగాని యితరులుగాని, ఆసురీసంపద వారుగాని నిష్కామ సన్మార్గస్థులై భగవద్ధ్యాన పరులైన రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులుగామారి యిహపర సౌఖ్యము లందగలరు.

—: ఒకే సంఘములో అనేకసంఘములు సృష్టిచే గుణకర్మములచే మార్పు జెందుట :—

అత్రిస్మృతి:—"దేవో ముని ర్ద్విజో రాజా వైశ్య శూద్రో నిషాదకః పశుర్మ్లేచ్ఛోపి చండాలో విప్రా దశ విధా స్మృతాః" బ్రాహ్మణసంఘములో, దేవ, ముని, ద్విజులును, రాజవైశ్యశూద్రులు సత్కర్మములు గలవారు. తక్కినవారు దుష్కర్ములు. పైకివీరు బ్రాహ్మణసంఘస్థులైనను ఆయా గుణకర్మఫలములనే యిహపరముల నందెదరు.

ఉ దా:— వాల్మీకి బ్రాహ్మణసంఘుజుడు. కిరాతుల జేరి కిరాతుడయ్యెను. మరల దేవర్షియగు నారదుని కృపచే బ్రహ్మర్షియై లోకోపకారముగా రామాయణాది సద్గ్రంథములు వ్రాసెను. భారతదేశములో చాలకాలమునుండి యీ సంఘములు తమతమ ఆచారములలో కొన్నింటితోనైన జరుగుచుండుటచే పశ్చిమదేశజులవలె వారినివీరు వీరినివారు వివాహాదులు జేయుడన అభ్యాసములులేక గుణకర్మములు సరిపోక

సాగుటలేదు. యిట్లు కొన్నివందల యేండ్లు అభ్యసించిన మార్పు చెందగలదు. గాక వారినివీరు వీరినివారు వివాహమాడినను సత్సంతతి వర్ధిల్లకే గదా. యిట్టిమార్పులవల్లను లాభములేదుగాన యెవరి సంఘములో వారు తమకుదగిన గుణకర్మానురాగము గలస్త్రీని పెండ్లాడు టుత్తమమైయున్నది. ప్రతిసంఘమున దుష్టసంతతి వృద్ధిగాకుండా చేయుటే గొప్పధర్మము. గనుకనే అత్రి బ్రాహ్మణసంఘములో దుష్టులనిర్ణయించినాడు. అనగా వారికి వివాహములు సేయరాదనిభావము. దాన దుష్టసంతతి వృద్ధిగాదని తెలియునది. క్షత్రియాది సంఘములలోను పై బ్రాహ్మణసంఘములోవలె పదిరకములుండును. గాన వారిలో దుష్టులవిడుచునది. సాధుస్త్రీలు సాధుపురుషులు పెండ్లాడునది. సంఘముగదా అని ఆసురీసంపద స్త్రీ పురుషులసంబంధములు పొందరాదు. దీన దైవీసంపద స్త్రీ పురుషులువృద్ధియై సంఘములు యశోవంతములగును. సూర్యచంద్ర వంశరాజులకు మూలమగు సూర్యుడు చంద్రుడు బ్రహ్మర్షులగు అదితి కశ్యపులకు అత్రి అనసూయలకుపుట్టిరి. వీరిని బ్రాహ్మణులుగా నిర్ణయింపదగినది. అదివిడిచి గుణకర్మములలో క్షత్రియులనిరి. వృత్తులతోనే కులనిర్ణయమైనది గాన దైవీసంపద స్త్రీ పురుషులు సద్రుతుకాలాన ముత్యములువలె వృద్ధియగుదురు. ఋతుకాలమన రజస్వలమొదలు 16 దినములు. అందు మొదటి 4 రోజులు. 11, 13, దినములుతక్క తక్కిన 8 రాత్రిలు సద్రుతుకాలము. ఇందు దైవీసంపదవారు, పుట్టుదురు

తక్కిన రాత్రుల ఆసురీ సంపదవారు పుట్టుదురు. గాన ఆకాలమున స్త్రీని బొందుట మానుకే లోక కల్యాణము చేయుట. భూలోకమున యితర దేశములలో ఒక సంఘ స్త్రీలను యింకొక సంఘస్థులు వివాహమాడుట అలవాటైనది. వారట్టులే చేసికొనుచు దుష్టుల దుష్టస్త్రీల విడుచుట లేదు. వివాహములలో కొత్త మార్పులు చేయునవిలేవు. సత్సంతతి వృద్ధికొరకే అయియున్నది. భారత దేశములో మహర్షి, బ్రహ్మర్షి, రాజర్షులు యే సంఘస్త్రీని పెండ్లాడిన నిర్దోషులయి సత్సంతతినే గనినారు. అట్టివారిపుడు అరుదుగాయున్నారు. గాన చాలకాలాభ్యాసముగానున్న స్వసంఘములో దైవీసంపదస్త్రీలను, దైవీసంపదపురుషులు వివాహమాడుట గుణకర్మములు తుల్యమై సౌఖ్యహేతువగును. భూలోకము మిశ్రమమున పుణ్యపాపములతోగూడిన దేహధారులుగల లోకము. దైవీసంపద వృద్ధిచేయుట మంచిదిగాని యేమాత్రముతప్పిన ఆసురీసంపద గల్గును. గాన ఆసురీసంపద యీలోకాన నశింపదు.

ఉ దా:—పరాశరుడు రాక్షసుల నంతముచేయ ప్రారంభించియు, జనమేజయుడు సర్పజాత్యంతముజేయ ప్రారంభించియు తత్కార్యసిద్ధి చెందకపోయిరి. ఏమూలనో కొందరు గృహస్థులు తెలిసియో తెలియకయో ఆసురీసంపదను భూలోకమున బుట్టించుచునేయుందురు. నూటికి తొంబదిమంది దైవీసంపదయు, పదిమంది ఆసురీసంపదయు గల కాలమే కృత

యుగమని నాయూహా. అపుడు ఆసురీసంపద పూర్తిగ పోదు గాని అణగియుండును. కలియుగమన ఆసురీసంపద వృద్ధి, దైవీసంపద తగ్గినకాలమనదగును. భూలోక కులములు సంఘము లీరెండుసంపదలుగా చెప్పబడును. ఏసంపదవా రాసంపదవారితో స్నేహమున మెలంగుచుందురు. యిది భూలోక సహజము.

—: మానవ సంకరవృద్ధి లాభములేదు :—

మను వు:—చెడునడవడి, నిష్ఠురవాక్యములు, చంపెడి స్వభావములేక తాను అక్రిమముగ చచ్చెడి స్వభావము అధర్మకర్మములుచేయుట సంకరజనలక్షణము.

మనుస్మృతి:— 'యత్ర త్వే తే పరిధ్వంసా । జాయంతే వర్ణదూషకాః । రాష్ట్రివై స్సహాత్ద్రాష్ట్రంక్షిప్రమేవ వినశ్యతి॥' యెచ్చట అధర్మకాలముల ఋతుకాలములో చెడుదినముల, ఋతుకాలము 16 దినములు దాటినతరువాతి రజస్వలగువరకు గల కాలమునను, వ్యభిచారమునను, సంతతి వృద్ధిచేతురో ఆరాజ్యము జనులతో త్వరలో నశించును. సాధువులకు బాధలు గల్గును.

ఉదా:— రావణుడు రాజ్యస్తులతో నశించెను. విభీషణుడు సాధువగుట అవమానముమాత్రముపడి తుదకు రాజ్యమేలెను. రాజ్యమేలు రాజుగాని, గృహరాజులుగాని తమ రాజ్యమున,

భారతము - శాంతిపర్వము:— సకల ధర్మ

సంకర రక్షయు నృపతి యెపుడు నడుపవలయును. సంఘధర్మ సంకరముచే దుష్టజనాభివృద్ధియగును. పంటచేలో కలుపు మొక్క వృద్ధియైన యజమాని వూహించినపంట నశించును. దానిని తొలగించిన పరిశుద్ధధాన్యము పండును. అటులే సత్సంతానవృద్ధి యగును. లేనిచో భార్య వ్యభిచారిణియై వారికి వారికి కొందరను, భర్తకు కొందరను గనినచో వారికి వారికి కుదరక కలుపుమొక్కలు వరివలెనే యెదుగు బొదుగు లేక కలహములతో బాధపడుదురు. పరులకేపిల్లల కనినచో భార్య భర్త కుటుంబాంతము చేసిన పాపియగును.

రామాయణము - ఉత్తరకాండ:— రాజ్యమేలు రాజుగాని, సంఘముగాని దుష్టులైన ఆపాపము ఆరాష్ట్ర జనుల నెక్కువ బాధలు, అకాలమృత్యువుల నిచ్చును.

—: గర్భపాతము సేయరాదు :—

పరాశరస్మృతి:— 4 అ॥ 19, 20 శ్లో॥ దుష్టవృత్తి నుండి గర్భముదాల్చి దాని పాతముచేసికొన్న స్త్రీతో సంభాషింపరాదు.

శ్లో॥ యత్పాపం బ్రహ్మహత్యాయా ద్విగుణం గర్భపాతనే।
ప్రాయశ్చిత్తం నతస్యాస్తి తస్యా త్యాగీ విధీయతే॥

ఒక బ్రహ్మహత్యకు ప్రాయశ్చిత్తము గలదుగాని రెంటికి లేదు. అట్టి స్త్రీని విడువదగినదని ఋషులు వ్రాయుట దీనిం బట్టి సత్సంతతి వృద్ధికేనని తలంపనగును. అదివిడిచి దుస్సంతతి కన్నను వారికేదో సత్కర్మమార్గమే ఋషులు వ్రాసిరి.

గ ణే శ గీ త:— 'ఛండాలోకి భజన్ భక్త్యా బ్రాహ్మ ణేభ్యోధికోమమ॥' అని గణేశుడనెను. నన్ను పూజింపని బ్రాహ్మణ నామధారకునికన్న పూజించు ఛండాలుడే అధికుడు. భగవద్భక్తిలేని ఛండాలుడే హైన్యుడు. మంచి వారిని గనిన నష్టములేదుగదా. దుస్సంతతి గనుట ఋషుల కిష్టములేదు. ఒకవేళ గనినవారికి సత్కర్మములు భగవద్భక్తి బాల్యమునుండి నేర్పదగునని వ్రాసిరి. గాన కొందరైనను బాగుపడుదురని ఋషుల వూహ. గర్భపాతమున ఆలోకము నుండి యీలోకానికివచ్చు యాత్రికుల మార్గబంధము జేయుట వంటిది. పైగా శిశుహత్యాఫలమిడును.

శి వ గీ త:— 8 అ॥ 9 శ్లో॥ స్త్రీకి రజోదర్శనము మొదలు 16 రాత్రులు ఋతుకాలము. 5, 6, 7, 8, 9, 10, 12, 14, 15, 16 యీదినముల శుక్రాభివృద్ధి గల పురుషునకు సరిరాత్రిల — పురుషుడును (పుత్రిలును), శుక్రాభివృద్ధి తక్కువగల పురుషులకు బేసిరాత్రుల — పుత్రికలు పుట్టుదురు. ఒకనాటికన్న వకనాడధిక సద్దన గుణకర్మములు గలవారు పుట్టుదురు. పుత్రికలు అట్లే పుట్టుదురు. "షోడశేదివసే గర్భే జాయతే యది సుభ్రువః। చక్రవర్తీ తథారాజా జాయతేన ససంశయః" ఋతుకాలమున 16వ రాత్రి శుక్రాభివృద్ధిగల పురుషుడు శోణితహీనమైన అతికామముగల స్త్రీని పొందిన యెడల చక్రవర్తిగాని రాజుగాని (లేక మహాపురుషుడుగాని) పుట్టును. 15వ రాత్రి శుక్రము తక్కువై శోణితాభివృద్ధిగల

భార్యకు అతికామము గల్గినసమయము బొందిన నిల్చిన రాణి పుట్టును లేక (మహాత్ముంరాలు) పుట్టును.

తైత్తిరీయోపనిషత్తు:— 'బ్రహ్మణ్యాం బహు పుత్రతాం ప్రజాసందధాతు॥' బ్రహ్మణ్యులగు అనేకుల పుత్రులను అట్టి పుత్రికలను పరమాత్మ నాకు గలిగించుగాక. అని పూర్వగృహస్థుడు భగవంతుని ప్రార్థించినాడు. అటులే నేడును గృహిణి గృహస్థుడుచేసి అట్టిసంతతిని గనదగినది. యింతకన్న వేరుమార్గములేదు. వేరుమార్గములేదు. దైవీసంపదవారికి ధనాదులులేనిచో పండ్లు, ఆకులు, నీళ్ళు, గాలిపీల్చి పరాపకారములేక తపస్సుచే బ్రహ్మర్షులయి జీవింతురు. ఆసురీసంపద వారు వృద్ధియైన ధనాదులున్నను లేకున్నను బాధలతో దుష్టవృత్తులతో రోగాలతో నష్టాలతో గొల్లుమని యేడ్చుచు పరుల నేడ్పించుచు జరుగగలరు.

దృష్టిదాని ఆధిక్యత:— ప్రత్యక్షఫలము అనుభవమునకు సరిపోదనువారికి ఆవు గుఱ్ఱము, వ్యభిచారిణి దృష్టియందున్న రూపముల సృష్టింతురుగదా యని బుద్ధిచెప్పనది.

సంయోగయజ్ఞము:— భారతము – అనుశాసనికము 2 అ॥ మానవులలో మునిసత్తములు, ఉత్తమతపోజ్ఞాన విద్యాప్రభావంబులన్ జేసి తదీయ బీజసంజాతులు యోని యెద్దియైనను బ్రాహ్మణులగుదురు. అనగా భగవంతుని రూపము చూచుచు శక్తిగలవారగుదురు అని గలదు. తర్వాత తపోబలంబున బ్రహ్మర్షులగుదురు. బ్రహ్మర్షులనువారి

భార్యలు భగవంతుడుగా మారినారని శివునిగా విష్ణువుగా చూచుటమాని వారినే ప్రేమించి బ్రహ్మజ్ఞానులనగా బ్రాహ్మణులగనిరి. యీబ్రాహ్మణి జన్మము అనగా నిత్యము భర్తను దేవునిగా చూచుచు సంయోగయజ్ఞమున భర్తను, తన్నుగదిలంతటను దేవునిగాచూచుశక్తి కుదిరినది. యీమె పుణ్యాక్షేత్రమువంటిది. దీనిని పండించుటకు తగిన కృషి బ్రాహ్మణుడు చేసిన పండును. లేనిచో పూర్ణ ఫలము గలుగదు. యీ సృష్టిలోనివారలు పుట్టుకతోనే బ్రహ్మజ్ఞానమార్గస్థులయి త్వరలో బ్రహ్మర్షులగుదురు. పుట్టుకతో జీవన్ముక్తుడు లేక బ్రహ్మర్షిగా పుట్టవచ్చును.

విష్ణువు పుట్టుట:— భాగవతము- 5 స్కంధము.

"భారతవర్ష జంతువుల భాగ్యము లేమనిచెప్పవచ్చు నీ।
భారతవర్షమందు హరి బల్మరుపుట్టుచు ప్రాణికోటికిన్ ।
ధీరతతోడ తత్వముపదేశముసేయుచు చెల్మినేయుచున్ ।
ఆరయబాంధవాకృతి కృతార్థులజేయుచునుండునెంతయున్॥

భారతదేశజుల భాగ్యము గొప్పదిగదా. ఇందు విష్ణువు చాలసార్లు పుట్టి ప్రాణులకు చుట్టము చెలికానివలె నవ్వుడుచు నిష్కామముగా- తత్వం అనగా ఆభగవంతునివలె అయితివను అనగా మానవుడు బ్రహ్మర్షియగు యుపదేశము చేయుచు తిరుగుచు పోవుచుండును. బ్రహ్మర్షులయినవారును, నిష్కామముగా సర్వవిధముల ఫలితమిడు జ్యోతిర్విద్యాది శాస్త్రముల మానవులు రాజర్షి, ఋషి, మహర్షి,

బ్రహ్మర్షి అగు మార్గములు, ఉపనిషత్తులు మొదలగువానిలో వ్రాసి ప్రచారముచేసియున్నారు. వ్యాసావతారమున అనేక పురాణేతిహాసాదులు వ్రాసి మహోపకారముచేసెను. నేడు పురాణేతిహాసములు తప్పులనువా రనేకులున్నస్థైరుంగుదును. గాని పర్వతశిఖర మెక్కవలెనన్న మొదట పెద్దదిగానుండు టచే ఎక్కువ కష్టముగానున్నట్లు అక్కడక్కడ పేర్లు కథలు కొద్దిభేదములు గన్పడినను, గొప్పగొప్ప ఫలములిడు మార్గములు వ్రాసినాడు. వైద్య, రత్న, సాముద్రిక, మంత్రి, వేదాంతాదిశాస్త్రములు పురాణాలలో గొప్పగా జేర్చినాడు. ఇంక ననేకధర్మఫలమార్గములు వ్రాసినాడు. వేదోపనిషత్తులలోయున్న సత్సంతానాభివృద్ధి మార్గములకన్న అవతార పురుషులగను మార్గము భాగవతమున శ్రీకృష్ణజననము, వామనజననమున గలదు. ఆమార్గార్థము చెప్పగలిగినవారు ప్రజల బోధించిన జగమున గృహస్థులెందరు భగవంతుని పుత్రునిగా, భగవతిని కూతురుగాగని సకలసౌఖ్యము లొందుదురనియే వ్యాసుడు వెల్లడించెను. యేమి యితని విశాలహృదయము! గనుకనే పుట్టినతర్వాత తపస్సుచేసి జీవుని దేవునిగా మార్చి భగవంతుడైనాడు. అందుననే "వ్యాసో నారాయణో హరిః" నని గలదు. అవతారమున పుట్టినదాది సర్వశక్తివంతుడై దుష్టుల హరించి సాధురక్షణ సేయువాడు. బ్రహ్మర్షి యితని తుల్యుడు. పుట్టినదాది బ్రహ్మజ్ఞానముగలవాడై కొంత కాలము తపస్సుచే బ్రహ్మర్షి యగు.

బ్రహ్మైక్యసిద్ధుడగు బ్రహ్మర్షిని దేవునిగా జూచినది అవతారపురుషుల గనును. బ్రహ్మర్షియైన భర్తను దేవునిగా జూడక భర్తగానే జూచునది బ్రాహ్మణుడన బ్రహ్మజ్ఞానిని గనును. ఉ॥ విశ్వామిత్రాది బ్రహ్మర్షులు బ్రాహ్మణ క్షత్రియాదులనేకుల గనిరి. కశ్యపబ్రహ్మర్షి యితని భార్య అదితి యీ మెయందు అనేక విధములగు సంతతిని గనియె. ఆ అదితికి విష్ణు ప్రత్యక్షమై

కం. నీరమణుని సేవింపుము నా
రూపము మానసించి నళినీగర్భా
గారంబు వచ్చి జొచ్చెదఁ గా
రాబున బెంపవమ్మ కరుణన్ నన్నున్.

నీ భర్తయు బ్రహ్మర్షి లేక ప్రజాపతియగు కశ్యపుని సంయోగ యజ్ఞమున విష్ణువు అనగా నావంటివానిగా జూడుమని బోధించినాడు. అట్లే చూచినది. కశ్యపుడు విష్ణునైక్యముచేసి అంతట విష్ణునిజూచినాడు. దాన వామనుడను విష్ణువు బైటబడినాడు. విష్ణ్వండములోనున్న విష్ణుని బ్రహ్మాండములోనున్న వానిగా జూచినవానికి అనగాభూలోకమునున్న వానిగా జూచినవానికే ప్రత్యక్షమగు ఫలమిడును. తన పూర్వ సంతతికన్న అదితికశ్యపులకు బలవంతుడీ దృష్టితో పుట్టినాడు. రాజర్షులగు దశరథ కౌసల్యలు వసుదేవదేవకులు, రాముని కృష్ణుని యిదే మార్గమున కనగల్గిరి. దీనింబట్టి కలియుగమున ప్రతియింట దేవుని పరమేశ్వరిని గనవచ్చుగదా! అది

విడిచి ప్రస్తుతము దుర్మార్గమునకు జనులెక్కుడు పోవుటయు, సన్మార్గమునకు తక్కువగా పోవుటంబట్టి యిట్టి దృష్టిపరీక్ష సేయక హీనమార్గాలనడచుచు దుష్టులను బలహీన సన్మార్గుల గనుచున్నారు. మరియు దుష్టులు భగవంతుడు లేడను నమ్మకముగల వారగుటచే వారికాదృష్టియే యుండదు. భర్తలవంటివారినే గని లోకాపకారమునకు సహాయపడి అపుడపుడు జయముగలిగి రాజ్యములేలినను తుదకు దుష్టులు సమూలనాశనమైరి. ఉదా॥ నివాతకవచులు, అసురులు, రాక్షసులు మొదలగువారు.

భగవద్గీత:— 'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతిభారత।అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజామ్యహాం' ఎప్పుడెప్పుడు ధర్మముతగ్గి అధర్మము వృద్ధియగునో అపుడపుడు నాయంతట నేను పుట్టుదునని కృష్ణుడనెను. దీనింబట్టి భార్యాభర్తలు తమరూపముల చూచుటమాని సంయోగయజ్ఞమున సర్వము భగవన్మయముగా చూచుచు ఋతుకాలాన భార్యకు ఎక్కువ కామముగల్గునాడు శుక్రాభివృద్ధిగల భర్త భార్యను బొందిన అదితివలె గర్భధారణమై అవతారపురుషుని గనును- యీ సంయోగయజ్ఞమున భార్యాభర్తలున్నను వారిరూపములు లేక అంతయు భగవద్రూపమే అయివున్నది. గాన కృష్ణుడు నాయంతట నేను పుట్టెదను అనుదానికి సరిపోయినది. మానవులిట్లు చేయకున్ననూ సర్వలోక ప్రభువు దేవుడు గాన తన రాజ్యమగు భూలోకములో దుష్టులువృద్ధియైనచో విష్ణువు

నరశింహాది రూపాల భార్యాభర్తల సంబంధము లేక పుట్టశక్తి వంతుడు గాన పుట్టగలడు. యిట్టి గొప్పసృష్టులు రాజర్షి, ఋషి, మహర్షి, బ్రహ్మర్షులు చేయగలరు. గాని సామాన్య ధర్మలగు బ్రాహ్మణక్షత్రియాదులు సన్మార్గులయిన ద్విజులన దేవతలగా మారదగు పురుషుల స్త్రీలను సాధుపురుషుల పుట్టింపగల్గిరి. లేనిచో వీరు దుర్మార్గులయిన ద్విజులన రాక్షసులు గామారిన మానవుల పుట్టింపగలరు. సంయోగయజ్ఞమున కుక్కలు, ఎద్లు, గేదెలు, పక్షులు మొదలగువాటి రూపముల ప్రేమతో చూచుచు వారు అట్టి గుణసంపద మానవుల గనగలరు.

ఉత్తరగీత:— 'జ్ఞానేనహీనపశుభిః సమానః'. జగమును భగవంతునిగ జూడనివాడు పశుసమానుడగును. 'విద్యా విహీనః పశుః.' బ్రహ్మవిద్య నేర్వనివాడు పశుతుల్యుడగును. ఇట్టి వారెంత తంటాలు పడినను సర్వమును భగవంతునిగా చూచుట అభ్యాసము పడక పశువులవలెనే తమోగుణవృద్ధి చేయుదురు. బ్రహ్మవిద్యాసంపన్నుడు గాక యితర విద్యలు సంపాదించినవాడు పశువువలె మంచిచెడ్డలు తెలియక చరించుచుండును. వీరు పశువులవలె నెందుకు పుట్టలేదన

మనుస్మృతి 2 అధ్యాయం:— "కామాన్ మాతా పితా చైనం। యదుత్పాదయతో మిథః। సంభూతింతస్యతాం విద్యా ద్యద్యోనా వభిజాయతే". తలిదండ్రులు కామముచే కలిసి శిశువును గనుచున్నారు. మాతాపితలు వారికి తమ

అవయవములనిత్తురు. దీనింబట్టి సంయోగకాలమున ప్రేమతో జూడబడు కుక్కలు యెద్దు మొదలగునవి లో రూపమునందిపైటకు మానవాకారులుగా నుందురని తెలియవలెను. యీ సంతతివారు 'అశక్తిః దుర్జనః సాధుః' శక్తిలేని దుర్జనుడు సాధువుగా యుండును. అటులే వీరు సాధువులుగా గన్పడుదురేగాని ఎంత బోధించినను సాధుమార్గము తెలియక కొద్ది తెలిసినను సాధుమార్గాచరణులై తత్ఫలము నొందలేరు. లోకమున వేదోక్తయజ్ఞములు యితరకామములువిడిచి యింద్రాది దేవతలపై, దేవునిపై దృష్టితో చేయుబడును. అట్లే శృతి స్మృతి పురాణేతిహాస ధర్మయుక్తమగు యీ సంయోగయజ్ఞమున భార్యాభర్తలు దుష్టకామములు దుష్టరూపములు చూచుట మాని నిష్కామ సత్కామమార్గముల సర్వయజ్ఞ పురుషుడగు దేవునిగాని యింద్రాదిదేవతల గాని ఆదృష్టిచేత కానిచో సన్మార్గబలవంతుడు నిష్కాముడు అగు భర్త రూపముగాని, భార్యచూచుచు, భర్త దేవయింద్రాదులను గాని బలంవంతురాలు నిష్కామ సత్కామ యుక్తయగు భార్యను గాని చూచుచు సంయోగయజ్ఞము చేయు సత్సంతతి వృద్ధి యగును.

—: దివ్యదృష్టి అందరకు కుదరదు :—

"కామాంధో పి వ ప శ్య తి" ఆసురీసంపద గలవారే కామాంధులు (ఆసురీసంపద దైవీసంపద లక్షణములు భగవద్గీతలో చదువుము). దుష్టలక్షణములు తమయందున్న

తామసురులమని గ్రహించి ఆత్రోవవీడి దైవీసంపద సంపాదింప మొదలిడిన మానవులు బాగుపడుదురు. నేను పైన వ్రాసిన సంయోగయజ్ఞమున యజ్ఞపురుషుడగు విష్ణువును కామముచే గ్రుడ్డియైనవాడు. అనగా తమోగుణవృద్ధుడు చూడలేడు. సకామముగాని, నిష్కామముగాని చూడగలడు.

శ్లో. విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః.
బ్రాహ్మణుని మొదలు హీనునివరకు దేవునిగా జూడ
నేర్చినవాడు పండితుడు యితరుడు ఎంతచదివినను
పండితుడనబడక సామాన్యుడనబడును.

భగవద్గీత:—"సమం సర్వేషు భూతేషు తిష్టంతం పరమేశ్వరం వినశ్యత్స్య వినశ్యంతం। యః పశ్యతి సపశ్యతి"—సర్వభూతముల సమముగానుండువాడును. నశించు భూతచయముల నాశనము లేకయుండువాడు అగు పరమేశ్వరుని జూచువాడే దృష్టిగలవాడు లేనివాడు గ్రుడ్డివాడనిభావము.

ఆపస్తంభస్మృతి:— 'మాతృవత్ పరదారాంచ లోష్టవత్ పరద్రవ్యాణి. ఆత్మవత్ సర్వభూతాని యఃపశ్యతి సపశ్యతి" తల్లివలె పరదారకన్పడువానికి వ్యభిచారకామము గల్గదు. బెడ్డలవలె పరులద్రవ్యము కన్పించువానికి దొంగతనముగల్గదు. యిట్లు చూచువారును భగవంతునివలె సర్వభూతములను జూచువాడే దృష్టిగలవాడు. ఇతరుడు కన్నులున్ననూ గ్రుడ్డివాడే యనదగును.

నృసింహోపనిషత్తు:—'అభేదదర్శనం జ్ఞానం' సర్వమును దేవునిగాజూచుటే జ్ఞానము.

భగవద్గీత:—14 అ॥"సత్వాత్ సంజాయతే జ్ఞానం తమసో భవతో జ్ఞానమేవచ" సత్వగుణవృద్ధిచే జ్ఞానము గల్గును. తమోగుణవృద్ధిచే అజ్ఞానముగల్గును. అనగా దివ్యదృష్టిగల్గదు. యీ తమోగుణమును భయపడక, వట్టిదనక తన తమోగుణ నాశనమార్గమున నడచుచు, సత్వగుణవృద్ధియగు మార్గము నభ్యసించిన జ్ఞానమన దివ్యదృష్టిగల్గును. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధగలవాడు జ్ఞానముపొందును. "శ్రద్ధాయిచ్ఛాచ కథ్యతే" శ్రద్ధయన భగవంతునిజూడగోర్కె గల్గుటయే శ్రద్ధ యనబడునని ఆదిత్యపురాణము.

అశుద్ధముతో, పందిపెంటతో పండినధాన్యము, చల్ది యన్నము, ప్రొద్దునవండిన అన్నము, కూరలు, రాత్రి, మరునాడుతినుట, తరువాణి మద్యము, మొదలగునవిత్రాగుట, తమోగుణవృద్ధి ఆహారముగాన వీటినివిడిచి సాత్వికాహారము తినునది, భగవధ్యానముచేయునది. సాత్విక స్నేహము, సాత్విక గ్రంధ పఠనముచేసిన సాత్విక గుణవృద్ధియై భగవద్దర్శన మగును. కన్పించనంతవరకు తనయందు చీకటిఅనగా తమోగుణము పోలేదని చెప్పదగునేగాని విసువక సన్మార్గమును విడువరాదు.

గీత. 4 అ॥ 'జ్ఞానం లబ్ధ్వాప రాశాంతి మచిరేణాధి గచ్ఛతి' జ్ఞానముగల్గిన త్వరలోనే పరమశాంతి గల్గును.

డిటో 7 అ. "జ్ఞానిత్వాత్మైవ మేమతం" జ్ఞానియే నే

వని భగవంతుడనెను. జ్ఞానమనగా యిట్టి సద్గ్రంథార్థములు గురువులవలన తెలిసికొని కొంతకాలము ప్రేమతో అంతటా దేవునిగాజూచుచున్న వానిముక్కు సోహమనుచుండును. దాన ఎదుటగన్పించు మూర్తివంటి శక్తిగలవానినిచేయును. (యిట్లు హీనులను, పశుపక్ష్యాదులగాని, దుష్టస్త్రీలనుగాని ప్రేమతో జూచిన అట్టిశక్తిగలవాడగును. మానవుడు యోగవాహి. ఇతడు దేనిచేరిన అట్టివాడగును. లేక చేరిన వాని తనవంటి వానిగాజేయును.) గనుకనే జ్ఞానినినేనని భగవంతుడనెను. యీజ్ఞానిని భగవంతుడని దైవీసంపదవారైన అంగీకరింపకున్న సిద్ధుడుగాదనియు, అంగీకరించిన విశ్వామిత్రుని వసిష్ఠుడు బ్రహ్మ దేవతలు బ్రహ్మర్షియని అంగీకరించినట్లు, సిద్ధుడని తెలియదగును. భగవత్ శక్తి అతనిని ఆవేశించినగాని భగవంతుడుగా మానవుడు మారబోడు యిదిస్థితి. యీదివ్యదృష్టి అంతటనూ తను, భార్యనూ భగవంతునిగాచూచుచు, భార్య అట్లే చూచుచుండ సంయోగయజ్ఞము అతికామమున్న భార్యనుపొందువాడు, భగవంతునికి అపరమూర్తియగు అవతారపురుషునిగనును. యిది సృష్టి. ప్రాణావసానకాలమున భగవంతుని స్మరించుచు, జూచుచు ప్రాణమువిడిచిన మానవుడు భగవంతుని రూపధారియగు యిదిమరణము. యీసృష్టి స్థితి లయములు ప్రతిమానవుడునేర్చిన ఆదేశము వైకుంఠ తుల్యముగానుండును. అడవిలో బోయలుగలరు ఋషులుగలరు. బోయలు జంతుపక్షిసహవాసమున తమోగుణులై దుష్టులుగా

మున్నారు. ఋషులు భగవద్దృష్టినుంచుట పూజింపబడు చున్నారు.

—: ఋతుకాలాధిక్యత: —

మానవుడు భార్యరజస్వలయినదాది 16 రాత్రులు ఋతుకాలము. యిందు మొదటిరాత్రులు 4 గు 11—13— రాత్రులు విడిచి తక్కిన రాత్రులపొందిన సత్సంతతి వృద్ధి యగును. యిది సరిరాత్రులు పురుషులు బేసిరాత్రుల స్త్రీలు పుట్టుదురు. 5—7—9—15. సాధ్వీలగు స్త్రీలు. అనగా 5. సామాన్య ధనవంతురాలు, 7 వంధ్య ఎక్కువ ధనవం తురాలు 9 మిక్కిలి ధనవంతురాలు, 15 ఎక్కువ ధనవంతు రాలగు రాణియగు స్త్రీలు బుట్టుదురు. వీరు పేదవారిలోను, ధనవంతులలోనూ, మహారాణులలో, సాధ్వీలక్షణములు ఎన్ని కష్టములు గల్గిననూ విడువక ఆచరించి తత్ఫలమందురు. యిట్లే 6 – 8 – 10 – 12 – 14 – 16 రాత్రుల సాధువులగు పురుషులు ఒకరికన్న ఒకరు అధికధనవంతులై 16 వ, నాడు ధనవంతుడు సాధువగు రాజై సాధుమార్గము విడువక, తత్ఫలము యితరు లకు జూపుచు తాము పొందెదరు. తక్కిన రాత్రుల సృష్టి అంతయు ఆసురీసంపదవారు వృద్ధియై జగన్నాశనము చేయుటకు తగిన అధర్మమార్గమున నడచుచూ, దాని ఫలము పరులకు జూపుచూ తాము పొందుదురు. గాన ఋతుకాలమున శుభ రాత్రుల భార్యను పొందుటుత్తమము. దీన నడిచి దైవీసంపద మానవ సృష్టి వృద్ధి చేయదగును.

మనుస్మృతి:—4 అధ్యాయం63 శ్లో. 'నకుర్వీతవృథా చేష్ట" యిహాపరలాభములేని పనిచేయరాదు. దుస్సంతతిని, దుష్టకర్మముల పొందరాదని నాయూహ. కుక్కలు, నక్కలు, మొదలగు జంతుచయము తమతమ జాతులు నశింపకుండ ఋతుకాలాన స్త్రీలనుబొంది జాతివృద్ధిచేయుచున్నవి. అశుద్ధముతిను పందులును తమజాతివృద్ధి చేయుచున్నవి. కేవల మాంసాహారులగు పులులు, పాములు, మొదలగు క్రూరశరీరులు తమజాతిని వృద్ధిచేయుచున్నవి. గాని అడవులలో పట్టపగలు డాగి రాక్షసులవలె మానవులు చరింపనికాలాన రాత్రి చరించుచున్నవి. సర్వమృగాది జాతులకు మానవుడు రాజు. ఆడది రాణి. వీరికి అపకారము చేయగలవియగుట — రాజకీయ శిక్షితులవలె వారు చరింపనిచోట్ల తిరుగుచుండును. గోవులు, మేకలు, గుర్రములు, మొదలగు సాధుజంతువులును తమజాతిని వృద్ధిజేసి మానవునకు మహోపకారులగుచు రాజు సేవకుల పోషించునటుల పోషింపబడుచున్నవి. పక్షులు ఋతుకాలానగూడి తమజాతిని వృద్ధిచేయుచున్నవి. చెట్లు ఋతుకాలాన పుష్పించి స్త్రీపురుష సంయోగముచే ఫలములకాచి తర్వాత వాటి జాతివృద్ధిచేయుచున్నవి. ఋతుకాలములో చెడ్డరాత్రిలును, 16 రాత్రులు దాటిన తరువాత రజస్వలఅగు వరకుగల కాలము దుష్టర్తుకాలము. ఈ కాలములో ఆసురీ సంపదవారు పుట్టి సత్సభలలోఅవమానముపడి చాటున పులుల వలె డాగి చరింతురు. కాలమునకు ఋతుకాలము వర్షాది

ఋతువులు జ్యోతిషమునకు ఋతుకాలము మంచి గ్రహయోగ కాలము శుభ ఫలమును, యోగభంగకాలము చెడు ఫలమును గల్గును.

వసిష్ఠ సంహితః—'ఛందః పాదౌ శబ్దశాస్త్రంచ వక్త్రం। కల్పఃపాణి జ్యోతిషం చక్షుషీచ। శిక్షాఘ్రాణం శ్రోత్రముక్తం నిరుక్తం। వేదస్యాంగాన్యాహురేతాని షట్చ।' వేదమునకు పాద, ముఖ, పాణి, నేత్ర, ఘ్రాణ, శ్రోత్రములు ఆరు శాస్త్రములు. సర్వవిధధర్మముల, అనుభవఫలముల శ్లోకములుగా వ్రాసి రాబోవువారికి అపుడున్నవారికి సౌఖ్యఫలమిచ్చునది ఛందస్సు. అందు దుష్టశబ్ద, సుశబ్దాది వివరము తెలుపునది వ్యాకరణము. ఇట్లుచేసిన యిట్లుఅగునని తెల్పునది కల్పము. గత జన్మఫలమును సూర్యాది గ్రహదశలవలనను వివాహాది పురుషప్రయత్న ఫలములను ఆకాశసంచార సూర్యాది గ్రహ ఫలముల తెల్పునది జ్యోతిషము. ఉదాత్తాది స్వరనిర్ణయముతో వేదముచదువుట, దానిఫలము నిర్ణయించునది శిక్ష. వేద శబ్దార్థము తెలుపునది నిరుక్తము. యిందు తర్కము చేర్చలేదు గాని విమర్శించి సత్యార్థము పొంద వీటిని కొద్దిగానో, పూర్తిగానో చదువదగును. 4 వేదములకు ఆయుర్వేద అర్థగాంధర్వ ధనుర్వేదములకు స్మృతి పురాణేతిహాసాలకు బ్రహ్మర్షులు పొందిన ఫలము గానరాకున్నపుడు అట్లు పొంద యీశాస్త్రములవిమర్శించి పొందుటకేగాని శుష్కవాదోపవాదములు చేయుటకుగాను. ప్రస్తుతము కలియుగ పండి

తులు శుష్కవాదములకే ఉపయోగము చేయుచున్నారుగాని, ఫలములకై వాదములుచేయుటలేదు. యీశాస్త్రవాదజ్ఞులు యిట్లుందురని యెరింగి యీశాస్త్రముల అవసరము లేకయే వేదములు, స్మృతులు, పురాణేతిహాసములు, ఉపనిషత్తులు సత్యమార్గములు వెల్లడించుచూ పూర్వర్షులు కథారూపములు వ్రాసినట్లున్నవి- గాని నిష్కామ, సత్కామ మార్గములు వృద్ధిఅగుటలేదు. దుష్టమార్గములు మాత్రము వృద్ధిఅగుచున్నవి. సత్ఫలములేని సర్వవిద్యలు విడువబడుచుండును. వాటి మార్గము తెలియని సత్యవిద్యలును విడువబడుచుండును. ఫలమిచు అర్థములు దెల్పుచు సచ్ఛాస్త్ర ప్రచారమైనగాని జగత్కల్యాణముకాదు. యిట్టి విద్యాభ్యాసము చేయు మానవునకు బాల్యమే ఋతుకాలము. మరియు భూలోకములో గోచరాగోచర సర్వదేహధారులకు జలభూత సర్వదేహధారులకు ఋతుకాలము గలదు. ముత్తెపుచిప్ప ఋతుకాలాన స్వాతి వర్షమున గర్భధారిణియై ముత్యముల నీనుచున్నది. గాన మానవులు సదృతుకాలమున భార్యనుపొంది సత్సంతతి వృద్ధిచేయుదగునేగాని దుష్టఋతుకాలాన దుస్సంతతి వృద్ధిచేసిన తమకు, పరులకు, కనినవారికి పులులవలె నాశనమిడుదురు. సత్కామ, నిష్కామవిధులు వృద్ధియైన కృతయుగమనబడును. దుష్కామములు వృద్ధియైన కలియుగమనబడును. ప్రస్తుతము కలియుగమగుట భారతదేశమున మాత్రము దుష్కామము లెక్కుడు వృద్ధియగుచున్నది. యితరదేశములకు కలితక్కువ. గాన

మునకు మహోపకారమై సత్కామాభివృద్ధి నందియుండెడిది. ఆమెకు సహాయము సత్సంగీతముకనుగొన్ననాడా లేడియో. ఉపకార మింతింతయని చెప్పవీలులేదు. ఆమె సంగీతజ్ఞురాలు కాదు. ఒకమానవుడు అన్నిమార్గాల సత్యము గనుగొను శక్తివంతుడగుటకు ప్రస్తుతకాలము మాత్రము సరిపోదు. అందుననే రసాయనములు దిని ఎక్కువకాలము జీవించిన ఋషులుమాత్రము సర్వసత్యముగాంచి అందరికి గ్రంథరూపాన వెల్లడిచేసిరి. వాటిని అల్పజ్ఞులగువారు తప్పనిన వారికి గతి యేది? యోగ్య స్త్రీ అగు క్యూరీసతి ఒకటి కనుగొన్నందు లకే ఆమెకాలము సరిపోయినదిగదా! మరికొందరి కాలము వ్యయమైన సత్సంగీతము కనుగొనవచ్చును. సంగీతమున తమో గుణమువల్ల తమోగుణముచే బాధపడక సత్కామనిష్కామ మార్గముల బడదగు ధ్వనిని గల్గించి యిహపరసుఖమిడునది. ఉ:— నారద, తుంబుర, రామ, కృష్ణ త్యాగరాజాదులు—

భూలోక దేశ, రాష్ట్ర, పట్టణ, గ్రామ ఋతుకాలము నిష్కామ సత్కాములచే పాలింపబడు కాలము. దుష్కాము లచే పాలింపబడుకాలము చెడుఋతుకాలము. యీదుష్టులు విజృంభించి యెల్లకాలము పాలింపలేరు. వీరిని భూలోకస్థులు ఎక్కువ వృద్ధిగా కన్నచో వారిని నశింపజేయు విష్ణువు ఎప్పటి కప్పుడు పుట్టి వారిని నశింపచేయుచుండును.—

విష్ణు ఋతు కాలము:— అరణ్యపర్వము— భారతము 4 అ. 227 పద్యము.

ఉ॥ ఎప్పుడుధర్మహానియగు, నెప్పుడధర్మముమీరిగ్రూరులై
యెప్పుడు దైత్యులుబ్బుదురు హీనతబొందుదు చెష్టవేల్పులే
నప్పుడు సత్కులీనుల గృహంబుల నుద్భవమంది లీలమై
యెప్పటియట్లు నిల్పుదు సురేంద్రులనంచితధర్మపద్ధతిన్.

భూలోకమున దుష్టరాక్షసాసుర దనుజసంతతి వృద్ధియై నిష్కామ సత్కామమార్గములు విడిచి దుష్కామవృద్ధి చేయుచున్న ఆకాలమున వారిని బరిమార్చుటకు విష్ణువవతరించుచుండును. కలియుగాంతమున కల్క్యవతారముపుట్టి అప్పటి దుష్టుల హరించి కృతయుగారంభము చేయును. మానవులెప్పుడు కలియుగములో భారతదేశాన విష్ణు, యింద్రాది దేవతల పుత్రులుగా కందురో ఆకాలము కృతయుగతుల్యమై నడచును. కలియుగాన జనులు సత్కామ నిష్కామ వృద్ధి జేసిన కలిబాధ యుండదనియే ఋషులు వ్రాసిరి. అవి విడిచినచో భారతదేశ జనుల కలి బాధించునని కలదు. యితర దేశజులకు కలి లేదు. బ్రహ్మాండ పురాణము యుగనిర్ణయము చదువుము.

:భూలోకము దైవీసంపదవారిచే అసురీసంపదవారిచే కలిసియుండును:—

తైత్తిరీయము:—'అదితిర్దేవాగంధర్వా మనుష్యాః పితరో సురాస్తేషాం సర్వభూతానాం మాతా మేదినీ'. దైవీసంపదగల దేవగంధర్వ పితర మనుష్యులకు ఆసురీసంపద గల అసురాదులకు మాత భూమియే అనగా వీరందరు యీలోకాన మానవాకారులుగ జనింతురని భావము.

—: 1వ రకపు దైవీసంపద :—

భారతము అరణ్యపర్వము 4 అ.

ఉ॥ ధర్మమునల్పుచున్ దగిలి ధర్మపథంబున జేసి, యర్థమున్.
బేర్మినిగాంచి ధర్మవిధి పెండిలియై ప్రజలన్ సృజించి స
త్కర్మములన్ ప్రశస్తములుగా క్రతువుల్ దనరించు సజ్జనుల్
ధర్మజ యిందునందును ముదంబునగాంతురభీష్టసౌఖ్యముల్.

—: 2వ రకపు దైవీసంపద :—

మ॥ ఉపవాసవ్రత సంతతాధ్యయనతీర్థోపనాది క్రియై
క పరత్వంబున జేసి యైహికము దుఃఖప్రాయమైపోవగా
విపులానందము బొందగల్గు తుది నావిఖ్యాతభోగైక లో
లుపబుద్ధిన్ జిరపుణ్యశీలురకు నాలోకంబునన్ భూవరా.

వీరివలన పరుల కెట్టిబాధ లేదుగదా.

—: ఆసురీ సంపద 1వ రకము :—

డిటో చం॥

ధనములుచాలగల్గి సతతంబును నింద్రియవాంఛ నల్పుచున్
మనమున నెన్నడున్ సుకృతమార్గముపొంతకుబోక లోభమో
హ నిహతబుద్ధులై తిరుగునట్టి జనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేరరిక్కడి సుఖంబులు మేలయితోచు వారికిన్.

ప్రస్తుతము భారతము నక్కడక్కడను పడమటి ఖండ ములు కొన్ని దేశములందెక్కుడుగాను, యితరఖండములు నక్కడక్కడ నీ జనవృద్ధి యగుచున్నది. వీరికన్న బలవంతులగు నాశ్యాను నిష్యాను జనవృద్ధి గృహస్థులు చేయకున్న ముందు ముందు వారి బాధలెక్కుడు కాగలవు—

—: అసురీ సంపద 2వ రకము :—

సీటలో ఆట॥

సత్యమును శమంబు శౌచంబులేక నాస్తిక్యమును నిషిద్ధసేవనంబు
గల్గితిరుగు దుష్టకష్టజనశ్రేణి, బొలియు నుభయలోకములకు
గాక.

ఈదుష్టులు పై ఆసురీసంపద వారికి సాయపడుచుందురు. ప్రస్తుతమానవుడు ఋతుకాలమహిమ తెలియక తన యిచ్ఛ వచ్చినట్లు సంయోగయజ్ఞము చేయుటచే దుష్టులు, హీనులగు వారి నెక్కువగా గనుచున్నాడు. బలహీనులు సామాన్య సాధుమార్గస్తులగు వారిని గనుచున్నారు. దాన భూలోకమున ప్రతి దేశమున దొంగతనము, బందిపోట్లు హత్యలు. ఆత్మ హత్యలు చేసికొనుట, పరస్త్రీల నపహరించుట, సాధురాజ్య పాలకుల కూలద్రోయుట మొదలగు దుష్టకర్మము లెక్కువై గృహస్థధర్మములు, రాజ్యధర్మములు చెడి వారి నాపెడి శక్తి వంతులు లేక జనులు నానావస్థల పాలగుదురు. దైవీసంపద గలవారికి నీ ఋతుకాలమహిమ దెలియకుండుటను దుష్ట సాహసులగుటను ఎచ్చటచూచిన నిరీశ్వరవాదు లెక్కువగుటచే వారికి సమాధానము చెప్పలేకుండుటను వారు చెడి ఆసురీ సంపదవారినే వృద్ధిచేయుచున్నారు. గత పుణ్యవశమున వా రిదుంగకే ఋతుకాలము గర్భిణులైన కొందరు రెండుసంపదల వారిలోను ధార్మికబుద్ధి బలవంతుల గనుచున్నారు. దుష్టులధర్మమెంత కట్టుదిట్టముగ స్థాపించినను శివ వంతు సన్మార్గులు

నిత్యము చెక్కని రత్నాలవలె జగమున పుట్టక మానరు. యిది సహజము. సద్గ్రింథములు చదువుచు ఆచరించుచు తదను భవముచే చెక్కినరత్నాలవంటి సత్సంతతిని లోక కల్యాణము నకు, తమకల్యాణమునకు సంతత కల్యాణమునకై నిత్యము స్త్రీపురుషులు కనగలరు. సన్మార్గము సర్వజీవులకు సుఖమైనది. దుర్మార్గము సర్వజీవులకు దుఃఖమైనది. నిష్కర్మమార్గము నిత్యానందదాయకమైనది.

—: దైవమన ప్రారబ్ధము – పురుషప్రయత్నమన
మానవుడు పుట్టినతర్వాత చేయుపని :—

బలహీన ప్రారబ్ధమును బలమగు పురుషప్రయత్నములు జయించును. బలహీన పురుష ప్రియత్నమును బలముగల ప్రారబ్ధము జయించును. రెండును సమమైన సమమగును. తలిదండ్రిలు సంయోగ యజ్ఞమున ఆచరించు నిష్కామ సత్కామ దుష్కామ కర్మఫలమును జీవునితో వచ్చు కర్మ ఫలము కలిసి ప్రారబ్ధమగును. శాస్త్రజ్ఞుడు అనుభవముగల గురువువద్ద విద్యనేర్చి శాస్త్రీయముగ అనుసరించు కర్మమే పురుషయత్నము. భూలోకమునకు వచ్చు జీవు లెంతగొప్ప వారైననూ తలిదండ్రులు సదృతుకాల గమనము చేయనిచో ధనాదులున్నను లేకున్ననూ దుష్టులై జనించి అనేకవమాన ములు, కష్టములతో కాలముపుత్తురు. తలిదండ్రిలు సదృతు కాల గమనమున తమయందుచేరిన దుష్టజీవుని గొప్ప సన్మా ర్గునిగా మార్చగలరు. 'ఆరుమాసాల సహవాసమున వారే

పెరగుదురు' అను తెల్గుసామెత ప్రకారము తండ్రియందు కొంత కాలమును 10 మాసములు తల్లియందును స్నేహముగాన తలి తండ్రులు సాధువులైన సాధువులుగాను, దుష్టులయ్యిన్న దుష్టులు గాను జీవులు గాకమానరు.

గీత:—'శబ్దఃఖే పౌరుష నృషు' శాస్త్రీయానుభవములచే గూడిన పనిచేయుటే పురుషప్రయత్నము. అది నేనే అని కృష్ణుడనెను. లేక ఋషి, మహార్షి, బ్రహ్మార్షులు చేయు ప్రయత్నమే భగవంతుడనదగును.

ప రా శ ర హో రః—'జీవానాం కర్మఫలదః గ్రహరూపీ జనార్దనః' అన జీవులకు వాటి కర్మఫలము నవగ్రిహ రూపమున జనార్దనుడిచ్చును. అదియె బ్రహ్మ జీవులనొసట వ్రాయును దానిని జ్యోతిషమున జాతకచక్రమునుజూచి గ్రహ ఫలము చెప్పబడునని పరాశరుడు చెప్పెను. యీ ప్రారబ్ధ ఫలమును గ్రిహముల దశలద్వారా పరమోచ్చ, ఉచ్చ, స్వక్షేత్రి, మిత్ర, శత్రు నీచాది బలముల ననుసరించి యిచ్చుచుండును. యీ ప్రారబ్ద శుభకాలమును శుభపురుష ప్రియత్న కాల మెక్కువ ప్రకాశింపజేయును— యీప్రారబ్దము చెడు కాలము. బలీయమగు శాస్త్రీయానుభవ పురుష ప్రియత్నము జయించి సుఖమిడును. రెండును సమమైన సమఫల మిడును.— శాస్త్రీయ పౌరుషము భగవంతుడు. ప్రారబ్ద ఫలము. గ్రిహరూపీ జనార్దనుని చేతిలోయున్నది. పురుష ప్రయత్నముచే అనగా భగవంతుని ధ్యాన జపాదులచే అర్చిం

చిన దుష్టప్రారబ్ధ ఫలమును అతడే సంతసించి తొలగించును. యిది చెడుప్రారబ్ధ శాంతిమార్గము.

మార్కండేయపురాణము:— గీ॥ పుణ్యావంతుని గ్రిహపీడబొందదు. దుష్టగ్రిహ దశకాలమున నిష్కామ సత్కామ సన్మార్గుడగువానికి గ్రిహపీడలు గలుగక సౌఖ్యమిడును. గృహస్థుడొకడే చేసిన. అతనికి సుఖముగల్గి భార్యాపుత్రులకు భయముగల్గించునని గలదు. గాన గృహస్థుడు భార్యా పుత్రి పుత్రికలు నిష్కామ సత్కామ సన్మార్గులై భగవదర్చన చేసినచో అందరును సుఖింతురు. అనగా దుష్టప్రారబ్ధము ననుభవించక తమ జాతక స్థితికిదగిన సౌఖ్యమునే పొందుదురని భావము. దైవము మంచిదైన పౌరుషము సిద్ధించును. లేనిచో విఘ్నమగును. పురుషయత్నము లేని దే దైవము ఫలమిడదు. కుంభకాది యోగ సమాధిస్థిత పురుషుని చెడుప్రారబ్ధము బాధించదు. స్వల్పప్రయత్నమునుగాని గొప్ప ప్రయత్నమునుగాని సిద్ధిని, విఘ్నమును, దైవము చేయగలదు. మరియు దైవము మానవులకు తెలియకుండను, గోచరము గాకను వచ్చి వారువారు చేయుపనుల సిద్ధికి విఘ్నమువచ్చును. అనగా మానవుడుచేయు కార్యసిద్ధి దైవము మంచిదైననే గల్గును. లేక తానుచేయు కార్యసిద్ధి, ఆకాలమున తానెరుగని పరులచేనగుట లేక పరులచేవిఘ్నమగుటయు దైవఫలశక్తియే యున్నది.—

ఉదా:— రాముడు పట్టాభిషేకము- దశరథాదులు

చేయుట. వారికి మధ్య దేవతలు కైకపై ఆవేశించి విఘ్నమొన రించిరి. దేవతలు చేసినట్లు దశరథునికి తెలియక భార్య తాను కలహములు జెందిరి.

—: పాండవులు - దైవబలము :—

గరుడపురాణము:—

శ్లో॥ ఏతే తేచంద్రతుల్యా క్షితిపతి తనయా భీమసేనార్జునాద్యాః
శూరా సత్యప్రతిజ్ఞాః దినకరవపుష కేశవోనోపగూఢాః
తేవై దుష్టగ్రహస్థా కృపణవశగతాః భైక్షచర్యాం ప్రయాతాః
కోవాకస్మిన్ సమర్థోభవతివిధివశాత్ భ్రామయేత్ కర్మరేఖాః॥

మహారాజపుత్రులు బలవంతులు సత్యవంతులు నగు పాండవులు దుష్టగ్రహస్థులై ఏకచక్రపుర పాంచాలముల భిక్షాటన చేయువారైరి. దైవమన ప్రారబ్ధమునుబట్టి మానవుడు తిరుగుచుండును. వీరు కృష్ణునెక్కువ ననరించి ఆతని ఆజ్ఞల పాలించువారగుటచే 'బ్రాహ్మణాన్న మమృతంచ' వీరు బ్రాహ్మణులనే యాచించిరి. ఆ అన్నము అమృతమునిచ్చునది గాన ఆ దుష్టకాలములోనూ సుఖవంతులై బకాసురుని బరిమార్చి, బ్రాహ్మణులకు మహోపకారము చేసిరి. వీరు నిష్కామ సత్కామ సన్మార్గులగుటచే సద్భిక్ష ప్రాప్తమై సుఖముతో కాలము గడిపిరని భావము—మరియు ద్రౌపదీ స్వయంవరమున విశ్వవిజయమును పొందిరి. గాని భిక్షాటనము చేయించినదని ప్రారబ్ధము పేరుగొన్నది. దుష్టులకు దుర్భిక్షనిడుచు పరులకు వారికి నానాకష్టములు గల్గించుచుగదా. దైవహీనులైనవారికి, అసురీ

సంపద వారికి యింత భేదముగలదు— రామాదులీ చెడుకాల మున జపాదులు సేయుచు బ్రహ్మర్షుల దయగలవారై అడవు లలో తిరిగినను తుదకు విశ్వవిజయమిడినది.

—: దైవమన ప్రారబ్ధకర్మఫలము - అది గొప్పదని రాముడనుట :—

ఆంధ్రవాల్మీకిరామాయణము- వా॥ సుబ్బారావుగారిది.

కం. కావున నచింత్య మహిమము
దైవం బప్రతిహతంబు ధర నెవ్వనికే
నావనితయందు నాయెడ దైవం
బె విపర్యయంతమ్మడ గూర్చెన్.

కౌసల్యకన్న కైక నాయందెక్కుడు ప్రేమ గలది. నిర్హేతుకముగా విరోధిని యగుట దైవమె కారణము. ఒక పుడు దైవము ఎదురులేనిది అనగా శాంతిచేయుటకు వీలుగాని తగనికాలమున వచ్చిన అనుభవింపచేయునది. కనుపడక యే ఫలమిడునది....

గీ॥ దుర్జయంబైన దైవంబుతోడ దొడరి
నెవకు పోరంగ దా నుత్సహించు జెపుమ॥

అని రాముడు లక్ష్మణునితో ననెను. దైవమువలెనే అనుభవశాస్త్రీయ పౌరుషము అడ్డులేని ఫలమిడునదని నా భావము— దశరధుని కా కాలమున జన్మనక్షత్రమున కుజ రవి రాహువులుండిరి. దాన మృత్యువుగాని తత్సమ ఫలముగాని కల్గునని దైవజ్ఞులంతకుముందు కొద్దికాలమున జెప్పిరి. రాముని పట్టాభిషేకము చేయ దశరధుడు మొదలుపెట్టెను గాని తనకు

శాంతిచేయలేదు. దీనిఫలము తొందరలోవచ్చి పిల్లలకు తండ్రికి భార్యలకు ఎడబాటుగలుగచేసి దశరథునికి మృత్యువునిచ్చెను. క్రూరదైవకాలము తెలిసినవెంటనే శాంతిచేయక యేమరుపాటునున్న వానికిట్టిఫలము గల్గునని ముందు మానవులకు దశరథుని కథ నీతినేర్పుచున్నది.

భా ర త ము:— అనుశాసనికము—1 అ. 141 ప.

కం. విను పౌరుషమును దైవము
 నన రెండును కార్యఫలము నందింపగ నె
 ట్టనకారణములు గావున
 జననాయక సదృశములు విచారింపంగన్.

చ ర క సం హి త:— విమానస్థానము- దైవమన పూర్వకర్మఫలము. పురుషకారమన యీజన్మమునచేయు కర్మము. సాధువులగువారు ఎక్కువ దుష్టకాలమునను మానవధర్మమనగా సత్యాఽహింసాదు లాచరించుచు రసాయనాదులచే చాలకాలము జీవించి తపస్సుచేయుటచే బ్రహ్మర్షులు లోకోపకారులైరి. ధర్మరాజు రాజసూయాగాంతమున వ్యాసుడు నీకు పదమూడేండ్లు మంచిదిగాదనియు నీవలన యీరాజులకు నాశనము గల్గుననియు చెప్ప వారిపై దండయాత్ర తాను చేయనని తమ్ములతో కలహపడనని ప్రతిజ్ఞ చేసెనేగాని, తగుశాంతి వ్యాసుని అడుగలేదు. తన సభనున్న యితర ఋషులనైన అడిగి శాంతిచేయలేదు. దాన ధర్మరాజు అరణ్యవాసముపాలై చివరకు ఘోరయుద్ధమున రాజక్షయ

మగుటయు జరిగెను. జాతకరీత్యా తెలియబడు దుష్టప్రారబ్ధము నంటకుండా శాంతిచేయవచ్చునుగాని, హీనజాతకుల రాజయోగజాతకుల చేయుట చాల కాఠిన్యము.

ము క్తి కో ప ని ష త్తు:— 'జీవన్ముక్తి తత్పురుష ప్రయత్నే సాధ్యోభవతి॥' పురుషయత్నమున జీవన్ముక్తి గల్గును. పుత్రకామేష్టిచే పుత్రు డెట్లుపుట్టునో అటులే పురుష యత్నమున జీవన్ముక్తి అనగా నిత్యానందదాయకముగ నుండుట గల్గును. రాజయోగజాతకమున పుట్టినవాడు రాజ యోగము ననుభవించును. మధ్యమాధమజాతకులు తగిన ఫలము ననుభవింతురు.

స్కా ం ధో ప ని ష త్తు:— 'కర్మబద్ధ స్తదాజీవో । కర్మనాశో సదాశివః॥' కర్మబద్ధుడు జీవుడు. పుణ్యాపాపము లనుభవించువాడు. పుణ్యాపాపముల రెంటిని వీడు మార్గము గలవాడు. అనగా పాపములుచేయక సత్కర్మఫలము భగవ దర్పితము చేయువాడు. కర్మఫలము లేనివాడై నిత్యానంద యుక్తుడగు శివు డగును. నిష్కామమార్గస్థుడై కర్మఫలము దేవునికర్పించుచు శమాదిసద్గుణుడై పరోపకారముగా సన్మార్గమున నడచుచున్నవాడు దుష్టప్రారబ్ధమున్నను సామాన్య వేధ నందుచు గొప్ప యశోజయముగలవాడై కుటుంబము జరుగుటకు తగిన అల్పధనియై సౌఖ్యముగా "పాండవులు ఏకచక్రపురపాంచాలదేశ పర్యటనమువలె" మెలంగును.

మా ర్కం డే యు డు:— 16 సంవత్సరములు ఆయు

ర్నిర్ణయము. బాల్యమునుండి నిష్కామమార్గ సన్మార్గునిజేసి తండ్రి నడిపింపగా అకాలమృత్యువు తొలగి చిరంజీవియై గొప్ప బ్రిహ్మర్షియయ్యె. గాన ప్రారబ్దమును, పురుషకార మున జయించు టింతకన్న తగినలక్ష్యము లేమిగావలెను. పుట్టినతరువాత మానవుడు ధర్మనుగు సత్య ధర్మ అహింసాది మార్గముల నడచుచు భగవద్ధ్యానపరుడైనగాని చెడుప్రార బ్దము తొలగదు.

—: తలిదండ్రుల మహిమ :—

పుత్రపుత్రికలకు సహాయము సృష్టిలోనే చేయదగును గాని పుట్టినతర్వాత కుమ్మరి వంకరటింకరకుండనుచేసి కాల్చిన పిమ్మట దాని వక్రత్వము బాపలేనట్లు పుత్రపుత్రికలను గుణు లుగా తలిదండ్రులు చేయలేక లోన బైట యేడ్వవలసి వచ్చునుగాని యేలాభమునుండదు.

జీవుడు గతజన్మదోషబలమున తలిదండ్రుల లోపమైన నడవడికచే పేదవారుగను హీనులుగ నగుదురు, గతజన్మ సుకృతమువలన తలిదండ్రుల సక్రమనడవడికచే ధనవంతులు గను ఔన్నత్యముగ నుందురు. గాన వారి ప్రారబ్దము మంచిది గాదని విచారింపక నిత్యము సత్కర్మముచేయుచు భగవ ధ్యానముచేయుచు సత్సంతతి గనుచు పరోపకారము చేయుచు జీవించునది. చెడుదినముల సత్సంకల్పసిద్ధిగాదు. గాకున్నను విడువక సత్కర్మమే చేయదగును. మంచిదినమున సత్సంకల్ప సిద్ధియగును. రాజయోగజాతకమున్న ఆయోగ గ్రిహదశలో

యేది గాఢముగా సంకల్పించిన అది సిద్ధించును. అనగా విద్యా తపోయోగ బ్రహ్మర్షిత్వసిద్ధులలో నొకటి గట్టిగా సంకల్పించి అందుకై కృషిచేసిన ఆకాలమున సిద్ధించును. రాజయోగ బలమునుబట్టి పైచెప్పినవన్నియుగాని కొన్నిగాని సిద్ధింప వచ్చును. బలమునుబట్టి రాజ్యమేలు రాజుగాగాని, మంత్రిగా గాని కావలెనన్న అవి సిద్ధించును. తరువాత సత్యధర్మాదులు దమాదులు అహింసాజ్ఞానాది మార్గములు, రాజ్యప్రజలకు ప్రచారముచేసిన కొందరైనను ఆచరించి వారి మంచికాల ములో సిద్ధిగాంచగలరు. లేనిచో ఆ రాజయోగకాలము ధన రాజ్యాదులు గల్గినను, భయముతోగూడిన యిహసుఖమిడి పరసుఖము దూరముచేయును. చెడుజాతకము సర్వాభిధనష్ట మును, రాజయోగజాతకము సర్వవిధసంకల్పసిద్ధియు గలుగ చేయును. యీలోకములో యీ రెండే తిరుగుచుండును. యివి తలిదండ్రుల సృష్టిలోయున్నవి. ఓ మనుష్యుడా! నీవురాజు వైననూ, కోటీశ్వరుడవైననూ, గొప్ప రాజసేవకుడవైననూ, లక్షాధికారివైననూ, హీనజాతకుడవయిననూ బ్రహ్మర్షిత్వసిద్ధి పొందుటే మానవజన్మ సాఫల్యము. రాజయోగజాతకుడ వయిన ఆకాలమున బ్రహ్మర్షిత్వసిద్ధికి పాటుపడిన అది సిద్ధిం చును. చెడుజాతకమువారూహించిన సంకల్పసిద్ధి గాకుండుటచే వేదవారగుదురు. వారీబ్రహ్మవిద్య నభ్యసించిన విఘ్నములపై విఘ్నములు గల్గును. వారు విడువక రసాయనాదులు తిని ఆయుర్వృద్ధి చేసికొనిన యెప్పటికయిన మంచికాలము రాక

మానదు. ఆకాలములో బ్రహ్మర్షిత్వసిద్ధి గల్గును. యిట్లు ధనవంతులు పేదవారును మానవజన్మసాఫల్యము చెంద వచ్చును. యిది వేదాంతమార్గము - నిష్కామకర్మమార్గము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య సచ్ఛూద్రులు యింద్రాది దేవతల యజ్ఞములచే పూజింతురు. దీనిని వైదికమందురు. యిది సకామమార్గము (ఫలకాంక్షతో కర్మములు చేయ బడును.)

గీ త:—

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః।
క్షిప్రంహి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥

దేవతల మానవులు పూజించిన అతితొందరలో వారు కోరిన కార్యసిద్ధుల నిత్తురు. దేవతోపాసనలచే చెడుజాతకము చెడుగునివ్వక జాతకమునకు తగు సౌఖ్యమిడును. తుదకు స్వర్గ మిచ్చును. మోక్షమిడదు. “క్షామాది దారుణకాలమున లేక చెడుజాతకకాలమున లేక చెడుజాతకకాలమున ఆవిపత్తులను దాటించుకొను మార్గము.”

చ ర క సం హి త:— విమానస్థానము - సత్యము పల్కుట - భగవదర్చన - దయ - దానముచేయుట - జప తపంబులుచేయుట - సద్గ్రంథపఠనము - సత్సహవాసము - సత్ప్రదేశసంచారము అన తీర్థయాత్రాదులు సేవించుట - మొదలయిన సత్కృత్యములుచేసిన దుష్టజాతక - దుష్టకాల గ్రహపీడలు తొలగును.

—: ఆహారము :—

నిర్ణయసింధు — 2 పరిచ్ఛేదము — స్కాందే —

శ్లో. ఏతేహి సాత్వికాః ప్రోక్తా స్వర్గ మోక్ష ఫలప్రదా।
వ్రీహయో యవగోధూమాః। ప్రియంగు తిలశాలయః॥

వడ్లు - యవలు:— (యివి గయలో దొరకును) యవలన బార్లీగింజలనుట సరియైనయర్థముగాదు. గోధుమలు, కొర్రలు, నువ్వులు, రాజనాలు యివి సకాములకు యిహ సుఖమిడి స్వర్గము అటులే నిష్కాములకు మోక్షమిచ్చును.

మానవుల పందుల మొదలగు వాటి దుష్టమలముల పెంటగట్టి పండించిన, వడ్లు మొదలగునవి తినరాదు. దాన దుస్సంతతి, దుర్మేధ, దుష్టమనస్సు గల్గును. సాధుజంతువుల ఆవు, గేదె, గొర్రె, మేక వీటి మలముల పెంటగట్టి పండించిన పంట - సత్సంతతి, సన్మేధ; మంచిమనస్సు యిచ్చి యిహపర సుఖముల నిడును.

మనుష్యమలము:— పందులు పిశాచరాక్షస భక్షణార్హమని ఋషులనిరి. దుష్టమలాదులతోనూ, దుష్టపొగ యెరువులతోనూ పండినవి తినరాదు.

తైత్తిరీయోపనిషత్తు:— ఓషధులచే అన్నము, దాన ప్రాణము, వృద్ధియగును, దాన-బలము, దాన తపము, దాన శ్రద్ధ, దాన మేధ, దాన మనీష, దాన మనశ్శాంతులు, దానచిత్తము, దాన స్మరణ, దాన విజ్ఞానము, దాన జీవన్ముక్తి గల్గును. గాన ఆహారము చెడుగయిన యిదంతయు చెడును.

అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము, యివి సదన్నమున గల్గును. మనస్సు చెడుటకు బాగుపడుటకు ఆహారము ప్రధానము.

బృహదారణ్యకం:— సర్వభూతముల భూమి రసమంతము. దానికన్న జలము, దానికన్న ఓషధులు, దానికన్న పుష్పాలు, వాటికన్న ఫలములు 'ఫలానాం పురుషః' ఫలాహారమున అన వస్త్ర మొదలగు ధనములచే పురుషులు పుట్టుదురు. 'పురుషస్య రేతః' పురుషునికన్న శుక్రము రసవంతము. సత్ఫలాహారముచే సత్సంతతి వృద్ధియగును.

యోగతత్వోపనిషత్తు:— యోగవిఘ్నకర ఆహారము మానువది. యోగవృద్ధియగుటకు 'శస్తం క్షీరాజ్యభోజనం' అను పాలునేయి కల్పితాగుట మంచి ఆహారము. 'గోధూమ, ముద్గల శాల్యన్న యోగవృద్ధికరం విదుః' అను గోధూమాదులు యోగవృద్ధికరములు. యివియే శుక్రవృద్ధికరములని నాయూహ.

చరకం:— 'ఘృతక్షీరాభ్యాస కరాణాం రసాయనానాం'. రసాయనములలో పాలు, నేయి కల్పి త్రాగుటగొప్ప రసాయనము. రసాయనమున ఆరోగ్యాయుర్వృద్ధిచేయునది.

గీత. — సాత్వికాహారమున ఆయురారోగ్యవృద్ధి గల్గును.

రాజసాహారమున:— కట్వామ్లలవణ రసము లెక్కుడు తినుట.

తామసాహారము:— వండిన తర్వాత ఝామము దాటి చల్లారునవి. రసములు పోయినవి. దుర్గంధమైనవి. ఒక రాత్రి ఊరిన చద్ది అన్నము. యితరులు తినగా మిగిలినది. మనుష్యవరాహ మలముల పండినవి. వీటి భక్షణము పిశాచ రాక్షసత్వము నిచ్చును. యీ ఆహారము చెడుసంతతిని, దుష్టమేధస్సును యిచ్చును. భర్తలకు పిల్లలకు పొద్దున్న వండినది రాత్రి మరునాడు చద్దిఅన్నముగా పెట్టు స్త్రీలు పిశాచాంశజలనదగును. దాన వారందరు దుర్మేధావంతులగు దురు. ఫల్లలు మొదలగునవి మిగులునని లాభమని చెప్పి రెండుపూటలు వండలేక పనిలేక తిరుగుట కలవాటుపడిన వారని గ్రహించి భర్త రెండుపూటలు వండించి ఆహారము తినుటచే భార్యాభర్తలకు సౌఖ్యము సత్సంతతి సన్మేధగల్గును.

గృహస్థుడు:— ఆవులు మొదలగు పశుజాతిని కోళ్ళు మొదలగు పక్షులను తన సౌఖ్యమునకై పెంచు చున్నాడు.

అత్రిస్మృతి:—

శ్లో.అజా గా వోమహిష్యశ్చ అమేధ్యం భక్షయంతియాః।
దుగ్ధహావ్యేన కవ్యేన। గోమయం నవిలేపయేత్॥

మానవమలము భక్షించు ఆవులు, మేకలు, గేదెలు, రాక్షసాంశజులు. యిట్లే తినెడు కోళ్లు,గుర్రములు, యేనుగులు యితర జంతువుల గ్రహించేది, గాన అమేధ్యము తిననివాటిని పరీక్షించి పోషించి వాటి పాలు నేయి పెరుగు త్రాగునది.

మలము తినువాటి పాలు మొదలగునవి దుర్మేధగలిగి ఆసురీ సంపద మానవునికి వృద్ధియగును. అశుద్ధము తినువాటికి పొడుచుట తన్నుట కరచుట మొదలగు దుర్గుణములుండును.

హ రి వ ం శ ము:—కృష్ణుడు గోరక్షణచేసెను. అనగా మనుష్యమలము తినక దుర్గుణములు లేనివే దైవీసంపదగలవి. అట్టి గోవుల కాచెను. అవి దేవతాసమములు. బ్రాహ్మణ తుల్యములు. అనగా గోరూపదేవతలను కృష్ణుడు గాచెను.

శ్రీ కృష్ణుడు వెలగచెట్టు గాలితగిలి రేపల్లెలో రోగాలు రాగా దానినికొట్టబోవ ఆతనికొడుకులు భార్యలగు ఆవులు వేలకువేలు కృష్ణుని గోపకుల తన్నుట పొడుచుట కరచుటచే చంపనుద్యోగింప గోపాలురు పారిపోయిరి. వాటినన్నిటిని కృష్ణుడు నానావిధంబుల బరిమార్చినాడు. మరియు అట్టి ఆసురీ సంపదగల యేడాబోతులను జంపినాడు. గాన ఆసురీసంపద జంతుపక్షులను వృద్ధిచేసిన యిహాపరసుఖముండదు. వీటి నేయి దేవతలకు అగ్నికి ప్రీతిగాక శపింతురనదగును. గయ్యాళియై వ్యభిచారిణిగాని భార్యను పోషించునట్లు మలముతినని, పొడి చెడి తన్నెడి ఆవులను పోషింపదగును.

తైత్తిరీయము-నారాయణప్రశ్నము:— గోజా, భగ వంతుడు, దైవీసంపద ఆవుపాలరూపమున నున్నాడు.

భారతము - ఆదిపర్వము:—చచ్చిన నాళీకజంఘుడను కొంగ దైవీసంపద,గోవుపాలుదూడత్రాగు నురగపై బడి బ్రతికె నది. గాన పాలు పాలనురగయుగూడ అమృతమే-గోమహిమ

చాలగలదు. వ్రాసిన పెద్దపాత్రమగును. గోదానము చేయువారు, గోరక్షణ సంఘమువారు, గోసంతతి వృద్ధిచేయువారు. దైవీసంపద గోజాతిని, అట్టిసంపదగల ఆజాతి జంతువుల, కుక్కుటాదిపక్షుల సత్సంతతివృద్ధిచేసి ఆసురీసంపదను విడుచునది లేక అడవిని విడుచునది లేక దుష్టులరాజు ద్వీపాంతరము చేర్చునట్లు మానవమలములేని సాధుప్రదేశములను పర్వతముల బయళ్లనుంచిన కొంతకాలమునకు సాధువులయిన వాటిని గ్రహించి యితరములను సాధువులగు వరకు అచ్చటనే యుంచునది.

—: భూలోక పాఠశాలలు :—

పాశ్చాత్యులు ఖనిజరసాయనాది అనుభవ శాస్త్రములు, మన వేదవేదాంత గణితవైద్యాది శాస్త్రములు పురాణేతిహాసములుకల్పి గొప్ప పరీక్షల ఉత్తీర్ణులై సత్యార్థములు చెప్పగల మేధావంతులగు ఉపాధ్యాయులచే నేర్పించిన భూలోక సర్వదేశబాలురు సత్య విద్వాంసులై జ్ఞానులై యుద్ధాదులు రానీయక యిహపరసుఖములు పొందుదురు.

మనుస్మృతి:—'మనస్సత్యేన శుద్ధ్యతి. బుద్ధిర్జ్ఞానేన శుద్ధ్యతి. విద్యాతపోభ్యాంభూతాత్మా.' సత్యమున మనస్సు, జ్ఞానము అనగా నా సర్వమును భగవంతునిగా చూచుటచే బుద్ధి విద్యాతపంబులచే అనగా ప్రకృతివిద్యలు. శరీరపోషణకు, బ్రహ్మవిద్య తెలిసికొని జపతపంబులచేయుట మోక్షమునకు నేర్చి చేయుటచే జీవాత్మశుద్ధియై, పరమాత్మగా మార్పు

జెందును. క్షాంతి, అనగా ఒకడవమానముచేయ మరల అపకారముచేయకుండుట (దీన అవమానము చేసినవాని పుణ్యమును అవమానము పడినవాడు పొందునని. భారతము:- శాంతి పర్వము, హంసగీత)ను విద్వాంసులును, దానముచే అకార్యములు చేసినవారును, జపముచే రహస్యకృత పాపములు, వేద వేత్తలు తపస్సున శుద్ధిగాంతురు. యివి చెడ్డాహారము తిను వాడు బొందలేడు.

చెడ్డాహారమున చెడుజీవులుండుటచే వాటి సహవాసమున, దుష్టమనస్సు దుర్బుద్ధులుగల్గును. సాత్వికాహారమున సాధుజీవులుండుటచే సత్సంగముగల్గి దానస్వర్గకై వల్యము లిడునని అందరికి తెలియుచున్నది. దుష్టాహార దుష్టపానముల అకాలమృత్యువు. సాధ్వాహారమున పూర్ణాయువు, సౌఖ్యము గల్గును. దుష్టులకు పూర్ణాయువుగల్గినను సౌఖ్యజ్ఞానములుం గలుగక నానాకష్టములతో బాధపడుచుందురు. ప్రస్తుతము భూలోకమున ప్రజారాజ్యము లెక్కుడున్నవి. గాన గృహస్థులె సాత్వికాహారవృద్ధి చేయునది. తమ అభిప్రాయములు నెరవేర లేదని, చెడుపానముల చెడ్డాహారముల నెరిగితిని. ఆత్మ హత్య చేశికొనువారిది మానవజన్మముగాదు. మానవజన్మము కష్టసుఖములతో భగవంతుని చేరుటకై యున్నది. గాన శరీరులు కుమారులు సత్యాదులగల్గి యేదో వృత్తిని భుక్తి గడుపుకొనుచు భగవంతుని పూజించుచు కాలము గడపుటే పరమాత్మమార్గము.

—: పిల్లలకనిన వెనుక రక్షణ :—

బృ హ త్ప రా శ ర హో ర సా రాం శ ము:—

శ్లో॥ చాతుర్వింశతి వర్షాణి యావత్ గచ్ఛంతి జన్మతః
జన్మారిష్టంతు తావత్స్యా దాయుర్దాయం నచింతయేత్॥

జాతకునికి 24 యేండ్లు వెళ్లువరకు ఆయువు నిర్ణయించ రాదు. నాస్తికుడు పరీక్షకును, ఆస్తికుడు నమ్మికతోనూ, పుత్రపుత్రికలు పుట్టగానే దగ్గరవుండి సరియైన ఘడియలుకట్టి జాతకచక్రమందలి గ్రహముల సరియైన పంచాంగమురీత్యా వేయవలెను. (అనగా జాతకముహూర్త భాగయోగముల చెప్పిన స్థానములగల గ్రిహఫలములిడు గణితభాగము). అట్లు సరిపోవని-చో సరియైన పంచాంగము గాదని నిర్ణయించవలెను. యే పంచాంగము ఋషికృతములు జ్యోతిశ్శాస్త్ర భాగము లగు "బృహత్పరాశరహోర" జైమిని "వశిష్ఠసంహిత" నారదసంహిత మొదలయిన గ్రంథముల యోగములకు స్థాన గ్రిహములకుగల ఫలములు నిచ్చునో అదియే సరియైన పంచాంగము. ఇటులే వైద్యాది సర్వశాస్త్రములు గ్రహించేది. నిష్ఫలమైనది శాస్త్రముగాదు. శాస్త్రమున అందు చెప్పినదానికి సరియగు అర్థముగ్రహించి చేసినఫలమిడునది. తప్పిన-చో తనఅర్థము తప్పినదనిగ్రహించి మరలమరల అర్థము చెప్పి సత్యార్థము తేలుపరకు చేయదగునేగాని శాస్త్రము లబద్ధమవరాదు. సకలగ్రహములు లగ్నమువేశిన గొప్ప జాతకమో తక్కువజాతకమో తెలియును. రామాయణములో

రామాదుల జాతకముతో వానిని విష్ణువని బాల్యముననే గ్రహించిరి. తరువాత వారట్లే ధర్మస్థాపనచేసిరి. పుత్రుడు పితరులకు తనకు యిహాపరముల సహాయపడుటకు హీనుడో దుష్టుడో గొప్పవాడో బాల్యముననే గ్రహించుటకు వీలైన దీ జ్యోతిశ్శాస్త్రము-హీనుడయిన భార్యలోపము తన లోపముల నేదియో నొకటున్నదని గ్రహించి మరల గొప్పపుత్రుని గనుటకు ప్రయత్నించవచ్చును. లేనిచో 25 యేండ్లకుగాని పుత్రుని సంపూర్ణ యోగ్యతా యోగ్యతలు తెలియవు. గొప్పవానిని పుత్రునిగాగనిన వానిపై కుటుంబభారముంచి తండ్రి నిష్కామమార్గాన భగవంతుని సాయుజ్యపదవి చెంద భారత దేశ పూర్వసంఘములవారు పాటుపడెడువారు. నేడది తగ్గి యింద్రియసుఖునులకై పశ్చిమ దేశజులజూచి పాటుపడుచున్నారు. గృహస్తునిపిల్లలు విద్యాధనమును పెద్దపిల్లలు ధనమును తండ్రి తపోయోగధనముల నిత్యము పూర్వము సంపాదించువారు. దాన అజ్ఞానక్షామ గ్రహదోషాదులగల్గు దుష్టఫలములులేక సర్వసౌఖ్యము లనుభవించినారు. నేడు ఎటులయిన ధనమార్జించుటే గొప్పపనిగా నున్నది. కొన్ని దేశాలలో ఎక్కువ ధనవంతులు నానాకష్టములు బడుచున్నారు. గౌరవములేదు. పేదవారికి కూడు గుడ్డలు గడుచుచున్నవి. కొన్ని దేశాలలో ఎక్కువధనవంతులు వారిని సేవించి పేదవారును పరులవలన యుద్ధములుగలుగునన్న భయముతో యింద్రియసుఖము లనుభవించుచున్నారు. యిట్లు

ఆసురీసంపద వృద్ధిచేయుచున్నారు. గాని దైవీసంపద సంతతి నెక్కుడుగా వృద్ధిచేయుటలేదు. మొత్తమున ఆయా దేశస్థులకు పరసుఖాపేక్ష చాలవరకు నశించినది. దైవీసంపద వారయిన పరోపకారము చేయకుండుట నిర్భయులై యిహాపర సుఖముల గాంతురు. గనుక సాధారణముగా హీనజాతికుల కంతగా బాల్యమున పీడలుండవు. గొప్పజాతికులకు మధ్య మధ్య పీడలు గల్గుచుండును. గాన 24 యేండ్లు దాటువరకు ఆయుర్నిర్ణయము చేయరాదు. అంతవరకు తండ్రి తల్లి సన్మార్గ వర్తనులై —

పరాశర హోర సారాంశః :—

శ్లో॥ జపహోమ చికిత్సాద్యైః। బాలరక్షాంతు కారయేత్॥
పిత్రోర్దోషైః మృతాః కేచిత్। కేచిత్ మాతృగ్రహైరపి॥
అపరేరిష్ట యోగాచ్చ త్రివిధా బాలమృత్యవః॥

కొందరుబాలురు పితృ మాతృ గ్రహదోషములను కొందరు అరిష్టములచేతను మృతిచెందుచుందురు. వారికి అకాలమృత్యువు గలుగకుండా 24 యేండ్లుదాటువరకు జప హోమ చికిత్సాదులచే రక్షించునది. చెట్టుకు దోషము గల్గిన మరణము పువ్వులు కాయలు రాలునట్లు తలితండ్రులచేయు దోషములు సంతతికి బాధలు గల్గించును. గాన వారి రక్షణకు తమ రక్షణకు తలిదండ్రి ఎక్కువ జాగ్రత్తగా నడువదగినది. విష్ణు, శివ, ఇంద్రాదులు పుత్రులుగాబుట్టిన వారికి అరిష్ట బాధలు గల్గునని సామాన్యము.

భారతమున:—మాండవ్యుడు బాలుడు 14 యేండ్లు దాటువరకు యేదోషము చేసినను దాన పెద్దదోషము చెందడు. వానికి అపకారము చేసినవారు పాతకులగుదురు. 16వ యేడు వరకు తలిదండ్రులు కాపాడదగుననియు 16వ యేటనుంచి పుత్రుని మిత్రునిగా భావింపదగును అని గరుడ పురాణము— మిత్రుడనగా ఆపదలను సౌఖ్యముగా నడుపువాడు, తలిదండ్రులకుగల్గు కష్టముల సుఖముగా చేయు సాయపడు శక్తియు సుఖముల మరింత సౌఖ్యమిడు శక్తియు ఆకాలమునకు గల్గునని ఋషుల అభిప్రాయము. పుట్టినప్పటినుండి పుత్రుని విష్ణు, శివులు లేక తమతమ మత దేవునిగా పుత్రికల దుర్గా లక్ష్ములుగా జూచుట తలిదండ్రులు నేర్చిన సాధారణముగా రోగములు బాధలుంగల్గక మేధావంతులగుదురు. పుట్టినపుడే దేవునిగా దేవిగా చూడబడిన పిల్లలు అమోఘశక్తివంతులగుదురు అని నా యూహ. (వర్జనక్షత్రాది దోషముల పుట్టినవానిని జూడరాదు) దేవునిగా జూడలేని వో దోషముంతయు నెక్కును. గాన తగినశాంతులు చేసినతర్వాతనయినా దేవునిగా నిత్యము జూడగల్గిన నానావిధదోషములు నివారించును. గాన తలిదండ్రులు యీ దివ్యదృష్టిచేతను జపాది చికిత్సలచేతను పిల్లలను రక్షించుకొనవలెనదిగా గ్రహించవలెను.

—: భగవత్ప్రార్థన :—

పూర్వము రాజగృహస్థుడు రాజ గృహస్థురాలును గృహస్థుడు గృహిణి రాణి తమరాజ్యమున తమయింటగల - దేవా

ధారుల రక్షింపుమని దుర్మార్గము మమ్ము చేరకుండ రక్షింపుమని భగవంతుని ప్రార్థించి సౌఖ్యపడిరి. నేడటులే చేయుట శుభదాయకము.

—: యజుర్వేదము – శతరుద్రీయము :—

మం॥ మానోమహాంతముతమానో అర్భకం మానఉక్షంతము తమానఉక్షితం । మానోవధీపితరోర మాతరం ప్రియా మాన స్తనవో రుద్రరీరిషః । మానస్తోకేతన యేమాన ఆయుషిమానో గోషుమానో అశ్వేషురీరిషః। వీర న్మానో రుద్రభామితో వధీర్హావిష్మంతో నమసా విధేమతే॥

ఓ భగవంతుడా! మాకు పూజ్యులగు గురువు మిత్రులగువారిని బాలుర తేజోన్వీత యువకుల గర్భస్థ శిశువుల మా తలిదండ్రుల మా దేహముల ఆయువును హింసింపకుము. మరియు మా అపరాధములచే నీకు కోపముకల్గి మా పసిపిల్లలను, గోవుల, గుఱ్ఱముల (యితరజంతువుల, పక్షులను హింసింపకుము) నీకు అగ్నియందు హావిస్సు నిచ్చువారమగు మేము అనేక నమస్కారములు చేయుచున్నాము.

ఆస్తికులు అనేక సుశక్తులు నేతియందున్నవనియు అగ్ని ఊర్ధ్వముగా పోవుటచే భగవంతుని చెందుననియు నేయి అమృతమగుటచే భగవంతునికిగాని, దేవతలకుగాని [illegible]ట మంచిదనియు, భారతదేశమున నేతిని హోమము [illegible] యీ హోమముచే యేదికోరిన అది సిద్ధించుట

కలదు. గాన వారందరి రక్షణకు చేసిరి. అట్లు వారును రోగాలులేక రక్షింపబడెడువారు. నాస్తిక మతస్థులుకూడా "ఋణంకృత్వా ఘృతం పిబేత్" ఋణముచేసి నేయిత్రాగు నది అని అంగీకరించుట. దీన సౌఖ్యమున్నదని తెలియుచు న్నది. అగ్నిపై నేయివేసిన దాని జ్వాలవలన దుష్టక్రిమ నాశనమగును. భగవంతుని పేరున దేవతల పేరున వేసిన మరింత సుశక్తికలిగి ఎక్కువ దుష్టక్రిమి హారమగునని తెలియ వలెను. దీని జ్వాల శరీరమంటిన దేహము క్రిమినాశనమై అమృతత్వము జెందును. అందుచే నేయిభక్షణ శ్రేష్ఠ మైనది. అది యోగ్యగోఘృతమందు గలదు. దుష్టగోఘృ తము ఆసురీసంపదను వృద్ధిచేయును.

—: శాస్త్రప్రమాణము గొప్పది-అందులో అనుభవమార్గములు గొప్పవి :—

శాస్త్రములు అనుభవార్ధము తెలిసిచేసిన తప్పక ఫల మిచును. శాస్త్రములు తప్పనరాదు. ఋషులు సత్యవంతు లగుటను అవతారపురుషుల వాక్యమే వేదమగుట సత్యమగు టను తప్పనరాదు.

గీత॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిః॥

శాస్త్రధర్మములు విడిచి చరించువారికి యిహపరములు లేవు. సత్సంతతి గనుటలోగాని యితర సత్ఫలమిడు మార్గాల గాని ఆసురీసంపదవారగు వ్యభిచారిణులు దుష్టపురుషులు మేము చేసితిమి. ఆశాస్త్రములు సత్యముగాదని సాక్ష్యమిచ్చినను

నమ్మరాదు. తర్క వ్యాకర్ణాది శాస్త్రజ్ఞునైననూ శృతి స్మృతి పురాణేతిహాస జ్యోతిషాయుర్వేదాది సద్గ్రంథములకు సత్ఫలమిడని అర్థముచెప్పువారిమాటలు నమ్మరాదు—ఆచరింపరాదు. సత్యార్థముచెప్పువారిమాట నమ్మదగినది.

—: ఆ నం ద ము :—

గ ర్భో ప ని ష త్తు:— కర్మేంద్రియములలో 'ఉపస్థ ఆనందేవర్తతే' భార్యాభర్త సంయోగయజ్ఞమున ఆనందము గల్గును— (యీా సంయోగయజ్ఞము దక్షప్రజాపతి మొదట కనుగొనెను. బ్రహ్మపురాణము) పరస్త్రీయందు పరపురుషునికి మొదట కొంత సుఖముగనున్నను తుదకు నానాకష్టములపాలు చేయును. యిద్దరుపురుషులున్న గృహామనబడదు. భార్యాభర్తలిద్దరు వసించునది గృహామనబడును. భార్యలేనిచో అడవియనబడును.

యో గ శి ఖో ప ని ష త్తు:—

శ్లో॥ యోనిమధ్యే మహాక్షేత్రే జపాబంధూక సన్నిభం
రజో వసతి జంతూనాం దేవీతత్వం సమాహితః
రజసో రేతసో యోగో రాజయోగ ఇతి స్మృతః
అణిమాది పదం ప్రాప్య రాజతే రాజయోగతః॥

భార్యాభర్తల సంయోగయజ్ఞమే యింద్రియ సుఖానందము గల్గించును. యిది అల్పసుఖమైనను మిగిలిన కర్మేంద్రియములవిరిత ఆనందములేదు. రజస్సుయిుపతరువాత అగ్ని ■ [illegible] శ్రేష్ఠమగు యోనిమధ్య ప్రాంతమును. అరజస్సు

పురుషుని రేతస్సు గూడుటయే రాజయోగము. దీన అణిమాది సిద్ధులుగల్గుచురు. అనగా భార్యాభర్తల సంయోగ యజ్ఞముచే సంతానము గల్గును. అల్పసుఖమగు నీ యింద్రియానంద ములోపడి మునుంగక అవతారపురుషుల, బ్రహ్మర్షుల, మహా ర్షుల, ఋషుల, రాజర్షుల గనుట పరమోత్తమము. వీరిజన్మ ములు శ్రేష్టములు. యిట్టి వారిచే పాలింపబడు ప్రజలు శామాంబరీపాది రాజ్యప్రజలవలె సర్వసౌఖ్యములనుభవింతురు. వీరితర్వాత మునిరాజు ధర్మముగా పాలించును. పైవారందరు నిష్కామముగ పాలింతురు. దేవతారాజు సకామ ధర్మ మున పాలించును. యితని జన్మము ఉత్తమము. రాక్షసరాజు దుష్టధర్మస్థాపన జేసి యిహపరసుఖములు లేక బ్రతికినంతకాలం భయముతో చరించును.

పైవారికి రాజ్యసహాయులు :— భూలోక ప్రజలు 4 సంఘములు. బ్రాహ్మణులు అనగా యింజనీర్లు, క్షత్రియులు అనగా సైనికులు, వైశ్యులు అనగా వర్తకులు, శూద్రులు సచ్ఛూద్రులు అనగా రైతులు. పైవారికి రాజు యీసంఘముల బుట్టిన అజ్ఞానులకు ఉద్యోగములన్నియునిచ్చి జ్ఞానులుగాచేయును. నాల్గుజాతులను శూద్రులు అన అజ్ఞానులు పుట్టుదురు. వారు వీరికి యజ్ఞముల, యుద్ధముల, వర్తకముల, వ్యవసాయముల సాగుటకు సేవకులై సాయపడుదురు. వీరి శ్రీకరు సాయములేనిచో సంఘములు సాగవు. గాన వీరికి యింద్రాది దేవతల పూజించు జ్ఞానమార్గము నేర్పి తమవంటి

వారినిగా కొందరినైనను జేసెదరు. యీ బ్రాహ్మణ క్షత్రియాది సంఘములు నాల్గు వేదమార్గస్థులు. సత్కామ సన్మార్గులు. అవతారపురుషుడన బ్రహ్మమునకు అపరమూర్తి. పుట్టుకతోగాని మధ్యగాని బ్రహ్మజ్ఞాని కొంతకాలము కృషిచేయ బ్రహ్మర్షి యగును. యీకాలాన యితడు అవతారమూర్తి తుల్యబలుడగును. మహర్షి ముప్పాతిక బలము, ఋషి అర్ధ బలము, రాజర్షి పాతికబలము, ముని అష్టాంశబలముగలవారు. యీ బ్రహ్మర్ష్యాదులు వేదాంతబ్రాహ్మణులు. వీరు రాజ్యమేలు రాజులుగాగాని, మంత్రులుగాగాని యున్న ప్రజలకు సర్వ సౌఖ్యములిడుదురు. వీరు నిష్కాములు. వీరిని చేరిన అజ్ఞానులను అన శూద్రులను తమవంటివారిగా చేయగలరు. భూలోక సర్వదేశాధ్యక్షులలో ప్రస్తుత భారతదేశ అధ్యక్షుడు బాబు రాజేంద్రప్రసాద్ గొప్ప సన్మార్గ నిష్కామ తపస్వి. మంత్రి నెహ్రూజీ గూడ నట్టివాడే. గాన వీరున్నంతకాలము వీరి కాపదవులనుంచి భారతదేశ గృహస్థులు హీనులగని దేశనాశనము చేయక ముందు దేశరక్షణకు తమరక్షణకు బలమగు సన్మార్గ నిష్కాముల సృష్టించదగినది.

తై త్తి రీ యో ప ని ష త్తు:— భూలోకమంతయు నేలు సార్వభౌముడగుట లేక సార్వభౌముని గనుట మనుష్యానందము. భగవంతుని నిష్కామ సర్వేంద్రియధ్యానవిష్ణున కీయానందమును ముందు చెప్పుసర్వవిధానందములున్నుగల్గును. దీనికన్న మనుష్యగంధర్వానందము, దీనికన్న దేవగంధర్వా

నందము, దీనికన్న పితౄణానందము, దీనికన్న ఆజానజదేవానం
దము, దీనికన్న కర్మదేవానందము, దీనికన్న దేవానందము
యింద్రానందము, దీనికన్న బృహస్పత్యానందము, దీనికన్న
ప్రజాపత్యానందము, దీనికన్న బ్రహ్మానందము గొప్పది.
యింతకుమించిన ఆనందములేదు. సర్వపాలకుడు, సర్వసృష్టిస్థితి
లయకరుడు, సర్వజ్ఞుడు, అగు భగవంతునిగా మారినవాడే
తాను బ్రహ్మమాట నిశ్చయమై బ్రహ్మానందము నొందు
చుండును. భగవంతుని నిష్కామభార్యానిష్ఠులగు భార్యా
భర్తలు సార్వభౌమాదులగని వారినిచూచి ఆ ఆనందముల
నొందుచుందురు. భగవంతుని పుత్రులనిగాబడసి బ్రహ్మానందము
చెందుచుందురు. యీ ఆనందములు సార్వభౌమునిగా,
యింద్రాదులుగా తమ్ము భావించి స్థిరపరచిన ఆ యానంద
ములు గల్గును. అట్లే తన్ను బ్రహ్మముగా భావించి స్థిరపరచిన
బ్రహ్మర్షి యగు. యీస్థితి, నిజమా, కాదా అను సత్యమును
తెలియుటకొరకే తాను భార్యయు స్వల్పకాలమన్న సర్వమేధ
యజ్ఞము చేసినంతకాలము పై యింద్రాది రూపధారణ
చేసినచో యింద్రాదులు పుత్రులుగా పుట్టుట నిజమైనచో
తమ ధారణ సత్యమనియు, లేనిచో మాటలమాటల స్థిరపరచి
కనదగును. తప్పనరాదు. ఆవతారపురుషుడు బ్రహ్మర్షి
మానవసృష్టి శ్రేష్ఠులు, దుష్కామముచే సంకరజనుల సృష్టింప
చుటయు, కూతురు చెల్లెలయందు బలాత్కారముగ బ్రహ్మ
జ్ఞానస్త్రీని అజ్ఞాని పొందుటచే మానవజన్మములో అర్థమా

ధమజనుడగు చండాలుడు పుట్టుట తేలికగదా. వీరిచే కన్న వారికి వారికి నానాకష్టములు గల్గునుగదా. యిట్టివారును బ్రహ్మధ్యాననిష్ఠచే బ్రహ్మర్షులగుదురు. యిట్టివారల కనుట మాని భార్యాభర్తలు తమ్ము బ్రహ్మముగ స్థిరపరచినను అట్లు స్థిరపరచినకాలాన సంయోగయజ్ఞముచేసి మహాపురుషుల గనినను, అణిమాదిసిద్ధులు గల్గిన బ్రహ్మర్షులగుదురు. భార్యకు తనకు కుదరనిచో ఆమెకు బ్రతుకుటకు తగిన ధనాదులిడి తాను బ్రహ్మర్షిసిద్ధికై ఎక్కువ కృషిచేయదగును. పుత్రులకు పుత్రికలకు ప్రకృతివిద్యలు ధనము సంపాదించుటకు, బ్రహ్మవిద్య కైవల్యమునకు నేర్పి, బ్రహ్మర్షులగునట్లు చేయునది. అట్టి బ్రహ్మర్షులచే తలిదండ్రులు, పితరులు, భార్య, పిల్లలు, శిష్యులు తరించి మహర్షులై బ్రహ్మానందములో సర్వసౌఖ్యము లనుభవించి వారి అనంతరమును బ్రహ్మానందయుక్త బ్రహ్మమగుదురు. పూర్వము ఒకనికి స్థిరమయిన భగవచ్ఛక్తి గల్గినగాని భగవంతుడని పిలువలేదు.

ఉదా:— విశ్వామిత్రాదులు — నేడు నట్లుగలిగినగాని బ్రహ్మర్షి అనబడడు. సచ్ఛక్తులు, అణిమాదులు గల్గుట కొందరు లాభములేదనుచున్నారుగాని సూర్యునియందు కాంతివలె సర్వశక్తివంతుడు భగవంతుడగుటచే అతడు కోరకున్ననూ అణిమాదులు సర్వశక్తులు బ్రహ్మర్షి నాశ్రయించి యుండును. పడమటదేశాల దేశాధ్యక్షుడగువానిని మంత్రిని మహాపురుషులనుచున్నారు. వీరికి ధర్మార్థకామమోక్షముల

నొందు సత్యమార్గములు తెలియవు. ధర్మముననో అధర్మ ముననో ధనము సంపాదించి సౌఖ్యముగా తిని ధర్మముగనో అధర్మముగనో యిందిరియసుఖములందుటే సౌఖ్యమార్గమని వారి నవీననాగరికతఫలము. వీరు దుష్టులైన యివియు గలుగవు గదా. సామాన్య ధర్మజ్ఞులును వీరిని చూచి యితర దేశజులును రాజ్యపాలకులు రాజసేవకులగూడి కృషిచేయుచు యిహ సుఖము గోరుచున్నారు. భారతదేశాన బ్రహ్మానందయుక్త లయి భార్యాభర్తలు బ్రహ్మర్ష్యాది ఋషులగువారిని సృష్టించుట గృహస్థాశ్రమ గొప్పతనము. తక్కిన ఆశ్రమముల సృష్టి లేదుగాని బ్రహ్మర్షులు గావచ్చును. సజ్జనాంగీకారము తన యందు గొప్పశక్తి బయిట కన్పించువరకు భగవధ్ధ్యాన నిష్కామకర్మముల మానరాదు. గృహాశ్రమములో తాను భార్యయు బ్రహ్మర్షులగుటయు, బ్రహ్మర్షులగు పుత్రపుత్రికలగని లోకకల్యాణము చేయుటచే మానవజన్మసాఫల్యము గల్గును గదా. రెండవమార్గములేదు. రెండవమార్గములేదు.

దక్షస్మృతిః— గృహాశ్రమమునకు మూలము భార్య. ఆమె సుశీలవతియైన స్వర్గమువంటిదగును. దుశ్శీలయైన నరకమువలె నుండును అని గలదు. గాన దుశ్శీలగలవాడు ఆమెకు భోజనాదులకు తృప్తిగల ధనాదులిచ్చి భగవధ్ధ్యానము చేసికొమ్మని చెప్పి తానుగూడా భగవధ్ధ్యానము చేసికొని మానవజన్మమును తరింపజేసికొనుట మంచిది. (ఉదా:— భర్తృహరి (గ్రంథకర్త) లేక ఆ వ్యభిచారిణితో కాపురము

నున్న జారపురుషుల ఔన్నత్యమునకే తన ధనాదులు విని యోగించును. భర్త సౌఖ్యము చూడదు. మరియు భార్య వ్యభిచారిణియని తెలియక పరులకేపిల్లలు పుట్టినచో వారు పెద్దవారయేవరకు వుండి వారికి విద్యాదులు నేర్పించి తల్లిని వారికి జేర్చి ధనాదులు వదలి భగవధ్యానముచేయుటకు వేరుగాయుండి రాజర్షి ఋషి బ్రహ్మర్షి పదవులలో నొకటి సిద్ధిగాంచుట పూర్వర్షుల మార్గము. ఈస్థితినే వానప్రస్త యతియాశ్రమములనిరి. యిక్కడకు మానవునికి 50 యేండ్లు గాని 55 యేండ్లుగాని వచ్చును. భార్య వ్యభిచారిణి యని పరుల మాటలువిని విడువరాదు. తాను పరీక్షించి చూచియే విడువదగును.

అట్లు పరీక్షకు దొరకకున్న ఆమెతో కష్టములు పడుచు పిల్లలు ఎదుగువరకు తనకు వానప్రస్థకాలమున 55 యేండ్లువరకుండి తరువాత భగవధ్యానమునకు పోవలసినది. పిల్లలులేనిదయిన ఆ స్త్రీఅంతయు ఆమెపై వధలి ఆమె పుట్టినింట వారి దరిజేర్చునది. మొత్తము నీగృహస్థాశ్రమమున గొప్ప సంతానము గల్గుటకు ధర్మమార్గమున చరించుటకు కైవల్య మార్గము నొందుటకు భార్య సహాయముండితీరవలయును. మొత్తమున స్త్రీలు మంచివారు గానిచో యీగృహాశ్రమ ధర్మమంతయును నాశనమగును. గాన సృష్టిలోనే సానిత్యలగనిన యీదుష్టస్త్రీగణము వృద్ధిగాదు. మధ్యమాధమ దుష్టస్త్రీలు ధర్మబోధనతో మంచివారౌదురుగాని పూర్ణదుష్టలు దేవుడు

చెప్పినను వినక శూర్పణఖవలె పుట్టినింటవారిని అత్తింటి వారిని నశింపచేయుదురు. గాన యీ భారతఋషి ధర్మ మార్గము భూలోకగృహస్థులందరు ఆచరించి తత్సుఖము నొందుదురుగాక. అట్లాచరించువాడే లోకైక కల్యాణగృహస్థుడు. రెండవమార్గములేదు. రెండవమార్గములేదు.

ఇందు వ్యాకర్ణము, సంధులు గొనలేదు. ఇందు భారతధర్మము గొప్పదనియు పాశ్చాత్యధర్మము సామాన్యమని నేను వ్రాసినది, భారతాభిమానమునగాదు. మొత్తమున మానవశ్రేయోధర్మముగోరి వ్రాయుటలో భారతధర్మములు గొప్పగానున్నవి. గాన వాటిని భూలోకస్థులు పరీక్షించునది. మానవధర్మము మంచిది. యేదేశజులైనను గొనవచ్చునుకదా. ఇది కథకాదు. ధర్మగ్రంథము. గీతలో అక్కడక్కడ చెప్పినది మరల చెప్పినట్లు బలమగు ధర్మమని తెలియుటకే రెండవ సారి చెప్పినను అట్లుంచితిని. ఋషి ధర్మము లాచరించి ఫలము జెందుడు.



రాయల ముద్రణాలయము, తెనాలి — ఏప్రిల్ 1956.